# మూడు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## కలలోని హంతకుడు

రచన : వసుంధర

## మాయమైన వంటగత్తె

(పరువు ఖరీదు-రెండవ భాగము)

రచన: 'సికిందర్'

## బంగారు గూడు-వజ్రాల గుడ్లు

రచన: అజీజ్

## అడుగు ముందుకు వేస్తే చస్తావ్!

ఏడవ భాగము—రచన: వసుంధర

**అపరాధ పరిశోధన సప్లిమెంట్ — 67**
జూలై, 1979
వెల: రు. 3-50
ఏడాది చందా 45 రూపాయలు
జీవిత చందా 275 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
**శ్యామదామోదర్ రెడ్డి**

సంపాదక వర్గం:
**టెంపోరావ్**
**శ్యాంబాబు**
**రమణశ్రీ**
**ఏ. వీ. మోహన్రావ్**
**సుజనశ్రీ**
**వసుంధర**
**విద్వాన్ షీలాదేవి**

కార్యాలయం:
**అపరాధ పరిశోధన కార్యాలయం**
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
**క్రాంతి ప్రెస్,**
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

20-6-79

[illegible]

# కలలోని హంతకుడు

వసుంధర

"నన్ను చంపవద్దు" అన్నదామె.

"నేను వచ్చింది నిన్ను చంపడానికి. వద్దంటే ఎలా?" అన్నాడతను.

"నువ్వు చెప్పినట్లు వింటాను. నువ్వేం చెప్పినా చేస్తాను. నన్ను మాత్రం చంపవద్దు. ప్లీజ్" అన్నదామె.

"ఈ నిర్ణయానికిదివరకెప్పుడో రావలసింది. ఇటీజ్ టూ లేట్!"

"ప్లీజ్-ప్లీజ్" అరుస్తోందామె.

"నీ అరుపులు బయటకు వినిపించవు. నువ్వు బయటకు పోలేవు. నా గుండె కరుగదు. అందుకని వృధా ప్రయత్నాలు మాని దేవుణ్ణి ప్రార్థించుకో. అయిదునిమిషాలు మాత్రం టయిమిస్తున్నాను" అన్నాడతను.

"నిండా పాతికేళ్ళు లేని నాకు నువ్విచ్చే అయిదు నిముషాలూ ఏం సరిపోతాయి? నాకింకా చాలాకాలం బ్రతకాలనుంది. అందుకోసం నీకు బానిసలా పడుండమన్నా పడుంటాను. నన్ను మాత్రం చంపవద్దు....నన్ను చంపవద్దు...." అన్నదామె.

# 4

ఆమె పరిస్థితి చూస్తుంటే అతనికి జాలి కలగడం లేదు. నవ్వు పుట్టుకొస్తోంది. అతను తన జేబులోంచి పిస్తోలు తీసి ఓపెన్ చేసి "ఊఁ గుళ్ళు సరిగ్గానే వున్నాయి" అంటూ గొణిగాడు.

"ప్లీజ్ నన్ను చంపవద్దు" అన్నదామె.

"అబ్బబ్బ ఈ ఆడవాళ్ళతో ఇదే బోరు. కాళ్ళూ చేతులూ కట్టిపడేసినా సరే నోరుమాత్రం ఊరుకోదు" అన్నాడతను విసుగ్గా.

పిస్తోలు పక్కనున్న టేబుల్ పైన పెట్టి ఆమెను సమీపించాడు.

"నీకు దణ్ణం పెడతాను నన్ను చంపవద్దు" అందామె.

"ఎంతసేపూ ఒకటే డైలాగు చంపొద్దు, చంపొద్దు అని. నేను నువ్వు చెప్పినమాట వినడానికిక్కడకు రాలేదు. నీ వాగుడు భరించలేకుండా వున్నాను. ఇంకా నిన్ను చంపడానికి కొంత గడువుంది. అంతవరకూ నిశ్శబ్దంగా వుండు" అంటూ ఆమెనోటికి టేప్ అంటించాడు.

నిస్సహాయంగా మూలిగిందామె.

అతను మళ్ళీ వెనక్కి వెళ్ళి పిస్తోల్ ను జేబులో వేసుకుని "ఇది నిన్ను చంపడానికి కాదు. నిన్ను చంపడానికి వేరే ఆయుధముంది. నీ పనయ్యాక ఇంకొకళ్ళను చంపాలి. దానికీ ఈ పిస్తోలు" అన్నాడు.

ఆమె మాట్లాడడంలేదు. కానీ ఆమెకళ్ళు చూస్తే ఆమె చెప్పదల్చుకున్నది అర్థంచేసుకోవచ్చు. ఆ కళ్ళు ఎంతో దీనంగా అతన్ని అర్థిస్తున్నాయి. తన నిస్సహాయతకు సూచనగా ఆ కళ్ళలోంచి ధారాపాతంగా నీళ్లు

కారుతున్నాయి.

"చావాలని ఎవ్వరికీ వుండదు. ఎప్పుడు తమమీదకు చావు వస్తుందోనని భయపడుతూంటారు. చావు ముందుగా తెలిసిరావడం ఎక్కడో అదృష్టవంతులకుగానీ పొసగదు. నీ అదృష్టాన్ని అభినందించుకో. నువ్వు నిస్సహాయంగా కొద్ది నిముషాల్లో చచ్చిపోతున్నావు. చేసిన పాపాలేమైనా వుంటే పోవడానికి దేవుణ్ణి ప్రార్థించుకో-నన్ను అర్థించి, నా వైపు జాలిగా చూసి నీ సమయాన్ని వృధా చేసుకోకు" అన్నాడతను.

కానీ ఆమె దేవుణ్ణి ప్రార్థిస్తున్నట్లులేదు. అతనివైపే యింకా అర్థింపు చూపులు చూస్తోంది. ఆ కళ్ళలో ఏ మూలనో యింకా ఆశ వున్నట్లుంది. కానీ చూస్తూండగా ఆ ఆశ భీతిగా మారింది. ఆమెకళ్ళు పెద్దవౌతున్నాయి. ఆమె ముఖంలోంచి అందం మాయమవుతోంది. అందుకు కారణం లేకపోలేదు.

అతను పొడుగాటి, పదునైన కత్తితో ఆమెను సమీపిస్తున్నాడు.

భయం ఆమె ముఖాన్ని అసహ్యంగా తయారుచేస్తే క్రూరత్వం అతని ముఖాన్ని భయంకరంగా తయారు చేసింది. అతనిప్పుడు చూడ్డానికి మనిషిలాకాక రాక్షసుడిలా వున్నాడు. మధ్యమధ్య అదోలా నవ్వుతున్నాడు. ఆ నవ్వు రాక్షసుడి నవ్వులాగే వుంది.

ఒకగోడ-ఆ గోడమధ్య భాగంలో రెండు, క్రింద రెండు-హుక్స్ వున్నాయి. ఆ హుక్స్‌కు ఆమె చేతులు, కాళ్ళు బంధించబడ్డాయి. ఆమె తన బంధనాలు సడలించుకోడానికి పెనుగులాడుతోంది. కానీ అది వృధా

ప్రయత్నం అవుతోంది.

అతను ఆమెను సమీపించి ఆమె అవస్థను చూసి పకపక నవ్వాడు. ఒకసారి తన చేతిలోని కత్తివంకా, ఆమె గుండెలవంకా చూశాడు. కత్తిని ఎడమచేతిలోకి మార్చి కుడిచేత్తో జేబులోని పెన్ను తీశాడు. అది బాల్ పెన్ను.

అతను ఆమెకు బాగా దగ్గరగా వచ్చి ఆమె గుండెల మీది ఆచ్ఛాదన తొలగించి-కొంచెం ఎడమప్రక్క బాల్ పెన్నుతో సున్నాచుట్టి మళ్ళీ నవ్వాడు.

"సరిగ్గా ఆ సున్నా వెనుక నీ గుండె వుంది. ఇది ఇప్పుడు ఇదివరకెన్నడూ ఎరుగని వేగంతో కొట్టుకుంటోంది. నా కత్తి సరిగ్గా ఈ సున్నాలోంచి నీ గుండెల్లోకి దిగబడుతుంది. కళ్ళు మూసుకో-నువ్వీ ఘోరాన్ని చూడలేవు. ఇంక నా వైపు చూడ్డంమాని నీ యిష్టదైవాన్ని ప్రార్థించుకో. ఒక్క నిముషం మాత్రమే నువ్వు జీవిస్తావు. నీకు నేనివ్వగల హామీ అల్లా సునాయాస మరణం. ఒకేఒక్క పోటుతో నీ ప్రాణం పోతుంది. అందులో ఏమీ సందేహం లేదని అనుభవం నాకు చెబుతోంది" అన్నాడతను.

ఆమె పెదవులు కదిలే అవకాశముండి వుంటే అన గలిగిన అక్షరాలు మాత్రం ఇవే "ప్లీజ్ నన్ను చంపొద్దు." కానీ అవి కదిలే అవకాశంలేదు. అందువల్ల ఆమె మూలుగుతోంది. ఆ మూలుగులోవున్న ధ్వనిని అతను అర్థం చేసుకో గలడు. కానీ ప్రయోజనంలేదు.

అతని కత్తి కుడిచేతికి మారింది. "కంగారుపడకు-నీ బ్రతుక్కింకా కొద్ది సెకన్లు టైము వుంది. నాది ఎడమచేతి

వాటం. కుడిచేతో పొడవడం నాకు రాదు" అంటూ అతను కత్తిని ఎడమచేతికి మార్చాడు. ఆ చేయి గాలిలోకి లేచింది. విసురుగా ఆమె గుండెల్లోకి దిగింది-సరిగ్గా అతను గీసిన సున్నాలోంచి చివ్వున రక్తం చిమ్మింది.

చివరిక్షణంలో తను అనుభవించిన బాధను, భయాన్ని ధ్వనిరూపంగానైనా బయటపెట్టుకునే అవకాశంలేని ఆ అభాగ్యురాలి తల క్షణాల్లో పక్కకు వాలింది.

* * *

"కెవ్వు"మని అరిచింది సుజాత.

ఉలిక్కిపడి లేచాడు మధు. మధు సుజాత భర్త- "ఏమయింది సుజా?" అంటూ ఆత్రుతగా ప్రశ్నించాడతను.

సుజాత కళ్ళు నులుముకుని చుట్టూ చూసి "నేనిప్పుడెక్కడున్నాను!" అంది.

మధు ఆమెను దగ్గరగా తీసుకుని "శ్రీవారి కౌగిట్లో!" అన్నాడు.

"కాదు, కాదు...." అంది సుజాత.

మధు లేచి లైటువేశాడు. లైటువెలుగులో సుజాత ముఖం చూసి ఆశ్చర్యపోయాడతను - "అదేమిటి సుజా అలా వణికిపోతున్నావు, ఏం జరిగింది?"

సుజాత తన్ను తాను తమాయించుకునేందుకు ప్రయత్నిస్తూ "ఒక దారుణమైన హత్య చూశాను" అంది.

"ఎప్పుడు?"

"ఇప్పుడే?"

మధు చటుక్కున ఆమెను సమీపించి ప్రేమగా చెక్కిళ్లు నిమురుతూ—"సుజా! ఏదయినా పీడకల

వచ్చిందా?" అన్నాడు.

"కలా? కలేమిటి? .... నిజంగా .... నా కళ్ళారా చూశాను" అంది సుజాత.

మధు ఆమెను గట్టిగా కుదిపి—"నువ్వేం మాట్లాడుతున్నావో నీకు తెలుసా? రాత్రి మనిద్దరం కలసి పడుకున్నాం. ఈలోగా నువ్వెక్కడికి వెళ్ళి వచ్చావు? ఏం హత్య చూశావు?" అన్నాడు.

అప్పటికి సుజాత ఈ లోకంలోకి వచ్చింది. మరో సారి చుట్టూ చూసి, "అవును నేనెక్కడకీ వెళ్ళలేదు. ఇక్కడే వున్నాను. అయితే ఇదంతా కలన్నమాట!" అని నిట్టూర్చింది.

"నీకు వచ్చిన ఆ భయంకరమైన కలేమిటో నేనూ తెలుసుకోవచ్చా?" అన్నాడు మధు.

"అది కలలా లేదండీ — కళ్ళముందు జరుగుతున్న నిజంలా వుంది. అది కలంటే నాకూ నమ్మకం కలగడం లేదు" అంటూ సుజాత తన కల వివరాలన్నీ చెప్పింది.

"ఇలాంటి కల నీకెందుకు వచ్చింది? ఎక్కడయినా ఎప్పుడయినా హత్య చూశావేమిటి?" అన్నాడు మధు.

"లేదండీ—కలలో కాబట్టి బ్రతికిపోయాను గానీ నిజంగా ఇలాంటి హత్యచూస్తే నా ప్రాణాలు ఆ క్షణం లోనే పోయి వుండేవి—" అంది సుజాత.

"అయితే మనం క్రైమ్ పిక్చర్స్ చూడ్డం మానేయాలి. వాటి ప్రభావమే అయుంటుందిదంతా—" అన్నాడు మధు.

"బాగుందండీ — ఆ లెక్కన క్రైమ్ నవల్సుకూడా చదవకూడదు. సినిమాలు చూసీ, నవల్స్ చదివీ పాడు

చేసుకునేటంత బలహీనపు బుర్ర కాదు నాది. ఈ కల ఎందుకు వచ్చిందో చెప్పలేను...."

"నిజమేలే—కలలెందుకు వస్తాయో సరయిన కారణం ఇంతవరకూ ఎవ్వరూ చెప్పలేక పోతున్నారు...." అంటూ లైటు ఆర్పడానికి వెళ్ళబోయాడు మధు.

"వద్దండీ—ఈ రాత్రికి లైటు వెలగనివ్వండి...." అంది సుజాత.

"ఇప్పుడేకదా బలహీనపు బుర్ర కాదన్నావు. మళ్ళీ ఇంతలోనే భయం ఎక్కణ్ణించి వచ్చింది?" అన్నాడు మధు వేళాకోళంగా.

"హత్య చేసే సమయంలో వాడెంత భయంకరంగా వున్నాడో మీరూహించలేరండీ. అలాంటి మనిషి ఎప్పుడయినా నాకు తటస్థపడితే భయంతో గుండె ఆగి చచ్చిపోతానేమో కూడా" అంది సుజాత.

మధు ఆమెను దగ్గరగా తీసుకున్నాడు.

## 2

"ఈరోజు రాత్రి మనింటికి ఒక అతిధి భార్యా సమేతంగా వస్తున్నాడు. వంటకాలన్నీ అద్భుతంగా వుండాలి" అన్నాడు మధు.

"ఏమిటి విశేషం?" అంది సుజాత.

"క్లబ్బులో పరిచయమయ్యాడతను. చాలా కలుపుగోలు మనిషి. పేరు సుధాకర్. చాలా అందగాడని ఆడవాళ్ళుకూడా అంటారు. అతనిది ప్రేమ వివాహమనుకుంటాను. అతని భార్య చాలా బాగుంటుంది. తన భార్య అందమైనదని అతనికి బాగా గర్వముంది. ఆ గర్వం అణచడానికే అతన్ని మనింటికి ఆహ్వానించాను...."

అన్నాడు మధు.

"బాగుందండీ— నేనేమైనా ఆటబొమ్మననుకున్నారా అతిథులముందు ప్రదర్శించడానికి...." అంది గర్వంతో సిగ్గును మిళితం చేస్తూ సుజాత.

"అదికాదు సుజా, క్లబ్బులో మేము కలుసుకున్నప్పుడల్లా అతను తన భార్యను అదేపనిగా పొగుతుండేవాడు. తన భార్యకు అందంతో పాటు అలంకరించుకునే తెలివితేటలున్నాయిట. చీరకట్టులో ఆమె స్పెషల్‌ట. ఇల్లు ఎలా అమర్చుకోవాలో అంతా ఆమె దగ్గర నేర్చుకోవాలిట. వంట చేసిందంటే ఆ రుచికి తిన్నవారందరూ మూర్ఛపోవాలిట. ఆమెకు రానిపని లేదు. ఇన్నిపనులూ చేసి కూడా ఆమె అప్పుడప్పుడూ భర్తతోపాటు క్లబ్బుకు కూడా వస్తుంది.

అలా వచ్చినపుడు ఓసారి నాకు అతనామెను పరిచయం చేసి—'సాధారణంగా ఆడవాళ్లు క్లబ్బుకు రాకపోవడానికి రెండే కారణాలు. ఒకటి ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్. రెండు ఇంటిపనులతో సతమతమవుతుండడం. మా ఆవిడకు ఈ రెండు సమస్యలూ లేవు—' అన్నాడు. అప్పుడు నాకు బాధ కలిగింది. బహుశా నీ గురించి అతనలాగా అనుకుంటున్నాడేమో ననిపించింది. క్లబ్బు వాతావరణం నీకు పడదనీ—అందుకే నేనుకూడా కరెంటు కోసం ఇక్కడ అటెండెన్సు వేయించుకొని త్వరగా ఇంటికి వెళ్ళిపోతాననీ అతనికి చెప్పాను. కానీ అతను అప్పుడు అదోలా నవ్వాడు. ఆ నవ్వు చూడగానే ఆ దంపతులకు నిన్ను చూపించాలనిపించింది" అన్నాడు మధు.

"మీకు నాపైనగల అభిమానానికి చాలా సంతోషం,

కానీ మీకింతటి కాంప్లెక్సు పనికిరాదు. మనం బ్రతికేది ఎవటి వాళ్ళ కోసం కాదండీ. మనకోసం. మన ఆనందం కోసం. మిగతావన్నీ నెక్స్టు. సరే—ఈసారికి మీకోరిక తీరుస్తాను గానీ, ఇకముందెన్నడూ ఈ కారణంగా అతిథులను పిలవకండి. మనని అభిమానించేవాళ్ళూ మనం కావాలనుకునే వాళ్ళూ—వీళ్ళు మాత్రమే మన స్నేహితులు" అంది సుజాత.

మధు వెళ్ళిపోయాక సుజాత ఇల్లంతా నీటుగా సర్దింది. సుమారు గంటసేపు ఆలోచించింది వంటకాలు గురించి. అన్నీ ముందుగానే ఆలోచించుకున్నా మధ్యాహ్నం ఆమెకు సరిగ్గా నిద్రపట్టలేదు. సుధాకర్ నిజంగా అంత అందగాడా? తన భార్యతప్ప ఈ ప్రపంచంలో అందగత్తెలే లేరనుకుంటున్నాడా? తన్ను చూసేక అతని అభిప్రాయం మారుతుందా?

సాయంత్రం వంట పూర్తయ్యేక సుజాత అలంకరణకు గోజాకంటే చాలా ఎక్కువసేపు పట్టింది. అద్దంలో తనను తాను తృప్తిగా చూసుకొని—"ఇంతకూ అలంకరణమీద ఎన్నడూలేని శ్రద్ధ ఈరోజు నాక్కలగడానికి కారణమేమిటి? నేను నా భర్త కోరికను తీరుస్తున్నానా? లేక సుధాకర్‌ను ఆకర్షించడానికి ప్రయత్నిస్తున్నానా?" అని తనను తాను ప్రశ్నించుకున్నదామె. సమాధానం సంతృప్తికరంగా లేదు.

ఏడుగంటల ప్రాంతంలో మధు, సుధాకర్ కలసి వచ్చారు. మధు సుజాతను తన స్నేహితుడికి పరిచయం చేశాడు. సుధాకర్ భార్య రాధికను సుజాత లోపలకు తీసుకువెళ్ళింది. సుధాకర్ కళ్ళలోని ఆశ్చర్యాన్ని గమ

నించిన మధు లోలోన సంబరపడ్డాడు.

సుధాకర్ మధు ఇల్లంతా తిరిగి ఆ ఇంటివారి అలంకరణల్నీ, అభిరుచుల్నీ మెచ్చుకోలేకుండా ఉండలేక పోయాడు. మధుకు ఎంతో తృప్తిగా వుంది.

ఎనిమిది గంటల ప్రాంతంలో అంతా కలిసే భోజనాలకు కూర్చున్నారు. సుజాత అన్నింటినీ పొందికగా టేబుల్ మీద సర్దింది.

భోజనానికి కూర్చుంటూ—"మావారికి నన్ను పొగడటం మినహా వేరే పనిలేదు. ఇలాంటి చోట్లకు నాలుగయిదు సార్లు వస్తే ఆ పని మానతారేమో చూడాలి. నాకు మాత్రం ఈ ఇల్లుచూశాక—మా ఆయన నన్ను పొగుడుతున్నందుకు సిగ్గుగాకూడా వుంది. మీరు మా యింటికి వచ్చారంటే రాజునుచూసిన కళ్లతో ఇంకెవర్నో చూసినట్లుంటుంది" అంది రాధిక.

సుజాత నవ్వి—"నాకు తెలుసులెండి. ఈవిధంగా మీ ఇంటికి ఆహ్వానిస్తున్నారు. మా ఇల్లుకూడా చూడండి అని సవాల్ చేస్తున్నారు. మిమ్మల్ని చూస్తూనే మీవి ఉత్తమ అభిరుచులని తెలుసుకోగలిగాను. మీ కర్టెసీకి చాలా థాంక్స్" అంది.

"అబ్బ-ఎంత తెలివిగా మాట్లాడేరండీ. మిగతా విషయాలు చెప్పలేను గానీ - ఇంత తెలివిగా మాట్లాడటం మాత్రం మా ఆవిడకు రాదు" అన్నాడు సుధాకర్.

సుజాత బుగ్గలు సిగ్గుతో ఎరుపెక్కాయి.

"సిగ్గుతో ఎరుపెక్కిన బుగ్గలంటే నాకు చాలా ఇష్టం. కానీ మా ఆవిడకు సిగ్గుపడడం చేతకాదు...." అన్నాడు సుధాకర్.

"మీలాంటి మగాళ్ళదగ్గర సిగ్గేమిటిలెండి కానీ—కాసేపు కవిత్వాన్ని కట్టిపెట్టి విందు ఆరగించండి" అంది రాధిక.

అతను తన బుగ్గలుగురించి విసిరిన విసురు సుజాతకు అంతగా నచ్చలేదు. కాస్త ఇబ్బందిగానే ఫీలయిందామె. అది గమనించి కూడా తెలియనట్లూరుకున్నాడు మధు.

"ఆహా గుత్తివంకాయ కూర. నాకివి ఇష్టమని మీకు ఎలా తెలుసు?" అన్నాడు సుధాకర్ ఆనందంగా-చేత్తో ఓకాయ తీసిపట్టుకుని.

"గుత్తివంకాయ ఇష్టంకాని ఆంధ్రుడెక్కడుంటాడు చెప్పండి" అన్నాడు మధు.

"అది తినవద్దు" అంది రాధిక చటుక్కున.

"నేను వచ్చింది విందుకి. తినవద్దంటే ఎలా?" అన్నాడతను.

"డాక్టర్ మిమ్మల్ని కొంతకాలంపాటు వంకాయ తినవద్దన్నాడు" అంటూ గుర్తుచేసింది రాధిక.

"అలాంటప్పుడు ప్లేటులోకి రాకుండా జాగ్రత్తపడాల్సింది. ఇటీజ్ టూ లేట్!" అన్నాడు సుధాకర్.

"ప్లీజ్—ప్లీజ్ అవి తినవద్దు" అందామె.

"అబ్బ, ఎంతసేపూ ఒకటే డైలాగు. తినొద్దు, తినొద్దు అని. నేను నువ్వు చెప్పినమాట వినడానికిక్కడకు రాలేదు. నీ వాగుడు భరించలేకుండా వున్నాను. నువ్వా విందు చేయవలసివుంది కాబట్టి కానీ లేకపోతే నీ నోటికి తాళం బిగించి ఉండేవాణ్ని—" అన్నాడు సుధాకర్ నవ్వుతూ.

రాధికమాత్రం నవ్వలేదు. అభ్యర్థనగా సుజాతవంక

చూసి "మీరు చెబితే వింటారు. వంకాయకూర ఆయనకు చాలా ఇష్టం కానీ కొంతకాలంగా ఆయన శరీరానికి పడడంలేదు. తిన్నారంటే రాత్రికి చాలా ప్రమాదం జరగవచ్చు" అంది.

సుజాత వెంటనే సుధాకర్ వంకచూసి "మా ఇంటికి వచ్చి మీరు అనారోగ్యానికి గురికావడం నా కిష్టంలేదు. ఎందుకయినా మంచిదని రెండుకూరలు చేశాను. మీరు బంగాళాదుంపలకూర వేసుకోండి" అంది.

"మీరు చెబుతున్నారు కాబట్టి మానేస్తున్నాను. అయినా మా రాధికకు కంగారు ఎక్కువ. నాది యెడమ చేతివాటం. కుడిచేతో తినటం నాకు రాదు" అంటూ అతనా వంకాయను ప్లేట్లోనే వదిలేసి, ఎడమ చేత్తోనే తినడం ఆరంభించేడు.

ఆ దృశ్యంచూసిన సుజాత భ్రాన్తపడిపోయింది. జరిగినదంతా ఒకసారి పునశ్చరణ చేసుకొని సుధాకర్ ముఖం వైపు చూసింది. ఆ ముఖంలో క్రూరత్వంలేదు. అమాయకంగా వున్నా లేకపోయినా అందంగా మాత్రముంది.

# 3

"నాకేమిటో భయంగా వుందండీ" అంది సుజాత.

"ఏం-ఏమయింది?" అన్నాడు మధు.

"ఆ సుధాకర్ మాటలు విన్నారా?"

"విన్నాను. మనిషి కాస్త చురుకయినవాడు. మనసులో ఏమీ కల్మషముండదు. అతన్ని అపార్థం చేసుకోకు" అన్నాడు మధు.

"అదేకాదండీ, అతని మాటలు అచ్చు నా కలలోని హంతకుడి మాటల్లా వున్నాయి" అంది సుజాత.

మధు ఉలిక్కిపడి "ఏమిటన్నావ్?" అన్నాడు.

సుజాత వివరంగా చెప్పి, "వాగుడు వినలేనని నోటికి ప్లేపు అంటిస్తానన్నాడు. తనది ఎడమచేతి వాటం అన్నాడు. అన్నపద్ధతి అచ్చు ఆ హంతకుడన్నట్లేవుంది." అంది.

మధు పకపక నవ్వి, "అయితే ఆ కల నువ్వింకా మర్చిపోలేదన్నమాట" అన్నాడు.

"ఎలా మర్చిపోతానండీ. మీకెక్కడా అలాంటి కల వచ్చివుంటే తెలిసుండేది."

"నువ్వు కలను సీరియస్‌గా తీసుకుంటావని నాకు తెలుసు. అందుకే నా కలలు నీకు చెప్పను. మగాడన్నాక అందమయిన అమ్మాయిలు కల్లోకి రాకుండా వుండరు. నువ్వెదురుగా వున్నప్పటి సంగతి వేరుగానీ కలల్లో నేను వాళ్ళనుచూస్తూ వూరుకోలేను" అన్నాడు మధు.

"మీరు వేళాకోళం చేయకండి. సుధాకర్‌ని చూసేక నాకు అనుమానంగావుంది. నేను చూసిన కల నిజంగా జరిగినదే ఏమోనని...."

"కొంపదీసి నీ కలలోని హంతకుడు సుధాకర్ కానీ కాదుగదా" అన్నాడు మధు.

"ఆ హంతకుడి ముఖం నా కళ్ళముందు కదులూనే వుంది. వాడెక్కడ కనబడ్డా గుర్తించగలను. వాడికీ మీ సుధాకర్‌కీ పోలికలు లేవు."

"అయితే గొడవేలేదు."

"అది కాదండీ. వాడు సుధాకర్‌కి బాగా దగ్గర బంధువై వుండవచ్చు. సుధాకర్‌కీ వాడికీ కొన్ని కామన్

హాబిట్స్ వుండి వుండవచ్చు. నా అనుమానం ఆ హత్య నిజంగా జరిగిందని!" అంది సుజాత.

"అయితే ఏం చెయ్యాలంటావ్?"

"ఎలాగో అలా ఆ హంతకుణ్ని బయటపెట్టాలి!" అంది సుజాత.

"బాగానే వుంది. నాకో కలవచ్చింది. ఆ కలలో ఓ అమ్మాయి హత్యచేయబడింది. హత్య చేసినవాడికీ, సుధాకర్ అనబడే వ్యక్తికీ కొన్ని అలవాట్లలో పోలిక వుంది. మీరు హంతకుణ్ని పట్టుకుని ఉరితీయండి, అని పోలీసులకు చెప్పాలంటావా?" అన్నాడు మధు విసుగ్గా. "మామూలుగా వచ్చే సమస్యలకే తట్టుకోలేక చస్తూంటే కలలోవచ్చే సమస్యలుకూడా నాకు తగిలించకు. నామాట విని కొంతకాలంపాటు డిటెక్టివ్ పుస్తకాలు చదవడం కట్టిపెట్టు. లేకపోతే లేనిపోని ఆలోచనలతో సైకోలా తయారు కాగలవు."

"మాట్లాడితే పుస్తకాల ప్రసక్తి తీసుకొస్తారు. మీరు ఎన్ని చేసినా నన్ను పుస్తకాలు చదవకుండా ఆపలేరు. ఆ మాటకొస్తే అలా ఆపితేనే నేను సైకోనయ్యే ప్రమాదముంది" అంది సుజాత.

# 4

"ఎందుకో అర్జంటుగా బయల్దేరి రమ్మనమని మీ నాన్నగారు ఉత్తరం రాశారు. నాకు శెలవులేదు. నువ్వు ఒక్కత్తివీ వెళ్లొచ్చేయి" అన్నాడు మధు.

సుజాత ఉత్తరం చదువుకొని "ఏమిటో - అసలు విశేషం రాయలేదు. కంగారుగావుంది. ఎలాగో అలా సెలవు చూసుకొని నాతో బయల్దేరి రాకూడదూ" అంది.

"చెప్పానుగా, సెలవు లేదు అని!" అన్నాడు మధు.

సుజాత ఒక్కర్తే బయల్దేరి వెళ్ళింది.

"అల్లుడు రాలేదా?" అంటూ పలకరించింది సుజాత తల్లి గుమ్మంలోనే.

"లేదమ్మా, ఆయనకు సెలవు లేదట." అంటూ చెప్పి ఆత్రుతగా అక్కడి విశేషాలడిగింది. విషయమేమిటో అని ఆమెకు చాలా కంగారుగా వుంది.

సుజాతకు పద్దెనిమిదో ఏట పెళ్ళయింది. ఇప్పుడామెకు ఇరవై నిండాయి. సుజాత అన్న రవికి పాతికేళ్ళు. అతనికి పెళ్ళి చేద్దామని తలిదండ్రులు అనుకుంటున్నారు. అయితే అతనొక అమ్మాయిని ప్రేమించాడు. ఆ అమ్మాయిని తప్ప చేసుకోనని భీష్మించాడు. ఆ అమ్మాయి చాలా బాగుంటుంది కానీ కులం వగైయిరాలు కలవలేదు. మొత్తంమీద తలిదండ్రులు అంగీకరించక తప్పలేదు. పెళ్ళి కుదిరినట్లే అనుకున్నారు. కానీ హఠాత్తుగా ఆ అమ్మాయిజాడ తెలియకుండా పోయింది. ఆ పిల్లకోసం రవి అన్నాహారాలు మానేసి పిచ్చివాడిలా ఐపోయాడు.

"బాగానేవుంది. ఎలాగో అలా నచ్చజెప్పలేక పోయారా?" అంది సుజాత.

"ఎలా నచ్చజెప్పేదే తల్లీ-వాడు మమ్మల్ని శత్రువుల్లా చూస్తున్నాడు. నాన్నగారే ఆ పిల్లను మాయం చేశారని వాడి అనుమానం" అంది సుజాత తల్లి.

సుజాత ఉలిక్కిపడింది. ఆమె తండ్రి ఆ ఊళ్ళో ధనవంతుడైన వ్యాపారస్థుడు. ఊళ్ళో పలుకుబడి, గౌరవం వున్నాయి. చేతిలో గూండాలు వున్నారని

లోపాయికారీగా చెప్పుకుంటూంటారు. ఇంట్లో మాత్రం అందరితోనూ ఎంతో సౌమ్యంగా మాట్లాడుతాడు. పిల్లలంటే ప్రేమ ఆయనకు. తన ప్రతికక్షులను కాల రాచడంలో ఆయనకు సరదా ఉందని ఎందరో చెప్పుకున్నప్పటికీ సుజాత ఆ విషయాలేవీ నమ్మదు.

"ఛా-ఆఖరికి కన్నతండ్రిని అనుమానించే స్థితికి దిగజారేదన్న మాట!" అంది సుజాత బాధగా.

"అవునే తల్లీ - ఆ పిల్ల గురించి వాడు బెంగ పెట్టుకుని పిచ్చివాడై పోతున్నాడు. వాడనే మాటలకు ఆయనేమో కుమిలిపోతున్నారు. ఇద్దరి బాధా చూడలేక నేను అవస్థ పడుతున్నాను. నువ్వు కొన్నాళ్ళిక్కడ వుండి వాణ్ణి మనుషుల్లోకి తీసుకురావాలి" అంది సుజాత తల్లి.

"మీవల్ల కానిపని నావల్ల అవుతుందా?" అంది సుజాత సందేహంగా.

"నువ్వంటే వాడికి అభిమానం. ఈ ప్రేమ వ్యవహారమంతా నీకు తెలియదు. కాబట్టి వాడికి నీ మీద అనుమానం కూడా వుండదు. వెళ్ళు. వాడితో మాట్లాడు."

"అన్నయ్యెక్కడున్నాడు?" అనడిగింది సుజాత.

తల్లి చెప్పింది.

## 5

రవి పడక్కుర్చీలో కూర్చుని శూన్యంలోకి చూస్తున్నాడు. అతడి గెడ్డం బాగా మాసింది. కళ్ళు లోతుకు పోయివున్నాయి.

"అన్నయ్యా!" అని పిలిచింది సుజాత. కానీ రవికి వినబడినట్టులేదు. ఆమె రెండుమూడుసార్లు పిలిచేక అతను ఉలిక్కిపడి సుజాతను చూశాడు. కానీ వెంటనే గుర్తు

పట్టలేదు. అతని మెదడు చురుగ్గా పనిచేస్తున్నట్లులేదు. "ఎవరూ?" అన్నాడు.

"నేను అన్నయ్యా సుజాతను!" అంది సుజాత.

రవిలో చలనం కలిగింది. అతను చటుక్కున కుర్చీ లోంచి లేచి "నువ్వా-ఎప్పుడొచ్చావే?" అన్నాడు.

సుజాత ఒక్క పరుగున అన్నయ్యను సమీపించి "ఇదేమిట్రా ఇలా గైపోయావ్?" అంది.

రవి హఠాత్తుగా భోరున ఏడ్చేశాడు. సుజాత యిది ఊహించలేదు. అతను వెక్కి వెక్కి ఏడుస్తూంటే ఆమెకూ కళ్ళలో నీళ్లు తిరిగాయి కాని మౌనం వహించింది.

"ఏం జరిగిందన్నయ్యా?" అడిగిందామె.

"నాన్న నాకు చాలా అన్యాయం చేశాడు. ఈ జన్మకు సుఖంలేకుండా చేసేశాడు" అన్నాడు రవి ఇంకా ఏడుస్తూనే.

"అసలేం జరిగింది?" అంది సుజాత.

రవి క్లుప్తంగా ఆమెకు జరిగింది చెప్పాడు. అతను చెప్పిందానికీ తల్లి చెప్పిందానికీ సరిపోయిందని సుజాత గ్రహించింది.

"పెళ్ళికి ఒప్పుకుంటే మనస్ఫూర్తిగానే ఒప్పుకున్నా డనుకున్నాను కానీ ఇంత మోసం చేస్తాడనుకోలేదు. నాతో నవ్వుతూ మాట్లాడి-చాటుగా నా శాంతిని మూడోకంటికి తెలీకుండా హత్య చేయించేశాడు. ఇప్పుడేమో ఏమీ ఎరుగని నంగనాచిలా తనకేమీ తెలీ దంటున్నాడు" అన్నాడు రవి.

"నువ్వు అనవసరంగా నాన్నను అనుమానిస్తున్నా వేమోరా" అంది సుజాత.

"నీకు తెలియదే - ఆయన క్రూరుడు!" అన్నాడు రవి.

రవి ఇలా అంటాడని ఊహించని సుజాత "నువ్వు ఊహిస్తున్నావా, నీ కళ్ళతో ఏమైనా చూశావా?" అని అడిగింది.

"నిప్పులేందే పొగరాదు. నాన్న ఎంతటి నయవంచకుడో ఊరందరికీ తెలుసు. అలాంటి వాడికి కొడుకుగా పుట్టడం నా దురదృష్టం" అన్నాడు రవి.

"మన ఐశ్వర్యాన్ని చూసి ఊళ్ళోవాళ్ళు అసూయపడి రకరకాలుగా చెప్పుకుంటారు. మనకు వాళ్ళతో నిమిత్తం లేదు. ఆ మాటకొస్తే డబ్బున్నవాళ్ళు, పేరున్నవాళ్ళూ, ఎంతో కొంత పాపం చేస్తూనే వుంటారు. నాన్న గురించి ఎవరో చెప్పుకోగా విన్నావే కానీ నువ్వు చూసి తెలుసుకున్నదేమీ లేదు గదా! నీ దుఃఖంలో నువ్వు అన్నీ మరిచిపోయి నిన్నే ప్రాణంగా చూసుకునే నాన్నను అనుమానిస్తున్నావు. అందువల్ల నువ్వు సాధించేదేముంది నాన్నగారి మనసును బాధపెట్టడం తప్ప! నువ్వు నిజంగా శాంతిని ప్రేమిస్తున్నట్లయితే - ఆమెను చంపినవాడెవరో తెలుసుకుందుకు ప్రయత్నించు. వాణ్ణి ఉరికంబం ఎక్కించడానికి ఏర్పాట్లు చేయి. అంతేకానీ ఇలా గదిలో కూర్చుని ఏడిస్తే ఏమిలాభం?" అంది సుజాత.

"అయితే నన్నేం చేయమంటావ్? నా శాంతి ఇక లేదని తెలియగానే నా నవనాడులూ కృంగిపోయాయి. నా శక్తి క్షీణించిపోయింది. బుర్ర పనిచేయడం మానేసింది" అన్నాడు రవి.

"అసలు శాంతి చచ్చిపోయిందని ఎలాగను

కుంటున్నావ్?" అంది సుజాత.

"బ్రతికుంటే నన్ను విడిచి వుండలేదు నా శాంతి!"

"అటువంటి భ్రమ నీకు కలిగించి ఎక్కడికైనా వెళ్ళి పోయిందేమో?"

"అందువల్ల ఆమెకు ప్రయోజనం?" అన్నాడు రవి.

సుజాతకు సమాధానం వెంటనే దొరకలేదు "శాంతి నువ్వనుకున్నంత మంచిది కాదేమో-నీకంటే డబ్బున్న మరొకడు తటస్థపడితే నిన్నిలా అర్ధాంతరంగా వదిలేసి తను వాడితో పోయిందేమో!" అంది ఓ క్షణం ఆలోచించి.

"సుజాతా" రవి గట్టిగా అరిచాడు "శాంతి గురించి ఎవరైనా యిలా మాట్లాడితే నా గుండె బ్రద్దలైపోతుంది."

"నిప్పులేనిదే పొగరాదంటారు. ఊళ్ళో కొందరు శాంతి గురించి యిలా కూడా మాట్లాడుకుంటున్నారు. వాళ్ళమాటలు నమ్మకూడదనుకుంటే నువ్వు నాన్న విషయంలో వాళ్ళనుకునే మాటలు కూడా నమ్మ కూడదు" అంది సుజాత.

ఈ మాటలు రవిపై బాగా పనిచేశాయి "చెల్లాయ్-నిజంగా నా శాంతి అలాంటిది కాదు. నా ఆల్బంలో శాంతి ఫోటోలు ఎన్నో వున్నాయి. ఒక్కదాంట్లో కూడా అమాయకత్వం తప్ప మరేమీ కనపడదు ఆ ముఖంలో. చూపిస్తాను దా" అంటూ అతనామెను ఒక బీరువావద్దకు తీసుకువెళ్ళి అందులోంచి ఆల్బం తీసి పెద్ద సైజులో వున్న శాంతిఫోటోను చూపించి "ఇప్పుడు చెప్పు నువ్వు. శాంతి మంచిది కాదంటావా?" అన్నాడు.

ఆ ఫోటో చూస్తూ ఉలిక్కిపడింది సుజాత. ఆ ముఖం

ఎంతో పరిచయమైనదని ఆమె కనిపెట్టింది. అనుక్షణం తనను వెంటాడే ఆ కలలో కాళ్ళూ చేతులూ బంధింపబడి, మూతికి టేపు వేయబడి నిస్సహాయపరిస్థితుల్లో గుండెల్లో కత్తి దిగబడి మరణించిన అభాగ్యురాలు నిజంగా ఈ ఇలలో వున్నదా? తను మళ్ళీ కలకంటోందా లేక ఇది నిజమా?

"చెప్పు చెల్లాయ్ ఈ మెను చూస్తే నీకేమనిపిస్తోంది?" అన్నాడు రవి ఆవేశంగా.

"ఇది చాలా ఆశ్చర్యంగా వుందన్నయ్యా - నీ ప్రియురాలు శాంతిని నేను కలలో చూశాను. ఆ కలలో ఆమె అమానుషంగా హత్య చేయబడింది" అంది సుజాత.

రవికి ఆమె మాటలు అర్థం కాలేదు.

# 6

సుజాత చెప్పిన కథంతా ఇంటిల్లిపాదీ ఆశ్చర్యంగా విన్నారు.

"ఇది నమ్మశక్యంగా లేదు" అంది సుజాత తల్లి.

"నేనే నమ్మలేకపోతున్నాను" అంది సుజాత.

"సుజాతకూడా మనసులో ఏ మూలనో నాకన్న లాంటి నమ్మకమే వుంది. హంతకుడిది ఎడమచేతి వాటం. నాన్నదీ అంతే!" అన్నాడు రవి.

సుజాత తండ్రి ఎడమచేయి గాలిలోకి లేచింది-కానీ ఎవరినీ దండించకుండానే అది క్రిందకు వాలిపోయింది— విశేకం హెచ్చరించడంతో.

"నా కలే నిజమయితే- నేను హంతకుణ్ణి చూశాను. హంతకుడికీ నాన్నకూ పోలికలు లేవు" అంది సుజాత.

"నీ కల్లోని హంతకుణ్ణి ఎలా పట్టుకునేది? వాడు కన బడుతాడని గ్యారంటీ ఏమిటి?" అన్నాడు రవి బాధగా.

"బాగుంది. కలలోని హతురాలు కనబడగాలేండి— హంతకుడు మాత్రం ఎందుకు కనబడడు-అందుకు సమయం కోసం వేచిచూడాలి-అంతే!" అంది సుజాత.

రవి ఒకక్షణం ఆలోచించి "నా దగ్గర శాంతికి సంబంధించిన ఫోటోలు చాలా వున్నాయి. ఆమెకూ, నాకూ తెలిసిన వాళ్ళవి ఎందరివో ఫోటోలున్నాయి. అందులో ఎక్కడైనా హంతకుడి ఆచూకీ పట్టుకోగలవేమో చూస్తావా?" అన్నాడు.

"కోడిగుడ్డుకు ఈకలు పీకుతున్నారు మీరు" అన్నాడు సుజాత తండ్రి.

"ఆ ఈక మీరు కాకూడదని నా ఆశ—" అన్నాడు రవి.

రవి, సుజాత అక్కణ్ణించి వెళ్ళిపోతూంటే "నా ముందు ఎంత వినయంగా వుండేవాడు? ఈ వేధవిలా తయారౌతాడని నేననుకోలేదు" అన్నాడు సుజాతతండ్రి.

"వాడిప్పుడు మనలో లేడండీ. తనేం మాట్లాడు తున్నాడో వాడికే తెలియదు. వాడి మనస్సు పూర్తిగా చెదిరిపోయింది. మీరేమీ అనుకోనంటే ఒకమాటడుగు తాను. ఆ పిల్ల మాయం కావటానికి మీరేమయినా చేశా రేమిటి?" అంది సుజాత తల్లి.

"బాగుంది. ఆఖరికి నువ్వుకూడా నన్ననుమానిస్తున్నా వన్నమాట" అన్నాడు సుజాత తండ్రి బాధగానిట్టూర్చి.

"అనుమానించడం కాదండీ. ఇలాంటివి మీకు అల వాటే కదా."

"నోర్మూయ్" అన్నాడు సుజాత తండ్రి కోపంగా—
"కాబోయే కోడల్ని చంపాలనుకునేటంత కిరాతకుణ్ణి కాను నేను. ఆ మాటకొస్తే మీ ఆడవాళ్లే ఇంకా ఘోరం. కాపురానికి వచ్చిన కోడల్ని రాచి రంపాన పెట్టి చంపుతారు."

ఇక్కడ వీళ్ళిలా మాట్లాడుకుంటూండగా రవి, సుజాత తిరిగివచ్చారు. సుజాత నిరుత్సాహంగా తలాడిస్తూ "అంత సులువుగా దొరుకుతాడా హంతకుడు! అనుమానించదగ్గ ఫోటో ఒక్కటీ కనబడలేదు" అంది.

# 7

రవి, సుజాత కలిసి శాంతి ఇంటికి బయల్దేరారు.

శాంతి పేదయింటి బిడ్డ. తండ్రి ఎలిమెంటరీ స్కూలు టీచరు. ఆయనకు అయిదుగురు పిల్లలు. అందరిలోకీ పెద్దది శాంతి.

రవిని చూస్తూనే శాంతి తల్లి పెద్దగా శోకం పెట్టింది. శాంతి తండ్రి కళ్లొత్తుకున్నాడు. రవి జేబులోంచి రుమాలు తీశాడు. సుజాతక్కూడా బాధ వచ్చింది.

సుజాతను చూసేక శాంతి తలిదండ్రుల బాధ హెచ్చు అయింది. హాయిగా ఆమెకులాగే తనూ కాపురం చేసుకుంటూ ఉండాల్సిన పిల్ల లేకుండా పోయిందిగదా అని ఏడుస్తున్నారు వాళ్ళు. వాళ్ల దుఃఖం సహజమే మరి! సుజాతకు మాత్రం శాంతి చాలా దురదృష్టవంతురాలనిపించింది. అయితే ఆ దురదృష్టవంతురాలు తన కలలోకెందుకు వచ్చింది?

రవి తను వచ్చిన పని చెప్పాడు. సుజాత కలగురించి మాత్రం చెప్పలేదు.

"మా ఇంట్లో ఆల్బం లేదు బాబూ—ఫోటోలు తీసుకునే స్తోమతులేదు మాకు" అన్నాడు శాంతి తండ్రి నొచ్చుకుంటూ.

"శాంతిగురించి తెలుసుకునేందుకు ఆమెకు సన్నిహితులయిన వారందరి గురించీ తెలుసుకోవాలి. కాని ఎక్కడా ఏ ఆధారాలూ దొరకడం లేదు" అంది సుజాత.

"శాంతికో స్నేహితురాలుండమ్మా. పేరు మాధురి. ఆమెదగ్గర ఎన్నో ఫోటోలున్నాయి. ఓసారి శాంతి వాళ్ళ ఆల్బం తీసుకొచ్చి ఇంట్లో అందరికీ చూపెట్టింది. అందులో శాంతివీ, శాంతిని తెలిసినవాళ్ళవీ ఎన్నో ఫోటోలున్నాయి" అంది శాంతితల్లి.

రవి మాధురి అడ్రస్ అడిగి తీసుకున్నాడు. ఇద్దరూ అక్కణ్ణించి బయల్దేరారు.

"గడ్డిమేట్లో సూదిని వెతుకుతున్నామేమో!" అంది సుజాత.

"అదైనా ఫరవాలేదు. కానీ గాలిని పోగుచేసి మనిషిగా చేయాలనుకుంటున్నామేమోనని భయంగా వుంది" అన్నాడు రవి.

"ఏది ఏమైనా నా కలగురించి మాత్రం రహస్యంగానే వుంచు. ఎవరైనా వింటే నవ్వినా నవ్వగలరు...." అంది సుజాత.

ఇద్దరూ వెళ్ళేసరికి మాధురి ఇంట్లోనే వుంది. ఇంట్లో తనుతప్ప ఇంకెవ్వరూ లేరని చెప్పిందామె. రవి తాను వచ్చిన పని చెప్పాడు. వెంటనే అయిదారు ఆల్బమ్స్ తీసుకువచ్చి వాళ్ళముందు పడేసింది మాధురి. ఆల్బమ్స్ చూస్తూండగా మాధురి మంచినీళ్ళు తీసుకురావడానికి

వంటింట్లోకి వెళ్ళింది. ఆ సమయంలో పక్క-గదిలో ఏదో జారిపడిన చప్పుడైంది.

"ఏ పిల్లో అయుంటుంది" అనుకుంటూ సుజాత లేచి పక్క-గదిలోకి చూడ్డానికి వెళ్ళింది. రవి ఆల్బమ్స్ వైపు శ్రద్ధగా చూస్తూ సుజాతకు చూపవలసిన మగవాళ్ళ ఫోటోలకోసం వెదుకుతున్నాడు. వాటిలో మగవాళ్ళ ఫోటోలు చాలా ఎక్కువగా వున్నాయి. అంతలో....

"కెవ్వు"మని అరిచి పరుగెత్తుకుంటూ వచ్చింది సుజాత.

"ఏం జరిగింది చెల్లాయ్?" అన్నాడు రవి.

సుజాత మాట్లాడలేక ఆయాసపడుతోంది. ఈలోగా అక్కడికి మాధురికూడా వచ్చి "ఏమిటండీ, ఏదో పెద్ద కేకలా వినబడింది" అంది.

"పక్క-గదిలో ఏదో జారిపడిన చప్పుడైతే చూడ్డానికి వెళ్ళాను. ఎవడో మగవాడు ఆ గదిలోంచి వెళ్ళిపోతూ చటుక్కన వెనక్కి-తిరిగాడు. అప్రయత్నంగా నేను కెవ్వుమన్నాను. ఎవరండీ అతను?" అంది సుజాత.

మాధురి ముఖం మాడిపోయింది. ఆమె తత్తరపాటును అణుచుకునేందుకు ప్రయత్నిస్తూ "మీరు భ్రమపడ్డారేమోనని నా అనుమానం. ఈ యింట్లో ప్రస్తుతం నేను తప్ప ఇంకెవ్వరూ లేరు" అంది.

"అయితేవాడు ఏ దొంగో, హంతకుడో అయుంటాడు" అన్నాడు రవి.

సుజాత మాత్రం "ఏమోలే అన్నయ్యా నేను భ్రమపడే వుంటాననుకుంటాను" అంది.

"అదే నా అనుమానం కూడా" అంది మాధురి.

మళ్ళీ అందరూ ఆల్బమ్స్ చూడసాగారు. కాసేపటికి

సుజాత అందులో ఒక ఫోటో చూపించి "ఇతనెవరు? శాంతికి తెలుసా?" అనడిగింది.

"ఇతని గురించిప్రత్యేకంగా అడుగుతున్నారు- కేసులో అనుమానితుడా?" అంది మాధురి అనుమానంగా చూస్తూ.

"లేదు. ఇతనిప్పుడు మా ఊళ్ళోనే వుంటున్నాడు. మావారి స్నేహితుడు. కుతూహలంకొద్దీ అడుగుతున్నాను" అంది సుజాత.

"పెద్దగా తెలిసినదేమీ లేదు. మా అందరికీ ముఖ పరిచయముంది. అంతే! ఈ ఫోటో అతనే ప్రజెంట్ చేశాడు" అంది మాధురి.

# 8

"అన్నయ్యా నా కల అబద్ధం కాదురా" అంది సుజాత.

"ఎలా చెప్పగలవు?"

"అంతకు మునుపెన్నడూ చూడని మనుషుల్ని నా కలలో చూశాను. వాళ్ళు కేవలం నా ఊహాచిత్రాలను కున్నాను. కానీ నిజంగానే వాళ్ళీ భూమ్మీద వున్నారు. నీ ఆల్బంలో శాంతిఫోటో చూశాను....ఆ తర్వాత శాంతిని చంపినవాణ్ని కూడా చూశాను" అంది సుజాత.

రవి ఆశ్చర్యంగా "ఎక్కడ?" అన్నాడు.

"మాధురి ఇంట్లో" అంది సుజాత.

"నిజంగా?" అంటూ ఉలిక్కిపడ్డాడు రవి.

"అవును నా ఆల్బమ్ చూస్తూండగా చప్పుడైందని పక్కగదిలోకి వెళ్ళాను కదా. అప్పుడు హడావిడిగా ఆ గదిలోంచి ఇంకో గదిలోకిపోతూ అలికిడికి వెనక్కు తిరిగాడొకడు. నేను కలలో చూసిన భయంకర హంత

కుడు వాడే! వాణ్ని చూడగానే భయంవేసి కెవ్వుమని అరిచాను. ఈలోగా ఆ గదిలోంచి పారిపోయాడు వాడు" అంది సుజాత. ఆ దృశ్యం తలచుకోవడంవల్ల కాబోలు ఆమె శరీరంలో మళ్ళీ వణుకు ప్రారంభమయింది.

"మరైతే వెంటనే ఎందుకు చెప్పలేదు?" అన్నాడు రవి.

"వాడెంత భయంకరమైన మనిషో కలలో చూసేక నాకు చాలా భయంవేసింది. వాణ్నిలా బయటి ప్రపంచంలో చూస్తానని అనుకోలేదు. వాడి వునికి తెలిసినందుకు మననేం చేస్తాడోనని భయంవేసింది. అందుకే...."

"అయితే వాడు తనింట్లో వున్నట్లు మాధురికి తెలియదంటావా?"

"తెలుసుననే నా అనుమానం. చప్పుడయిందని కంగారుపడి వెళ్ళిచూస్తే నాకో మనిషి కనిపించాడనీ నేను చెప్పినపుడు ఆమె కంగారుపడలేదు. నేను భ్రమపడి వుంటానంది. అంటే ఆమెకు లోపల ఆ మనిషి వున్నట్లు తెలుసు. ఆ విషయం మనకు తెలియడం యిష్టంలేదు. అందుకేనేమో ఊరుకుని ఆమె అభిప్రాయాన్ని బలపరిచాను. ఆ మనిషి వున్నట్లు ఆమెకు తెలియని పక్షంలో తనూ కంగారుపడి మనతోపాటు పసిగట్టేది. వాణ్ని పట్టుకునేందుకు మన సాయం తీసుకుని వుండేది" అంది సుజాత.

"నువ్వు చూసిన ఆ హంతకుణ్ని నాక్కూడా చూపిస్తే బాగుండేది, వాడిగురించి ఆరాతీసివుండేవాణ్ని."

"లేదు. అది చాలా ప్రమాదకరమైన క్షణం. వాణ్ణి నేను చూసినట్లూ, హంతకుడిగా గుర్తించినట్లూ ఎవ్వరికీ

తెలియకూడదు. ఎందుకంటే ఈ హత్య నిజానికి నా భ్రమ కావచ్చు. భ్రమ కాక నిజమే అయినప్పటికీ అందుకు రుజువున్నదన్న అనుమానం కూడా ఆ హంతకుడికి లేక పోవచ్చు. అలాంటప్పుడు కోరి ప్రమాదం తెచ్చుకోవడ మెందుకు?" అంది సుజాత.

"నా శాంతి పోయాక జీవితేచ్ఛ నశించింది. నేనే మైనా ఫర్వాలేదు. ఆ కిరాతకుణ్ణి పట్టుకోవాలి" అన్నాడు రవి ఆవేశంగా.

"అది నిజమే. అయితే యిప్పుడొచ్చిన నష్టమేముంది? వాడిగురించి ఆధారం దొరికింది. మాధురికీ వాడికీ సంబంధ ముంది. మాధురి ద్వారా నెమ్మదిమీద వాడి ఆచూకీ రాబట్టవచ్చు. మనవల్ల కాదంటే ఈ వ్యవహారాన్ని ఎవరైనా డిటెక్టివ్ లకప్పగించవచ్చు" అంది సుజాత.

ఇద్దరూ ఇల్లు చేరారు. ఇంకా కొన్ని విశేషాలు మాట్లాడుదామనుకుని తమ గదిలోకి వెడదామనుకుని నడవబోగా పక్క గదిలోంచి ఏదో సంభాషణ వినిపించి ఆగిపోయారు.

సుజాత తలిదండ్రులు కాస్త గట్టిగానే వాదించు కుంటున్నారు.

"నాకు మీ మీద బాగా అనుమానముంది. మీకు తెలియకుండా ఆ పిల్ల మాయంకాదు. కాబోయే కోడలనైనా జాలి తలచకుండా ప్రాణాలు తీయించ డానికి మీకు మనసెలా ఒప్పిందండీ" అంటోంది సుజాత తల్లి.

"ఇన్నేళ్ళుగా నాతో కాపురం చేస్తున్నావ్. నేను మరీ అంత పరమ కిరాతకుడిలా తోస్తున్నానా - చూస్తూ

చూస్తూ ఓ నిండు ప్రాణాన్ని బలిగొంటావనుకుంటున్నావా?"

"అయితే మనపిల్లలమీద ఒట్టువేసి చెప్పండి. ఆ పిల్ల మాయంకావడం గురించి నిజంగా మీకేమీ తెలియదూ?" అంది సుజాత తల్లి.

"నిజం చెబుతాను విను. నాకా పిల్లను కోడలిగా చేసుకోవడం ఇష్టంలేదు. ఇంతబ్రతుకు బ్రతికి ఓ దౌర్భాగ్యుడితో వియ్యమందాలంటే నాకు వళ్ళంతా కంపరమెత్తినట్లనిపించింది. అందుకే నాకు తెలిసిన మనిషిని పిలిచి కొంతకాలంపాటు ఆ అమ్మాయిని ఊళ్ళో కనబడకుండా చేయమని చెప్పాను. అతను ఒప్పుకున్నాడు. అంతే జరిగింది."

"అయితే ఆ పిల్ల బ్రతికేవుందంటారా?"

"ఉంటుందనే నా అనుమానం. అయినా అడ్డమైన వాళ్ళగురించీ ఆలోచిస్తూ కూర్చోడం తప్ప నాకేం పని లేదనుకుంటున్నావా?" అన్నాడు సుజాత తండ్రి విసుగ్గా.

"అలాగంటారేంటండీ మీ కన్నబిడ్డ ప్రాణాలన్నీ ఆ పిల్లమీదే వున్నాయని తెలియదా నీకు."

"ఏమిటే ఊరికే కబుర్లు చెబుతావు. చిన్నప్పుడు నేనూ ఓ పిల్లను ప్రేమించాను. మా నాన్న నా మెడలు విరిచి ఈ పెళ్ళిచేశాడు. ఇప్పుడు నాకొచ్చిన లోటేముంది? వీడూ అంతే-కొన్నాళ్ళతర్వాత ఆ పిల్లను మర్చిపోతాడు. అప్పుడు లక్షణమైన ఓ పిల్లను చూసి తెచ్చి వీడికి పెళ్ళి చేయవచ్చు."

రవి ఆవేశంతో ఊగుతూంటే సుజాత అతని చేయి పట్టుకుని ఆపి "అనవసరంగా ఆవేశపడకు అన్నయ్యా-

శాంతి మాయం కావడంలో నాన్న చేయి వున్నదని తెలిసింది గదా - నెమ్మదిగా నే మాట్లాడి విషయం రాబడదాం" అంది.

రవికి చల్లబడ్డానికి కాసేపు పట్టింది. తర్వాత ఇద్దరూ నెమ్మదిగా తలిదండ్రులున్న గదిలో ప్రవేశించారు. వీళ్ళను చూస్తూనే తండ్రి తెల్లబోయి "ఇప్పుడే వస్తున్నారా?" అన్నాడు.

"అవును నాన్నా - మీ సంభాషణంతా విని ఇప్పుడే లోపలికి వస్తున్నాం" అంది సుజాత. సౌమ్యంగా మాట్లాడాలనుకున్నా ఆమె మాటలు కటువుగా వచ్చాయి.

"ఏం విన్నారు?" అన్నాడు తండ్రి.

"శాంతిని మాయం చేయమని మీరు వినియోగించిన మనిషి ఎవరు?" అన్నాడు రవి తాపీగా.

"ఏమిటి నువ్వంటున్నది?" అన్నాడు తండ్రి ఏమీ ఎరుగనట్లు.

"మీరు నిజం చెప్పకపోతే మీ కళ్ళముందే పొడుచుకు చచ్చిపోతాను" అన్నాడు రవి.

తండ్రి ఏమీ మాట్లాడలేదు.

"మీరు ఇంత దుర్మార్గానికి తలపడతారని నే నెప్పుడూ అనుకోలేదు నాన్నా" అంది సుజాత.

సుజాతతండ్రి రెచ్చిపోయాడు "ఏమిటే నేను చేసిన దుర్మార్గం? ఓ ముష్టిపిల్లను మీ అన్నయ్య చేసుకుంటా నంటే వద్దన్నాను. అంతేనా? అందులో తప్పేముంది? ఆ పిల్లతో వీడి పరిచయం ఆర్నెల్లు. ఆ కొద్ది సమయం లోనూ అది దేవత అయిపోయిందా? తండ్రికంటె ఎక్కువై పోయిందా? వయసు మైకంలో వీడికేమీ తెలియక

పోయినా నా భాగాలు నాకుంటాయి గదా—వాళ్ళైనా నా ఆస్తికోసం వలపన్నారేమోనని నేను అనుమానిస్తే అది తప్పా? ఈ రోజుల్లో అలాంటివాళ్ళు లేరా?"

ఏం మాట్లాడాలో వెంటనే సుజాతకు స్ఫురించలేదు. తండ్రి మాటల్లో సబబు ఉన్నదనిపించింది.

సుజాత తండ్రి మళ్ళీ మొదలుపెట్టాడు "నేనాపిల్లను డబ్బిచ్చి వదుల్చుకుందామని ప్రయత్నించాను. డబ్బక్కర్లేదంది. నా వెర్రికానీ లక్షలకు లక్షలు ఆస్తివచ్చి పడుతూంటే చిల్లరడబ్బులకెందుకే కక్కుర్తి పడుతుంది? అప్పుడు నేనా పిల్లని కొన్నాళ్ళపాటు ఈవూళ్లో లేకుండా చేసిచూడమన్నాను నా మనిషికి."

"ఎవరా మనిషి?"

"ఆ మనిషి నీ ఊళ్ళోనే వున్నాడు. అతని దగ్గర ఆ పిల్ల క్షేమంగానే వుంటుందని నా అనుమానం. కొంతమందికి భగవంతుడు చాలా ఆయుర్దాయమిస్తాడు. నా కంటిలో నలుసుకావడం కోసం అది యింకా క్షేమంగానే వుండివుంటుంది. ఆ పిల్ల చచ్చిందని తెలిస్తేనైనా వీడి మనసు మారుతుందేమోననుకున్నాను. కానీ వీడికి చిన్నప్పట్నించీ పెంచి పెద్దచేసిన తలిదండ్రులకంటె— ఆ పిల్లే ఎక్కువగా వుంది" అన్నాడు సుజాత తండ్రి.

"మా ఊళ్లోనా? ఎవరు నాన్నా అతను?" అనడిగింది.

"అతని పేరు సుధాకర్. అడ్రస్ యిస్తాను. అతన్నడిగితే శాంతిగురించి అన్ని వివరాలూ చెబుతాడు" అన్నాడు సుజాత తండ్రి.

"అంటే నేను మీకు చెప్పిన సుధాకర్ ఇతడూ ఒకరు కాదుగదా?" అంది సుజాత.

"అన్నట్లు సుధాకర్ నీ భర్తకు స్నేహితుడే కదా— అడ్రస్ కూడా చెప్పనక్కర్లేదు అయితే?" అన్నాడు సుజాత తండ్రి.

"ఇప్పుడే బయల్దేరుదాం" అన్నాడు రవి.

"ఇంటికి వచ్చిన ఆడపిల్లను అలా ఎప్పుడుపడితే అప్పుడు పంపడానికి వీల్లేదు. ఎల్లుండిదాకా ఓపికపట్టు" అంది సుజాతతల్లి రవితో.

## 9

"కెవ్వు" మని అరిచి లేచి కూర్చుంది సుజాత.

ఆ కేక ఎంత పెద్దదిగా వుందంటే ఇంటిల్లిపాదీ లేచి పోయారు.

"ఏం జరిగిందమ్మా?" అన్నాడు కంగారుగా సుజాత తండ్రి.

సుజాత ఇంకా వణుకుతూనే "ఆ హంతకుడు మళ్ళీ కలలోకి వచ్చాడు నాన్నా!" అంది.

"ఏ హంతకుడు?" అన్నాడు సుజాత తండ్రి.

"శాంతిని చంపినవాడు...." అంది సుజాత.

రవి, తలితండ్రులూ ఆమె మంచంపైన కూర్చున్నారు.

"శాంతి బ్రతికేవుందమ్మా. ఆమెను ఎవరూ చంపలేదు. నువ్వు అనవసరంగా భయపడుతున్నావు...." అన్నాడు సుజాత తండ్రి.

"ఏమో, అంతా నా కళ్ళముందు జరిగినట్లే వుంది" అంది సుజాత.

"శాంతి హత్య మళ్ళీకలలో కనబడిందా?" అన్నాడు రవి.

"కలలో నేనుచూసింది హత్యకాసీ—ఈ పర్యాయం ఆ అమ్మాయి శాంతికాదు. ఇది మరో హత్య...." అంది సుజాత.

"మరో హత్యా....ఎవరా అమ్మాయి?" అన్నాడు రవి ఆతృతగా.

"సుధాకర్ భార్య-రాధిక" అంది సుజాత.

సుజాత తండ్రి తృళ్ళిపడి "నిన్నేదో పిశాచం ఆవహించినట్లుంది. ఎవరయినా సైకియాట్రిస్టును సంప్రదించాలి" అన్నాడు.

"లేదు నాన్నా. కల్లోకనబడే హంతకుణ్ణి నిన్న ఈ ఊళ్లోనే చూశాను. వాడెవరో, ఎందుకిలా హత్యలు చేస్తున్నాడో, అవి నా కలల్లో కెందుకొస్తున్నాయో తెలియడంలేదు" అంది సుజాత.

"కలలు రావడం మానసిక వ్యాధి. నీ ఆరోగ్యం బాగాలేదని నా అనుమానం" అన్నాడు సుజాత తండ్రి.

"నా మనసు రాధికకు అపాయాన్ని శంకిస్తోంది. శాంతికి పట్టినగతే రాధికకూ పట్టిందేమోనని భయంగా వుంది" అంది సుజాత.

సుజాత తండ్రి ఆలోచిస్తూ "నీ కల్లోకనబడ్డ హంతకుణ్ణి వూళ్లో చూశావా? ఎక్కడ?" అని అడిగాడు.

"మాధురి ఇంట్లో!" అన్నాడు రవి.

"ఎలా వుంటాడు వాడు?"

"బొమ్మ వేయడం రాదు నాకు. వాడి ఫోటో ఎక్కడా దొరకడంలేదు. ఎంత వర్ణిస్తే మాత్రం మీకు అర్థమయేలా చెప్పగలను?" అంది సుజాత.

## 10

"మధూ, మనం నా ఫ్రెండ్ సుధాకర్ ఇంటికెళ్ళాలి. అందుకే నేనీవూరు వచ్చాను కూడా" అన్నాడు రవి.

"నువ్వుండరా, ముందు నన్ను వివరాలు చెప్పనీ?" అంది సుజాత.

భార్య చెప్పిన వివరాలు విని "సుజా! నువ్వు చెప్పేదంతా వింటూంటే ఇప్పుడు నేను కలగంటున్నానేమో నని అనుమానంగా వుంది" అన్నాడు మధు.

తర్వాత అందరూ బట్టలు మార్చుకుని సుధాకర్ ఇంటికి వెళ్ళారు. వీళ్ళు వెళ్ళేసమయానికి సుధాకర్ ఇంటి లోనే వున్నాడు.

"రండి. ఏమిటిలా చెప్పకుండా వచ్చేశారు...." అన్నాడు సుధాకర్ వాళ్ళను సాదరంగా ఆహ్వానిస్తూ.

పరస్పర పరిచయాలు, కుశలప్రశ్నలు కావడానికి కొద్దిసేపు పట్టింది.

"మీతో ఒక ముఖ్యమయిన పనుండి వచ్చాను...." అన్నాడు రవి.

"చెప్పండి" అన్నాడు సుధాకర్.

రవి క్లుప్తంగా శాంతికీ తనకూ సంబంధించిన కథ చెప్పి "మా నాన్నగారు మిమ్మల్నడిగితే శాంతి ఆచూకీ తెలుస్తుందన్నారు" అన్నాడు.

సుధాకర్ ముఖం ఎలాగోలా అయిపోయింది. "ఆమె ఇక్కడకొచ్చి ఓ వారంరోజు లున్నమాట నిజం. ఆ వారం రోజులూ ఆమెను నేను కంటికి రెప్పలా చూశాను. అంతస్థుల భేదాలగురించి రాధిక ఆమెకు ఎన్నో కథలు చెప్పింది. అవన్నీ విన్నాక శాంతిలో చాలా మార్పు

వచ్చింది. నేను రవిని పెళ్ళి చేసుకోను. కొంతకాలం పాటు అతనికి దూరంగా ఉంటాను అని చెప్పి ఈ ఊరు వదిలి వెళ్ళిపోయింది. మీరు చెప్పిందాన్ని బట్టి ఆమె అన్న మాట నిలబెట్టుకున్నట్లు తోస్తోంది."

రవి, సుజాత ముఖముఖాలు చూసుకున్నారు.

"శ్రీమతి రాధిక కనబడరేం?" అన్నాడు మధు.

సుధాకర్ తడబడుతూ—"ఆమె ఊళ్లో లేదు...." అన్నాడు.

మళ్ళీ రవి, సుజాత ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

"శాంతి హత్య చేయబడిందని నా అనుమానం—" అంది సుజాత.

"శాంతి ఎందుకు హత్య చేయబడుతుంది? మీ అనుమానానికి అర్థంలేదు" అన్నాడు సుధాకర్.

"ఎందుకో చెప్పలేను. ఒకవేళ జీవించే ఉన్నదనుకోండి. ఇంతవరకూ తన తలిదండ్రులనుకూడా కలుసుకోలేదామె. కన్నవారినికూడా మరిచిపోయి ఒంటరి ఆడపిల్ల ఇంతకాలం ఎక్కడుంటుంది? ఏ కసాయివాడికో బలయిపోయి వుండవచ్చునేమోనని నా అనుమానం—" అంది సుజాత మళ్ళీ.

"కీడెంచి మేలెంచమంటారు చాలామంది. నా సిద్ధాంతము అందుకు పూర్తిగా వ్యతిరేకం. శాంతి శవం దొరకనంతకాలం ఆమె బ్రతికుందనే ఆశించాలి" అన్నాడు సుధాకర్.

"నేను మాత్రం కీడెంచి మేలెంచుతాను. మీ శ్రీమతి రాధికకూడా హత్యగావించ బడిందని నా అనుమానం"

అంది సుజాత.

సుధాకర్ రెండు చెవులూ మూసుకుని కెవ్వుమని అరి చాడు. అతనలా చేస్తాడని తెలియని ఆ ముగ్గురూ ఉలిక్కి పడ్డారు.

"ఏమన్నారు మీరు?" అన్నాడు సుధాకర్.

"రాధిక హత్య చేయబడిందని నా అనుమానం—" అంది సుజాత మళ్ళీ.

"నో-ప్లీజ్ అలా అనవద్దు" అంటూ అరిచాడు సుధా కర్.

"ఏమిటి సుధాకర్, మీ పిచ్చికానీ సుజాత అన్నంత మాత్రాన రాధిక చచ్చిపోతుందా? ఇంతకూ మీ ఆవిడ ఎక్కడుంది?" అన్నాడు మధు.

"పుట్టింట్లో" అన్నాడు సుధాకర్. అతని ముఖం పాలిపోయి వుంది.

"ఎందుకయినా మంచిది. మీ శ్రీమతిని గురించి వాకబు చేయండి. నా మనసు కీడును శంకిస్తోంది" అంది సుజాత.

# 11

రవి, మధు, సుజాత ఇంట్లో కూర్చుని మాట్లాడుకుం టుండగా రాత్రి ఎవరో తలుపుతట్టారు. రవి వెళ్ళి తలుపు తీసి "ఓ సుధాకర్ గారా, రండి" అంటూ అతన్ని ఆహ్వానించాడు.

సుధాకర్ కళ్ళు ఎర్రగా వున్నాయి. జుత్తు చెదరి పోయింది. "మీ చెల్లెలు సుజాతవుందా?" అన్నాడు. ఆ కంఠంలో జీవం లేదు.

"రండి లోపలకు. అంతా వున్నారు" అన్నాడు రవి.

సుధాకర్‌ని చూస్తూనే "ఏమయిందండీ అలా వున్నారు?" అంటూ ప్రశ్నించాడు మధు.

సుధాకర్ అతనివంక చూడకుండా "సుజాతగారూ, రాధికకేదో ప్రమాదం జరిగుంటుందని మీరెలా అనుకున్నారు? వెంటనే చెప్పండి. ప్లీజ్" అన్నాడు.

"ఏం?" అంది సుజాత.

"మీరు వెళ్ళగానే వాళ్ళ పుట్టింటికి ట్రంక్-కాల్ చేశాను. అసలు రాధిక అక్కడికి రానేలేదన్నారువాళ్లు. తల్లీ తండ్రీ వెంటనే యిక్కడకు బయల్దేరి వస్తామన్నారు" అన్నాడు సుధాకర్.

"రాధిక ఇంటికి ఎప్పుడు బయల్దేరి వెళ్ళింది?"

"నిన్న సాయంత్రం" అన్నాడు సుధాకర్.

నిన్నటిదినం రాత్రి పుట్టింట్లో తనకు కలవచ్చింది. ఈ రోజు ఉదయం బయల్దేరి మధ్యాహ్నానికి తనీ ఊరు చేరుకుంది. సాయంత్రం అంతా కలిసి సుధాకర్ యింటికి వెళ్ళారు. అప్పటికి సుధాకర్‌కి ఏమీ తెలియదు. అత్తారింటికి ట్రంక్ కాల్ చేశాడు. వాళ్ళామె గురించి తెలియదన్నారు. అంటే రాధిక నిన్నరాత్రి తనకు కలవచ్చిన సమయంలోనే హత్యకావించబడిందా?

"నిన్నరాత్రే రాధికకు ప్రమాదం జరిగిందని నా అనుమానం" అని ఒక్కక్షణం ఆగి "శాంతికి సంభవించిన విధంగానే రాధికకూ ప్రమాదం సంభవించినదని అనుకుంటున్నాను."

"మీ ఊహ ఏమిటో చెప్పండి!" అన్నాడు సుధాకర్ ఆత్రుతగా.

"అది ఒకగది. ఆ గదిలో గోడ. గోడ మధ్యగా రెండూ, క్రిందగా రెండూ హుక్స్ ఉన్నాయి. శాంతి కాళ్ళూ, చేతులూ ఆ హుక్స్‌కు తాళ్ళతో బంధించ బడ్డాయి. ఆమె మాట్లాడకుండా నోటికి టేపు వేయబడి వుంది. తరువాత హంతకుడు చేతిలోనికి కత్తి తీసుకొని ఆమెను సమీపించాడు. ఆమె గుండెలపై ఒకసున్నా చుట్టి కత్తితో సరిగ్గా ఆ సున్నాలోకి పొడిచాడు. శాంతి చచ్చిపోయింది. రాధికకూడా ఆదేవిధంగా హత్యచేయ బడిందని నా అనుమానం."

"నో - నా రాధ చావదు" అన్నాడు సుధాకర్.

"మీరు అరచినంత మాత్రనా ఆమె బ్రతుకదు. ఆమెను చంపిన హంతకుడు మీకు బాగా కావలసినవాడు అని నా అనుమానం. మాటల్లోనూ, అలవాట్లలోనూ మీ ఇద్దరికీ చాలా పోలికలున్నాయి" అంది సుజాత అతనివైపు తీవ్రంగా చూస్తూ. మిగతా ఇద్దరూకూడా అతని ముఖ కవళికలను గమనిస్తున్నారు. అవి క్షణానికొకలా మారిపోతున్నాయి.

"అంతా చూసినట్లు మాట్లాడుతున్నారు మీరు...." అన్నాడు సుధాకర్.

"తాను చాలా తెలివిగా, రహస్యంగా హత్యలు చేస్తాననుకుంటున్నాడు హంతకుడు. కాని ఆ రెండు హత్యలూ నేను చూశాను" అంది సుజాత.

ఎందుకో సుధాకర్ ఆపాదమస్తకం వణకిపోతూ—

"ఆ హంతకుణ్ణికూడా మీరు చూశారా?" అన్నాడు.

"చూశాను. కళ్ళారా చూశాను" అంది సుజాత.

"కలగని వుంటారు" అన్నాడు హేళన ధ్వనించే స్వరంతో సుధాకర్.

"అవును. కలలోనే చూశాను. కానీ ఆ కలలోని హంతకుణ్ని బయటకూడా చూశాను" అంది సుజాత.

"ఎక్కడ? ఎప్పుడు?" అన్నాడు సుధాకర్ ఆత్రుతగా.

"బహుశా రెండుమూడు రోజులయ్యుంటుందేమో— మా నాన్నగారూళ్లో మాధురి అనే ఆమె యింట్లో చూశాను" అంది సుజాత.

సుధాకర్ కొద్దిగా షాక్ తిన్నాడు.

"సుజాతగారు నిజమే చెబుతున్నారని నాకు అనుమానంగా వుంది. నా రాధిక నాకిక లేదేమోనని భయంగా వుంది. నాకు మతిపోతోంది. నేను వెళ్ళిపోతాను...." అంటూ అతను గిరుక్కున వెనక్కి తిరిగాడు.

మధు ఏదో చెబుతున్నా వినిపించుకోకుండా వెళ్ళిపోయాడు సుధాకర్.

"అతని మనసు బాగా దెబ్బతిన్నట్లుంది!" అన్నాడు మధు.

"మనం ఓ పర్యాయం పోలీసుల్ని కలుసుకుని ఫిర్యాదు చేయడం మంచిదేమో. నాకు సుధాకర్ మీద అనుమానంగా వుంది. రాధిక, శాంతి ఇద్దరూ అతని యింటినించే మాయమయ్యారు" అన్నాడు రవి సాలోచనగా.

"నో నో ఇట్స్ ఇంపాసిబుల్. అతడికి పెళ్ళామంటే ప్రాణం" అన్నాడు మధు.

# 12

రవి, మధు కలిసి బయటకు వెళ్ళాక సుజాతకు ఫోన్ వచ్చింది.

"హలో— సుజాతగారా?" అంది అవతలి కంఠం.

"అవును నేనే. ఎవరూ మాట్లాడుతూంట?" అంది సుజాత.

"నేను సుధాకర్ ని మాట్లాడుతున్నాను. మధుగారు లేరా?"

"ఆయన ఆఫీసుకు వెళ్ళారు. అన్నయ్య శాంతిగురించి పోలీస్ కంప్లయింట్ ఇవ్వడానికి పోలీస్ స్టేషనుకు వెళ్ళాడు" అంది సుజాత.

అవతల పక్కనుంచి నవ్వు వినిపించింది.

"ఎందుకో నవ్వుతున్నారు?" అంది సుజాత.

"మీకు, మీ అన్నయ్యకు, నాకు మనందరికీ ఒక శుభవార్త. శాంతి, రాధిక ఇద్దరూ క్షేమంగా ఇప్పుడు నా యింట్లోనే వున్నారు." అన్నాడు సుధాకర్.

సుజాతకు ఆశ్చర్యంతో నోటమాట రాలేదు.

"హల్లో" అంది అవతలి కంఠం.

"ఆఁ" అంది సుజాత తేరుకొని.

"ఏమిటండీ మాట్లాడ్డం మానేశారు, హఠాత్తుగా" అన్నాడు సుధాకర్.

"ఆశ్చర్యంతో నాకు నోట మాటరావటం లేదు—" అంది సుజాత.

"శాంతి ఇప్పుడు తన మనసు మార్చుంది. మీ అన్నయ్యను పెళ్ళి చేసుకొంటుందట. వీలయినంత త్వరగా ఇక్కడకు రమ్మంది" అన్నాడు సుధాకర్.

"అన్నయ్య ఇంటికి ఎన్నింటికి వస్తాడో తెలియదు. ఈ లోగా నేను మీ యింటికి రావచ్చా?" అంది సుజాత.

"ష్యూర్. రాధిక మీ గురించి చక్కని విందు ఇవ్వాలనుకుంటోంది."

"అసలు వీళ్ళిద్దరూ ఏమయ్యారుట? ఒక్కసారే

ఎలా బయట పడ్డారుట?"

"అవన్నీ ఇక్కడకు వచ్చాక తెలుసుకుందాం. మీ ఊహాగానంతో నన్ను చాలా కలవర పెట్టేశారు. నేను ఎలాగో తట్టుకున్నాను కానీ ఇంకెప్పుడూ ఎవరిపైనా ఇలాంటి ప్రాక్టికల్ జోక్స్ వేయకండి" అన్నాడు సుధాకర్.

సుజాత ఏమీ మాట్లాడలేదు. అంతా ఏదో విచిత్రంగా అనిపించ సాగింది ఆమెకు.

"ఏం మాట్లాడటంలేదు మీరు?" అన్నాడు సుధాకర్.

"పదినిమిషాల్లో బయల్దేరి వస్తున్నాను" అంది సుజాత. తన కల తప్పు అయినందుకూ, తన అన్న ప్రియురాలు బ్రతికి వున్నందుకూ ఆమెకు చాలా సంతోషం కలిగింది.

# 13

రవి విసుగ్గా ఇంటికివున్న తాళంవంక చూసి "సుజాత ఏమైపోయిందబ్బా?" అనుకున్నాడు. అంతలో నే ఎదురింటి,కుర్రవాడువచ్చి అతని చేతికి ఓ ఉత్తరమూ, తాళం చెవీ ఇచ్చి "సుజాత ఆంటీ మీరువస్తే మీ కిమ్మని చెప్పారివి" అన్నాడు.

రవి ముఖం ఆనందంతో వికసించింది ఆ ఉత్తరం చదువుతుంటే. ఇప్పుడే తను పోలీస్ స్టేషన్లో రిపోర్టిచ్చి వచ్చాడు శాంతిగురించి. ఇన్స్పెక్టర్ తన కథనాన్ని విని "ఇది చాలా విచిత్రమైన కేసు. నేను ఎక్కడో పుస్తకాల్లో చదివాను. మనిషి మెదడు ఒకోసారి రేడియో ట్రాన్స్మిటర్లా పనిచేస్తుందిట. ఆ విధంగా కొన్ని జరిగిన దృశ్యాలు కలల్లో చూడటం జరుగుతుందిట. మీ చెల్లెలి మెదడుకూ ఆ హంతకుడి దుశ్చర్యలకూ యేదో ట్యూనింగ్ కుదిరింది. అందువల్ల ఆమె హత్యలను చూడ్డం

జరిగింది. ఇలా అనుకొని పరిశోధన ప్రారంభిస్తే మేము సుధాకర్ చుట్టూ తిరగాల్సి వుంటుంది. ఈ కేసునింకా రికార్డ్సులోకి తీసుకువెళ్ళను. ఎందుకంటే ఒక కల ఆధారంగా తయారవుతున్న కేసు ఇది. ఏదో సరయిన ఆధారాలు దొరికేవరకూ అంతా అనఫీషియల్‌గానే వుంటుంది. మనమెంతా శ్రమపడితే చివరకు ఏమీ ఉండకపోవచ్చు. ఒక వారంరోజుల తర్వాత మీరు మళ్ళీ నాకు కనిపించండి" అన్నాడు. తను తలాడించి ఇంటికి వచ్చేసరికి ఇల్లు తాళం వేసివుంది.

ఇంతకాలం ఆగి ఇప్పుడు తను శాంతినిగురించి పోలీసు ఫిర్యాదు యిచ్చాడు. శాంతి తలిదండ్రులు పోలీసురిపోర్టు యివ్వకుండా తనతండ్రి అడ్డుపడ్డాడు. అదే ఆయనపై తనకుగల అనుమానాన్ని కూడా పెంచింది. తీరా యిప్పుడు తను రిపోర్టిస్తే శాంతి బ్రతికేవున్నట్లు తెలిసింది.

ఆ వుత్తరాన్ని మూడుసార్లు ముద్దుపెట్టుకుని కనబడ్డ రిక్షా ఎక్కాడు రవి. రిక్షా ఎంత వేగంగా వెళ్ళినా అతనికి నెమ్మదిగా వెడుతున్నట్లే అనిపించింది. సుధాకర్ ఇల్లు మరీ దూరంలో లేకపోయినా చాలా దూరంలో వున్నట్లు తోచింది. అతని మనసునిండా ఆలోచనలనిండా శాంతి!

సుధాకర్ ఇల్లు రాగానే రిక్షాదిగి వాడికి డబ్బులిచ్చి తను వెళ్ళి కాలింగ్ బెల్ మ్రోగించాడు. గంట మ్రోగుతున్న ధ్వని అయింది కానీ ఎంతసేపటికీ ఎవ్వరూ రాలేదు. రవి మళ్ళీ కాలింగ్ బెల్ మ్రోగించాడు. లోపల్నుంచి యెవరో వస్తున్న అడుగుల సవ్వడి అవుతోంది.

తలుపు తీసి "మీరా?" అన్నాడు సుధాకర్, అతను

మనిషి హఠాత్తుగా ముసలివాడిగా అగుపించాడు. ముఖంలో రవంత కంగారుకూడా వుంది.

"శాంతికోసం వచ్చాను" అన్నాడు రవి కళ్ళలో ఆత్రుతగా లోపల వెతుకుతూ.

"శాంతి ఇక్కడలేదని మీకు తెలుసుగదా" అన్నాడు సుధాకర్.

"నా ఆత్రుతను పెంచకండి సుధాకర్" అంటూ రవి అతడి చేతిలో సుజాత తనకు వ్రాసిన ఉత్తరం పెట్టాడు. సుధాకర్ త్వరగా అది చదివి "అయితే సుజాత కూడా ఇక్కడుందని వచ్చారా మీరు?" అన్నాడు.

"అంటే?" అన్నాడు రవి కంగారుగా.

"నేను సుజాతకు ఫోన్ చేయలేదు. ఆమె ఇక్కడకు రాలేదు. శాంతి, రాధిక గురించి నాకేమీ తెలియదు. మతిపోయినట్లై ఆఫీసుక్కూడా వెళ్ళకుండా ఇక్కడే వుండిపోయాను."

రవి తలపట్టుకుని చతికిలబడిపోయి "అయితే ఏం జరిగిందంటారు?" అన్నాడు. అతడికాళ్ళలో వణుకు ప్రారంభమైంది.

"మధు కానీ ఆమెకు నా పేరుతో ఫోన్ చేసి దారిలో ఆమెను కలుసుకున్నాడేమో - అతడికి ఒకవేళ శాంతి, రాధిక కనబడ్డారేమో" అన్నాడు సుధాకర్.

"అయితే మీరు కూడా రండి మధు ఆఫీసుకు వెడదాం" అన్నాడు రవి.

"నేనిప్పుడు ఎక్కడకూ రాలేను. ఊహలు నా ఆశల్ని చంపేశాయి కానీ బ్రతికించలేకపోతున్నాయి. రాధిక కనబడితే మాత్రం నాకు కబురుపెట్టండి" అన్నాడు సుధాకర్.

రవికి ఫోన్‌లో తప్పడు సమాచారం ఎవరు, ఎందుకు అందిస్తారా అని ఆలోచిస్తూ అక్కణ్నించి మధు ఆఫీసుకు వెళ్ళాడు. అయితే సుజాత అక్కడికి రాలేదని తెలిసింది. జరిగింది విని మధు కంగారుపడ్డాడు. ఎవరో సుజాతకు ఆపద తలపెట్టారని అతనికి అనిపించింది.

ఇద్దరూ కంగారుగా ఇంటికి వెళ్ళారు. ఇల్లింకా తాళం పెట్టేవుంది.

"రవీ! నాకు చాలా బెంగగావుంది. మీ నాన్నగారు శాంతిని సుధాకర్‌కి అప్పజెప్పారు. ఆమె అమాయకమైంది. రాధిక అతన్ని పెళ్ళిచేసుకుని మాయమయింది. అతని దగ్గర్నుంచి ఫోన్‌వచ్చి బయల్దేరివెళ్ళిన సుజాత జాడ తెలియడంలేదు. సుధాకర్ మంచివాడు కాదని నాకు అనుమానంగావుంది. నా సుజాను మళ్ళీచూస్తానో లేదో" అంటూ బెంగగా చతికిల బడిపోయాడు మధు.

"అలా చప్పుపడిపోకు బావా? వాడి పాపం పండింది. వాడింటికివెళ్ళి వెతుకుదాం. సుజాత తప్పక అక్కడే వుండవచ్చు" అన్నాడు రవి.

"ఈ ఆలోచన నీకు ఇదివరలోనే వచ్చివుండాల్సింది. వాడింకా సుజాతను ప్రాణాలతో వుంచాడో లేదో- నా సుజాతను నేనుమళ్ళీ...." అని కళ్ళువత్తుకుని బయల్దేరాడు మధు.

## 14

ఆమె గోడకు ఆనుకునివుంది. కాళ్ళు, చేతులు గోడకున్న హుక్కులకు తాళ్ళతో కట్టబడి వున్నాయి. ఆమె నోటికి టేపు అంటించివుంది. ఆమె పెనుగులాడాలనీ, అరవాలనీ విఫల ప్రయత్నాలు చేస్తోంది.

ఎడమచేత్తో పొడవాటి, పదునయిన కత్తితో అత నామెను సమీపించాడు. ఆమెను సమీపించి—కత్తిని కుడిచేతిలోకి మార్చుకుని జేబులోంచి బాల్ పెన్ తీశాడు.

"నిన్ను చంపాలనీ, చంపాల్సి వస్తుందని నేననుకో లేదు. కానీ ఎంతో రహస్యంగా, నేను చేసిన హత్యలు చూడటమే కాక నన్నుకూడా గుర్తించావు నువ్వు. నా బ్రతుకుకోసం నిన్ను చంపాల్సి వస్తోంది. అందుకు బాధ గానేవుంది. కానీ అది నీ దురదృష్టం" అని నవ్వాడతను.

అతని ఎడమచేయి చకచకా పనిచేసింది. ఆమె గుండెలమీది ఆచ్ఛాదన తొలగింది. ఆ సమయంలో ఆమెకు తను పరాయి మగవాడి ఎదుట అసహాయ స్థితిలో వున్న విషయం స్ఫురణకురాలేదు. అతను తన గుండెల వేపు చూస్తున్నందుకు శరీరం సిగ్గుతో కుంచించుకుపోలేదు. ప్రాణభయం—అదొక్కటే ఆమె మెదడునిండా నిండి పోయివుంది. అతను నోటిమీద టేపుతీస్తే "నన్ను చంప వద్దు. నన్ను చంపవద్దు" అని ఆర్తనాదాలు మినహాయించి మగోపని చేసివుండేది కాదు.

అతను బాల్ పెన్ తో ఆమె గుండెపైన ఒక సున్నా చుట్టాడు.

ఆమె గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి. పెరుగుట తరుగుట కొరకే అన్నట్లు—ఆ వేగం పూర్తిగా ఆగి పోవడానికేనని ఆమెకు తెలుసు. ఆ భయంకర హంత కుడు చేసిన రెండుహత్యలు కళ్లారాచూసిన ఆమెకు ప్రాణాలమీద ఆశలేదు.

అతను నవ్వుతూ కుడిచేతిలోంచి కత్తిని ఎడమచేతిలోకి మార్చాడు. ఆమె ఊపిరి బిగబట్టి అతనివంక చూస్తోంది. ఆమె కళ్ళలోంచి ఆగకుండా నీళ్ళు కారిపోతున్నాయి.

తను కలలో ఇద్దరు అతివల మానసికాందోళన చూసింది. ఆ దృశ్యాలు చూసి ఎంతగానో వణికిపోయింది. కానీ అదే అనుభవం తనకే ఎదురవుతుందని అనుకోలేదు. ఎప్పటి లాగే ఇది కలగా మారిపోతే ఎంత బాగుండును.

కానీ ఇది కలకాదనీ పచ్చి వాస్తవమని కొద్దిక్షణాల్లో తన గుండెల్లోంచి రక్తం ఎగజిమ్ముతుందనీ తనతల పక్కకు వాలిపోతుందనీ ఆమెకు తెలుసు. ఆమె నిస్సహాయంగా ఆ హంతకుడివంక చూస్తోంది.

తను సుధాకర్ కోసమని వచ్చింది. ఇంటి తలుపులు తీసే వున్నాయి. లోపల అడుగుపెట్టింది. ఎవరూ కన బడలేదు. వెతుక్కుంటూ ఒకో గదిలోకే వెడుతూ ఓ గది చేరి ఆ గదిచూసి ఆశ్చర్యపడింది. తనుకలలో చూసిన గదికి లాగునేవున్నది. గోడకున్న హుక్స్ చూసి గజగజా వణికిపోయింది. వెంటనే అక్కణ్నించి వెళ్ళిపోవాలను కున్నది కానీ అంతలోనే గది తలుపులు మూసుకున్న చప్పు డయింది. కంగారుపడి వెనక్కు తిరిగింది.

వాడే, ఆ ఘోరహంతకుడు. ఎవడు కళ్ళబడితే తన శరీరం ఆపాదమస్తకమూ వణికిపోతుందో, వాడు అక్కడ నిలబడి క్రూరంగా చూస్తున్నాడు. భయంతో తన శరీరం చచ్చుబడిపోయింది. వాడు తనను బెదిరిస్తూ తీసుకువచ్చి హుక్స్‌కు బంధించాడు. నోటికి టేపు అంటించాడు.

ఇప్పుడు వాడిచేయి గాలిలోకి లేస్తోంది. ఇంక తన బ్రతుక్కు ఎంతో వ్యవధిలేదు. అప్రయత్నంగానే ఆమె గట్టిగా కళ్ళు మూసుకుంది.

అప్పుడే కాలింగ్ బెల్ ధ్వని గదిలో మార్మోగింది.

ఇందాకా తనను హుక్స్‌కు కడుతున్నప్పుడు యిలాగే కాలింగ్ బెల్ మ్రోగింది. తనను పూర్తిగా బంధితురాలిని

చేసి అప్పుడు బయటకు వెళ్లాడు. ఎవరో వచ్చి తనను రక్షిస్తారని ఆశించింది కానీ కాసేపటికి మళ్ళీ వాడే వచ్చాడు.

ఇప్పుడు మళ్ళీ కాలింగ్ బెల్ మ్రోగుతోంది. భయంకరమయిన వాడి ముఖంలో కంగారు కనబడుతోంది. ఎత్తిన కత్తి కిందికి దిగిపోయింది. మళ్ళీ తనకు కొన్ని క్షణాలు జీవితం లభించింది. ఆ పోయే ప్రాణమేదో వెంటనే పోతే బాగుండును. ఇప్పుడు భయంతో ప్రతి క్షణమూ చచ్చిపోతోంది తను. ఏమో ఆ కాలింగ్ బెల్ మోగడం క్షణం ఆలస్యమైతే కత్తి తనగుండెల్లో దిగబడేదేమో. తనకింకా ఆయువు ఉన్నదేమో!

ఆమెలో మళ్ళీ కొత్త ఆశలు చిగుర్చుతున్నాయి. అతను బయటకు వెళ్ళాడు.

ఎవరతను? సుధాకర్ కి ఏమవుతాడు? సుధాకర్ ఇంట్లో మకాం ఎలా సంపాదించాడు? సుధాకర్ కీ యితనికీ ఏమిటి సంబంధం? రకరకాల ప్రశ్నలు ఆమె మనసులో మెదులుతున్నాయి. కుతూహలానికి సంబంధించిన ఈ ప్రశ్నల వెనుక ఆమె జీవన్మరణ సమస్య మనసులో మెదుల్తూనే వున్నది.

మరి కాస్సేపటిలో ఆ గదిలోకి కొందరు మనుషులు అడుగు పెట్టారు. ఆమె కళ్ళు వెలిగాయి. ఎదురుగా మధు, రవి, పోలీస్ ఇన్ స్పెక్టర్, సుధాకర్....

మధు సుజాతను చూశాడు. నిస్సహాయంగా గోడకు వేలాడుతున్న మనిషి. ఆచ్ఛాదనలేని గుండెలపై నీలంగా మెరుస్తున్న వలయం.... అతను చటుక్కున పరుగెత్తి ఆమెను సమీపించి గుండెలమీది ఆచ్ఛాదనను సరిచేశాడు. తర్వాత అంతా ఆమెకు కట్లువిప్పారు.

"ఏం జరిగింది సుజాతగారూ?" అన్నాడు సుధాకర్.

సుజాత సుధాకర్ వంక తిరిగి ఏదో అనబోయి ఆశ్చ ర్యంతో ఆగిపోయింది. "మైగాడ్ - ఇదెలా సాధ్యం ఇతనే హంతకుడా?" అంది చటుక్కున.

సుధాకర్ ఉలిక్కిపడి "మీరేం మాట్లాడుతున్నారో మీకు తెలుసా?" అన్నాడు.

"అదే డ్రస్సు, అదే పొడుగు, అదేమాట. ముఖం మాత్రం తేడా. అతడి చేతిమీద నా పంటిగాటుకూడా వుంటుంది చూడండి. అతని జేబులోని బాల్ పెన్ కూడా అదే. ఇదేం మాయ!" అంది సుజాత.

అక్కడున్న అందరికీ ఆమె చెప్పింది అర్థం చేసుకోవ డానికి కొంత సేపు పట్టింది. సుజాత చెప్పిన ప్రకారం ముఖంతప్ప మిగతా ఆనవాళ్ళన్నీ సుధాకర్ కి సరిపోతు న్నాయి. పోలీస్ ఇన్ స్పెక్టర్ పరీక్షగా సుధాకర్ ముఖం లోకి రెండు క్షణాలు చూసి చటుక్కున అతన్ని తన ఉక్కు కౌగిలిలో బిగించి, "మిస్టర్ మధూ! ఇతగాడి ముఖానికున్న మాస్క్ ను తొలగించడానికి ప్రయత్నిం చండి" అన్నాడు.

మధు, రవికూడా ఎంతో ప్రయత్నించారు కానీ— అది అసలు ముఖమే కాని మాస్కు కాదని తెలిసింది. ఇన్ స్పెక్టర్ ఇంకో క్షణం ఆలోచించాడు. మళ్ళీ సుధాకర్ని బాగా శోధించారు.

సుధాకర్ చొక్కా లోపలి జేబులోంచి ఒక మాస్క్ దొరికింది. ఆ మాస్క్ ని తనే స్వయంగా సుధాకర్ కు తొడిగాడు ఇన్ స్పెక్టర్. అప్పుడు అతన్ని చూస్తూనే, "కెవ్వుమని" అరిచింది సుజాత.

"హంతకుడు దొరికాడు" అన్నాడు పోలీస్ యిన్‌స్పెక్టర్.

# 15

శాంతి, రాధికల శవాలు సుధాకర్ ఇంటి దొడ్లో దొరికాయి. సుధాకర్ నేరాలన్నీ ఒప్పుకున్నాడు. అతని కథ విచిత్రమైనది.

బాగా కలిగిన వారింట పుట్టాడతను. తలిదండ్రులు అపురూపంగా పెంచేరు. అతనికి దుర్వాట్లూ, దుష్ట స్వభావమూ ఏర్పడ్డాయి. కానీ అప్పుడప్పుడు అతని ప్రవ ర్తన మరీ దారుణంగా వుండేది.

ఒకరోజు అతను ఓ పనివాణ్ని క్రూరంగా హింసించి గుండెలమీద సున్నా పెట్టి కత్తితో పొడిచి చంపాడు. తలితండ్రులు హడలిపోయారు. ఆ పనికుర్రాడికి కావల సిన వాళ్ళెవ్వరూ లేరుకాబట్టి కేసు ఏమీ అవలేదు. కానీ కుర్రాడి ప్రవర్తనకు భయపడి డాక్టరుకు చూపించగా ఆయన కొంతకాలంపాటు తనవద్ద ఉంచుకుని యెన్నో పరీ క్షలు చేసి "ఇతని శరీరతత్వానికి వంకాయ మంచిదికాదు. అది తిన్నప్పుడు అతని ప్రవర్తనలో విపరీతమైన మార్పు వస్తోంది. అది తిననప్పుడు అతని ప్రవర్తన నార్మల్ గానే ఉంటోంది" అని చెప్పాడు.

అప్పట్నించీ అతనికి వంకాయ వాసనకూడా తగల కుండా జాగ్రత్తపడేవారు తలిదండ్రులు. అయితే అప్పు డప్పుడు పొరపాటు జరుగుతూండడమూ కొడుకు దారుణా నికి తెగించడమూ గమనించేక తండ్రి అతనికోసం ఓ మాస్కు చేయించి ఇచ్చాడు. ఎప్పుడన్నా వంకాయ కూర పొరపాటున తింటే శరీరతత్వం యథాస్థితికి వచ్చే వరకూ మాస్క్ వాడమన్నాడు.

సుధాకర్ ది స్వతహాగా కూడా దుష్టస్వభావం. అందు వల్ల తన బలహీనతను ప్రొఫెషనల్ మర్డర్స్ కూ ఉప యోగించుకున్నాడు. నగరంలోని కోటీశ్వరులకు శత్రువు లను చంపవలసి వచ్చినపుడల్లా అతను వంకాయకూర తిని మాస్కు లేసుకుని తనపని ముగించేవాడు. ఆ విధంగా అతను పాతికేళ్ళకే లక్షలకు లక్షలు సంపాదించి తండ్రిని ఆ సి పరుల జాబితానుండి మహదైశ్వర్యవంతుల జాబితాలోకి మార్చాడు. అతనికి వివాహమయ్యాక హత్యలు మానే శాడు. రాధికకు ఇతని జబ్బుగురించి తెలిసింది శాంతి హత్య తర్వాతనే.

శాంతిని చంపాలని తనింటికి తీసుకురాలేదతను. మామూ లుగా నాలుగురోజు లుంచుకుని మనసుమార్చి పంపేయా లనే తీసుకువచ్చాడు. ఇంట్లో వంకాయకూర వండకుండ అతనెన్నో కట్టుదిట్టాలు చేశాడు కానీ శాంతికి యిష్టమని రాధిక వంకాయకూర చేసింది. రుచి చాలాబాగుందని సుధాకర్ కూడా తిన్నాడు. వెంటనే అతనిలో చలనం ప్రారంభమయింది. భార్యకి చెప్పకుండా రాత్రికిరాత్రి శాంతిని హత్యచేశాడు. అందుకు కారణం రవి విషయంలో మనసు మార్చుకోక పోవడమేనని శాంతితో అన్నాడు.

మర్నాడు ఉదయం శాంతి శవాన్నిచూసి రాధిక కంగారుపడితే తన బలహీనత గురించి చెప్పుకున్నాడతను. రాధిక హడలిపోయింది. ఆ తర్వాత అతన్ని పొరపాటున కూడా వంకాయకూర ముట్టుకోనిచ్చేది కాదు.

ఒకరోజు స్నేహితుడింటికి భోజనానికి వెడితే- వాళ్ళ కితను వంకాయకూర తినడని తెలుసు. ఆ స్నేహితుడి భార్య ఇతనిచేత ఎలాగయినా వంకాయకూర తినిపించి

తన పాకప్రావీణ్యం తర్వాత చెప్పాలనుకుంది. అందుకని మాగో పేరుచెప్పకొ తరకం వంకాయకూర చేసి వడ్డించింది.

అది తిని ఇంటికివెళ్ళాక సుధాకర్ లోని రాక్షసుడు పూర్తిగా మేల్కొన్నాడు. ఇంట్లోవున్న భార్యనుచంపి ఆనందించాడు. ఆ తర్వాత జరిగింది తెలిసి ఏడిచాడు.

ఏకారణంవల్లనో అతడి హత్యలు సుజాత మెదడు టెలివిజన్లో చూసినట్లు చూడగలిగింది. అందుకు కారణాలు పేరాసైకాలజిస్టులు వెదుకవలసిందే. అంతకు మునుపు ఎన్నో హత్యలుచేసినా శాంతిహత్యను మాత్రమే ఆమె కలలో చూసింది. బహుశా సుధాకర్ అప్పుడామెకు కొద్దికిలోమీటర్ల దూరంలో ఉండడమే అందుకు కారణం కావచ్చు. ఆ తర్వాత జరిగిన రాధికహత్య దూరంలో వున్నా ఆమె చూడగలిగింది. అప్పటికా హంతకుడు ఆమె బ్రెయిన్ కు ట్యూన్ కావడం కారణమయియుండవచ్చు. సుజాతకు కలలో కనిపించి ఉండకపోతే ఆరెండుహత్యలూ సుధాకర్ చరిత్రా ఎప్పటికీ బయటపడి వుండేవికాదేమో!

విచిత్ర పరిస్థితిలో అయితేనేం—ఒక దారుణ హంతకుడి ఆచూకీ బయటపడింది.

సుజాత ఇప్పుడు ఇంట్లో వంకాయకూర వండడం పూర్తిగా మానేసింది.

—: అయిపోయింది :—

# మాయమైన వంటగత్తె!!

(పరువు ఖరీదు—రెండవ భాగము)

'సికిందర్'

"నేను పథకం వేసింది నీ దగ్గర డబ్బుకోసం కాదు. నీ బాస్ నగకోసం" అన్నాడు శంకర్ కఠినంగా.

అతని మాటలు విని ఉలిక్కిపడ్డాను. "నగా?—ఏ నగ?"

"పదిలక్షలు విలువచేసే నగ—నీ బాస్ దగ్గర వుంది. నాక్కావాలి."

నేను తటాలున లేచాను. "నువ్వు ఫూల్ వి! పోలీసులకి ఫోన్ చేస్తాను!"

తల అడ్డంగా వూపాడతను, "ఫోటో గుర్తుంచుకో! నీ ఆనవాలు, వేషం పెట్రోలు బంకువాడు పోలీసులకి చెప్పాడు—వాళ్ళు గాలిస్తున్నారు."

శంకర్ మాటలు నన్నదరగొట్టాయి.

"నా కోరిక నిరాకరిస్తే ఈ ఫోటో పోలీసులకిచ్చి నీ కథ చెప్పేస్తాను" బెదిరించాడతను. "ఆ తర్వాత ఊహించు—నీ పరువు ప్రతిష్టలు!

"నీ బాస్ పుణ్యమా అంటూ నువ్వు సంపాదించుకున్న పరువు, పలుకుబడి లోకం దృష్టిలో నవ్వులపాలవుతాయి! ఇహ నీ విలువ కానీ చెయ్యదు!"

"అలా జరక్కుండే ఛస్తాను!" అన్నాను.

నవ్వాడతను, "అవును—పిరికివాళ్ళు చావే కోరుకుంటారు."

నా రక్తం గడ్డకట్టింది.... పిరికివాడ్ని!

వీడు కూడా నా వీక్ పాయింట్ గురిచూసి కొట్టాడు!

"కమల్! నువ్వు నా చెప్పుచేతల్లో వున్నావు. నా కోరిక నిరాకరిస్తే పర్యవసానం నీకు తెలుసు. నా కోరిక తీర్చడానికి నీకు ధైర్యం లేక చావు కోరుకోవని గ్యారంటీ యిస్తాను. అందుకు బదులుగా నన్ను చంపే ఆలోచన నీకు రావచ్చు. ఆ ఆలోచన రానీకు. నేను అన్ని జాగ్రత్తలు తీసుకుని వచ్చాను. నెగెటివ్ తోసహా నీగురించి వివరాలు నా ఫ్రెండ్ దగ్గరవున్నాయి. ఒకవేళ నేను ఛస్తే వాటిని పోలీసులకి యిస్తాడు...."

"నువ్వు దుష్టుడివి! నేనిలా మోసపోతాననుకోలేదు! నా బాస్ దగ్గర నగ వుందని నీకెలా తెలుసు?"

నవ్వాడతను, "ధనికుల దగ్గర ఏమేం వున్నాయో తెలుసుకుంటుంటాను—నీ బాస్ దగ్గర నగ వుందని తెలిసింది. పదిలక్షలు! కానీ యెక్కడ దాచాడో తెలీదు. రహస్యంగా సమాచారం సేకరించాను. బ్యాంకులో లేదు. వారంక్రితం ఇంట్లో సేఫ్ తెరిచాను. అందులో లేదు. అయితే ఇంట్లో ఒక రహస్య స్థలం వుందని తెలుసుకున్నాను. అది నీకూ, బాస్ కూ తప్ప ఎవరికీ తెలియదట. నిజమేనా?"

"కాదు."

"అయితే ఫోటో పోలీసులకి పంపవచ్చా?"

బాస్టర్డ్! తిట్టుకున్నాను. శంకర్ చెప్పింది నిజమే. ఆ నగ ఎక్కడ వుందో నాకూ, బాస్ కూ తప్ప ఎవరికీ తెలీదు.

బాస్ దాన్ని తన ముద్దుల భార్యకోసం ఖరీదైన వజ్రాలు పొదిగి చేయించాడు. నాలుగేళ్ళ క్రితం ఆమె చనిపోయినప్పుడు, దాన్ని అమ్మకుండా, ఆమె జ్ఞాపకార్థం, ఒక రహస్యస్థలంలో దాచాడు. ఆ స్థలం ఎక్కడ వుందో నాకు తప్ప ఎవరికీ చెప్పలేదంటే, నా మీద అతనికెంత విశ్వాసం వుందో వూహించవచ్చు.

అలాంటి బాస్ కు నేను ద్రోహం చేస్తానా?

నా గుండె వేగంగా కొట్టుకుంది.

"నీ సందేహం నాకు తెలుసు," అన్నాడు శంకర్ బటానీలు నాకందిస్తూ, "ఎంతో నమ్మకం వుంచిన బాస్ ని మోసం చెయ్యడానికి నువ్వు భయపడుతున్నావు. ఆ భయం అనవసరం. నీకు కొన్ని వాస్తవాలు చెప్తాను, విను: నీ బాస్ ఈ నాడు కోటీశ్వరుడయ్యాడంటే ఎన్ని అక్రమమార్గాలు తొక్కాడు? అది నీకు తెలియంది కాదు. అన్యాయం చెయ్యకుండా ఈ రోజుల్లో డబ్బు సంపాదించడం కష్టం.

"నీ బాస్ సంపాదించిన ఆస్తిపాస్తులన్నీ అక్రమమైనవి కావని ఈ సిటీలో ఎవ్వరైనా అంటే నన్ను చెప్పుతో కొట్టు. అలాంటి బాస్ దగ్గర నాలుగేళ్ళుగా పని చేస్తున్న నీకు, అతని వక్రబుద్ధుల్లో లేశమాత్రమైనా సంక్రమించకపోవడం విచారకరం.

"కమల్, ఈ ప్రపంచం ఒకర్నొకరు మోసం చేసుకునే ప్రాతిపదికపైనే సాగుతోంది. నీ బాస్ ప్రజల్ని

మోసం చెయ్యకపోతే నువ్వులేవు. నువ్వు నీ బాస్‌ని మోసం చెయ్యకపోతే నేను లేను—దౌర్జన్యమనుకోకు! నాది స్వార్థంకాదు. నీకూ భాగమిస్తాను—సగం....”

నాకాశ్చర్యం వేసింది. నేనెంత ఫూల్‌నో అర్థమైంది.

శంకర్ చెప్పిన మాటలు కొట్టివేయడం నాకు ఆత్మ వంచనే అనిపించింది. అతను చెప్పిన వాస్తవాలు నాకు కనువిప్పు కల్గించాయి. ఇంతకాలం నేనెంత అజ్ఞానంలో గడుపుతూ ఎన్ని అవకాశాల్ని, ఎలాంటి అదృష్టాన్ని కాలదన్నానో తలచుకుంటే వూపిరాడలేదు!

నా బాస్‌మీద వున్న గౌరవాభిమానాలు ఆ క్షణం లోనే గాలికి కొట్టుకుపోయాయి. అతను నా పట్ల చూపిస్తున్న ప్రేమానురాగాలు, విశ్వాసం, కేవలం సభ్య ప్రపంచంలో ఫార్మాలిటీగానే తోచాయి.

అందువల్ల— నేను ఘరానా నేరస్థుడు శంకర్‌కి లొంగిపోయాను.

డబ్బుమీద హఠాత్తుగా పుట్టుకొచ్చిన ఆ పేక్షతో కాదు. ముందు పరువుసంగతి చూసుకోవాలి. శంకర్‌ని నిరాకరిస్తే నా పరువు ఏమవుతుందో-ఆ తర్వాత నాకెలాటి గతి పడుతుందో తెలుసు.

కాబట్టి నా పరువు కాపాడుకునేందుకు నా బాస్‌ని మోసం చేస్తాను!

నేను తలూపడం చూసి నవ్వాడు శంకర్.

“గుడ్. నేనాశించిన నిర్ణయమే తీసుకున్నావు. సంతోషం. ఇక ప్లాను చెప్పనా?”

మళ్ళీ తలూపాను.

శంకర్ నవ్వాడు. “నీ బాస్ సిటీలో లేడుకదా? ఈ

రెండురోజులు బాగా ఉపయోగపడతాయి. ఈ రాత్రి అతని ఇంటికెళదాం. ఇంటిముందు గూర్ఖా, ఇంట్లో వంట మనిషీ వుంటారు—మనకి అడ్డురారు. మనం వెనకగోడ నుంచి ప్రవేశిస్తాం. కిచెన్ పక్కన వంటమనిషి గదివుంది. ఆ సమయానికి ఆమె నిద్రలో వుంటుంది. మనం జాగ్రత్తగా లోనికెళ్ళాలి. ఆ తర్వాత నువ్వు రహస్యస్థలం నుంచి నగ తీసి నా కివ్వాలి."

భారంగా వూపిరి వదిలాను, "దాన్ని నువ్వేం చేస్తావు?"

"నాకు కొందరు అరబ్బులు తెలుసు. వాళ్ళకి చూపిస్తే కనీసం అయిదులక్షలు గ్యారంటీ! వ్యవహారం పొక్కదు-మనం ఒకర్నొకరు మోసం చేసుకుంటే తప్ప! వచ్చిన డబ్బులో చెరిసగం మనది?"" అన్నాడతను.

"దొంగతనం బయటపడితే?" అడిగాను కాస్సేపు ఆలోచించి.

"బయటపడదు" అన్నాడతను నమ్మకంగా.

"ఎందుకు పడదు?"

"ఆ నగస్థానే నకిలీనగ వుంటుంది కాబట్టి!" అన్నాడతను.

"అంటే?"

నన్ను సూటిగా చూశాడతను: "నేను అన్ని జాగ్రత్తలు తీసుకున్నాను, కమల్. ఆ నగ దొంగిలించాక దాన్ని నాకు తెలిసిన ఎక్స్పర్ట్ దగ్గరికి తీసుకెళతాను. అతను దాని నమూనా చిత్రించి ఇచ్చేస్తాడు. తిరిగి దాన్ని మనం తీసిన చోటే పెట్టేస్తాం. పదిరోజుల్లో ఎక్స్పర్ట్ డూప్లికేట్ తయారుచేసి యిస్తాడు-పాతికవేలు ఖర్చయినా శాశ్వత రక్షణ వుంటుంది-అప్పుడు నకిలీనగ ఏ బాక్స్

దగ్గరా, ఒరిజినల్ మనదగ్గరా వుంటాయి. అందువల్ల దొంగతనం ఎప్పటికీ బయటపడదు! తన దగ్గర వున్నది నకిలీదని నాలుగు జన్మలెత్తినా నీ బాస్ తెలుసుకోలేడు!"

శంకర్ పథకం నాకు నచ్చింది.

దొంగతనం బయటపడే అవకాశంలేదు.

బాస్ నకిలీ నగ అమ్మకానికి పెడితే తప్ప యిలాంటి ప్రమాదం లేదు. భార్య స్మృతికి చిహ్నంగా దాచుకున్న ఆ నగ బాస్ ఎన్నడూ అమ్మడు! అలాంటి ప్రయత్నం కల్లోకూడా చెయ్యడు!

ఇక — నేను చేసిన వెధవ పనులకి పనువు దక్కడమే గాక, సుమారు మూడులక్షల ప్రతిఫలం చేతికి చిక్కబోతోంది!

## 2

మేం దొంగలం. అయితే దొరల్లాగా కారుదిగి సిగరెట్స్ వెలిగించుకున్నాం. వీధి చీకటిగా, నిర్మానుష్యంగా వుంది.

శంకర్ కార్లోంచి పొడవాటి తాడు తీశాడు. పెరటి గోడ పదడుగుల ఎత్తువుంది. పెరట్లోవున్న వేపచెట్టు కొమ్మలు బయటికొచ్చాయి. వాటిని చూసి శంకర్ తాడుచివర వుచ్చులావేసి పైకెగరేశాడు. వుచ్చు కొమ్మలో పడింది. శంకర్ నవ్వుకుని తాడుపట్టుకుని పైకి ఎగబ్రాకసాగాడు.

నాకంతా అయోమయంగా వుంది. నేను నిజంగా దొంగగా మారిపోయాను. ఈ సారి నిజంగా దొంగతనం చేస్తున్నాను.

శంకర్ గోడ చేరుకుని చెట్టెక్కాడు. ఆ తర్వాత

లోన పెరట్లోకి దిగాడు. కాచుకున్నాను. కాస్సేపయ్యాక తలుపు తెరుచుకుంది. నన్ను చూచి సైగ చేశాడు. లోని కెళ్లాను.

ఇద్దరం చకచక చీకటిలో బంగళా కేసి నడిచాం. వెనక వరండా చేరుకుని వంటమనిషి గది దగ్గర ఆగాం. గురకలు వినిపిస్తున్నాయి. గాఢనిద్రలో వుంది. ఆమె వంటరిగా బంగళాలో ఎలా వుంటుందో వూహించలేక పోయాను.

కిచెన్ తలుపు తెరిస్తే, మేం ఇంట్లో హాల్లోకి, ఆ తర్వాత బాస్ బెడ్‌రూంలోకి ప్రవేశించవచ్చు. మారు తాళాలతో ఆ పని సులువు చేశాడు శంకర్. అయిదు నిమిషాల్లో మేం బాస్ బెడ్‌రూంలో వున్నాం.

"ఎక్కడ?" గుసగుసలాడాడు శంకర్.

నేను స్విచ్ నొక్కి లైటు వెలిగించాను. ఫ్లోరసెంట్ కాంతి గదిని ఆక్రమించుకుంది. ఆ వెలుగులో పడగ్గది అలంకరణ చూసి నాకు నీరసం వచ్చింది. ఇలాంటి గది రేపు నాకూ వుంటుంది!

శంకర్ గదిలో అటూ ఇటూ చూస్తున్నాడు—ఆల్సేషియన్ కుక్కలా.

నా మనసు ఏదో కీడు శంకిస్తోంది. ఏమిటది?

శంకర్ చెయ్యి చల్లగా నన్ను తాకింది, "ఎక్కడ?"

కర్కశంగావున్న అతని కంఠం విని నేనేం చేశానో నాకే తెలీదు.

ఛటుక్కున వంగి ఖరీదైన కాశ్మీరు తివాసి ఎత్తి చుట్టాను. కింద అతిఖరీదైన షాబాద్ పాలరాతి పలకలు బయటపడ్డాయి....

ఆ పలకల్ని తలుపు దగ్గర నుంచి-మధ్యవరస-లెక్క

బెడుతూ పదమూడవ పలక దగ్గర ఆగాను.

అక్కడ కూచోని జేబులోంచి చిన్నకత్తి తీశాను.

కత్తి అంచుతో పలకచుట్టూ వున్న సందును వెడల్పు చేశాను. ఆ తర్వాత కత్తిని ఆ స్థలంలో వుంచి నెమ్మదిగా వంచాను. పలక కొద్దిగా పైకి లేచింది. మరికొంత వంచాను. ఇంకా లేచింది. ఛటుక్కున పలక పట్టుకుని కత్తి తీసేశాను.

ఆ తర్వాత రెండు చేతులతో పలక తొలగించాను.

లోపల నేలలో స్టీలుతో చేసిన చతురస్రాకారపు పాత్ర కన్పించింది. ఆ పాత్రలో చిన్న పెట్టివుంది. దాన్ని అందుకున్నాను.

శంకర్ దాన్ని తటాలున లాక్కుని, "గ్రాండ్ సక్సెస్!" అనర్చాడు.

పెట్టి విప్పి నగ అందుకుని గర్వంగా నవ్వాడు. లైటు వెలుగులో నగ జిగేలుమంది. వజ్రాలు తళుక్కున మెరిశాయి. నా కళ్ళు చెదిరాయి.

ఆ నగ చూశాక నాలో భయం, ఆ తర్వాత అంతు పట్టని సంతోషం కలిగాయి.

హఠాత్తుగా నీరజ జ్ఞాపకం వచ్చింది....

ఈ క్షణంలో గనుక ఆమె సజీవంగా వుంటే, శంకర్‌ని చంపేసి ఈ నగని ఆమె కంఠంలో అలంకరించే వాడ్ని. కానీ....దురదృష్టం! ఈ భాగ్యానికామె నోచుకో లేదు.

"చూ, కమల్! దీన్ని ఎప్పుడేనా ముట్టుకున్నావా! ఆ అదృష్టం ఎందరికి వుంటుంది!"

శంకర్ మాటలు విని అతన్ని చూశాను. అతని ముఖంలో కోటి సూర్యుళ్ళు వెలిగిపోతున్నాయి .... అతని

చేతిలో నగ చటుక్కున అందుకోబోయాను.... కానీ ఆగిపోయాను.

గది బయట అడుగుల చప్పుడు విన్పించింది.

"ఎవరు?" గుసగుసలాడాడు శంకర్.

నా నోరు పెగల్లేదు. ఇంతలోనే గదిముందు ప్రత్యక్షమైంది ఒక ఆకారం-పనిమనిషి విగ్రహం.

మా ఇద్దరిలో చలనం లేదు. శంకర్ చేతిలో నగ వేలాడుతోంది....

ఆమె దాన్ని చూసింది. నిద్రకళ్ళు తేరుకున్నాయి. ఆ తర్వాత శంకర్‌ని చూసింది. నన్ను చూసింది. ఇద్దర్నీ మార్చిమార్చి చూసింది. క్షణక్షణానికి ఆమె ముఖంలో రంగులు చకచక అదృశ్యమవుతున్నాయి.

నేను మమ్మీలాగా నిలబడిపోయాను.

వంటమనిషి చేతుల్లో ముఖం దాచుకుని కెవ్వుమని అరిచింది. మేం తేరుకునేంతలోనే వెనక్కి తిరిగి మెరుపులా పరుగుతీసింది.

శంకర్ రాకెట్‌లా దూసుకుపోయాడు బయటికి.

బయట అస్తవ్యస్తమైన అడుగుల చప్పుళ్ళు.

ఆ తర్వాత మరోసారి కేక....గట్టిగా మూల్గు.... చివరికి నిశ్శబ్దం.

ఆ నిశ్శబ్దం నా నరాల్ని పిండేసింది.

ఏం జరిగిందో అర్థంకాలేదు. నా ముఖమంతా చెమట పట్టింది. ఎంతసేపు మమ్మీలా నిలబడిపోయానో తెలీదు. "కమల్!" అని శంకర్ అరిచినపుడు నా గుండె పగిలినట్టనిపించింది....

తేరుకుని, తడబడుతున్న అడుగులతో హాల్లోకి నడిచాను.

హాల్లో మసగ్గా దీపం వెలుగుతోంది.

ఆ మసక వెలుతురులో నేలమీద రెండు ఆకారాలు కనిపించాయి, ఒకటి: వెల్లకిలా పడివున్న వంటమనిషి. రెండు: ఆమె పక్కన కూచునివున్న శంకర్.

"ఏం జరిగింది?" అన్నాను గాభరాగా.

"చచ్చిపోయింది" శంకర్ చెప్పాడు.

హఠాత్తుగా నాకు ముచ్చెమటలు పోశాయి. గబగబ నడిచి శంకర్ దగ్గరకి వెళ్ళాను. "ఎందుకు చంపావు?" అన్నాను బలహీనంగా.

శంకర్ చేతులు చూసుకున్నాడు. రక్తంలో తడిసి వున్నాయి, నగతో సహా. వంటమనిషి నోట్లోంచీ, ముక్కుల్లోంచీ రక్తం కారి నేల నాక్రమించుకుంది. ఆ దృశ్యం నా గుండెల్లో అలజడి రేపింది.

"రాస్కెల్! ఆమెనెందుకు చంపావ్?" మళ్ళీ అరిచాను.

"షటప్! ఆమెని చంపకపోతే ఏమవుతుందో తెలుసా? వెర్రిమొహమా, పిచ్చికూతలు కూయక నేను చెప్పినట్టు చెయ్యి!" ఆజ్ఞాపించాడు శంకర్, నగ జేబులో దోపుకుని.

"ఏం చెయ్యాలి? జరిగిందేమిటి? హత్య! మర్డర్!"

"భయపడకు. మనం శవాన్నిక్కడ నించి త్వరగా తీసెయ్యాలి! కమాన్! శవాన్ని కార్లో ఎక్కిస్తాను. నువ్వు యిల్లు శుభ్రం చేసిరా!"

నేను విసురుగా బెడ్‌రూంలోకి వెళ్ళాను. అప్పుడు ఉలిక్కిపడ్డాను. ఆమె కేక గూర్ఖా విన్నాడా? ఆ ఆలోచన నన్ను అదరగొట్టింది. మరుక్షణం కుదుటపడ్డాను. అది అసంభవం. గేటు రెండు ఫర్లాంగుల దూరానవుంది.

ఒకవేళ వినివుంటే వెంటనే వచ్చేవాడు.

సబ్బుబ రాతిపలక శుభ్రం చేశాను, వేలిముద్రలు లేకుండా. తర్వాత దాన్ని యథాస్థానంలో పెట్టి పైన తివాసీ పరిచేశాను. ఆ తర్వాత అటూయిటూ చూశాను. మాకు సంబంధించిన వస్తువులేమీ లేవు.

హాల్లోకి వచ్చి నేలమీద చూశాను. రక్తం వుంది. బాత్‌రూంలోంచి బకెట్ నీళ్లు తెచ్చి గుమ్మరించి, కడిగేశాను. మళ్ళీ ఒకసారి అన్నీ సరిచూసుకొని అప్పుడు తేలిక పడ్డాను.

## 3

నేను బయటికి వచ్చాక శంకర్ శవాన్ని కార్లో పెట్టి తిరిగి వచ్చాడు.

"ఓ.. కే?"

"ఓ.. కే."

"కమాన్." కిచెన్ తలుపుకి తాళం వేసి నా చెయ్యి పట్టుకుని బయటికి నడిచాడు శంకర్. పెరటితలుపు జారగిలవేసి, "శవం కారులో వుంది. త్వరగా పాతిపెట్టాలి. నువ్వూ నాతో రావాలి" అన్నాడు.

ఈమాటలు నన్ను భయపెట్టాయి. ఇద్దరం కారెక్కాం. శంకరే డ్రయివింగ్ సీట్లో కూచున్నాడు. కారు బయలుదేరాక తీవ్రంగా ఆలోచించాను.

ఏమిటిది? ఏం జరిగింది? ఏం జరగబోతోంది? నాకేమీ తోచడంలేదు. కానీ ఒక విషయం గ్రహించాను. నా పరువు రక్షించుకునే ప్రయత్నం ఒకరి ప్రాణాలు తీసింది.

ఏమీ ఆలోచించ కూడదనుకొని గట్టిగా కళ్ళుమూసు

కని సిగరెట్ పీల్చసాగాను. కాస్సేపయ్యాక కారాగింది. కళ్లు తెరిచాను. కొత్తప్రదేశం. సన్నటి ఇరుకువీధి. ఒక ఇంటిముందు ఆగివుంది కారు.

"ఎక్కడికి తెచ్చావు?" అడిగాను.

"నా ఇంటికి" అన్నాడతను.

"ఎందుకు?"

"నువ్వు మాట్లాడకు!" కసిరి కారుదిగాడు. ఆ తరువాత తాళంతీసి ఇంట్లోకెళ్లాడు. వీధి ప్రశాంతంగావుంది. నా కారు డిక్కీలో శవంవుంది. నా గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. ఆమె ఆత్మ నన్ను వూరికే వదిలిపెట్టదు.

శంకర్ తిరిగివచ్చాడు పారా పలుగుతో. అదీగాక మెళ్లో ఫ్లాష్‌గన్ అమర్చివున్న కెమెరా వేలాడుతోంది. గాభరాపడ్డాను.

శంకర్ కారెక్కి డ్రైవింగ్ చేస్తున్నప్పుడు భయపడుతూ అడిగాను, "కెమేరా ఎందుకు?"

"నిన్ను ఫోటోలు తీసేందుకు?"

"ఎందుకు?"

"నీనోరు మూయించేందుకు."

"నా నోరు యిదివరకే మూయించేవు కదా?"

"పరిస్థితి మారింది. ఇప్పుడా ఫోటో పనికిరాదు. కమల్, నువ్వు నేను చెప్పినట్లు చెయ్యాలి. ఈ హత్య నువ్వు చేశావు. ఇప్పుడు శవాన్ని పాతిపెడుతున్నావు. నేను ఫోటోలు తీస్తాను. నిన్నింకా నా గుప్పిట్లో బిగిస్తాను. నా మాటలకి అభ్యంతరం చెప్పావా, ఆ ఫోటో పోలీసుల దగ్గరవుంటుంది. బాగా ఆలోచించు!"

పరిస్థితి అర్థమైంది.

చెయ్యని హత్య నెత్తిన వేసుకోవాలి. లేదా, నా దొంగ వేషం ఫోటో నా పరువు తీస్తుంది. శంకర్ మాటలు అంగీకరించక తప్పదు! అయితే, హత్య బయటపడితే నేను హంతకుడ్ని కానా? ఈ ఆలోచన కలవరపర్చింది.

ఏం చెయ్యాలి? హత్య బయటపడకుండా మార్గమేదేనా వుందా? ఎన్ని మార్గాలున్నా వాటిలో లోపాలు వుంటాయి. నేరం ఏనాటికైనా బయటపడుతుంది. ఈ విషయం అంగీకరించక తప్పదు!

అయితే ఏం చెయ్యాలి?

అప్పుడొచ్చిందొక ఆలోచన.

హత్య బయటబడ్డా నన్ను నిర్దోషిగా నిరూపించే ఆధారం కావాలి. ఆ ఆధారం తట్టడానికి నా కెంతో సేపు పట్టలేదు.

నవ్వుకున్నాను.

శంకర్ని చూశాను. గంభీరంగా డ్రైవ్ చేస్తున్నాడు. తనకి తెలియకుండా నా వల్లో చిక్కుకోబోతున్నాడు!

కారు బంజారాహిల్స్ ప్రాంతాలో చేరుకుంది. శంకర్ కారుని నిర్మానుష్యంగా, విశాలంగావున్న మైదానంలోకి తిప్పాడు. అక్కడ జనసంచారం వుండదు. కారాగాక ఇద్దరం దిగాం.

శంకర్ కెమేరా పట్టుకుని నాతో అన్నాడు, "పారా పలుగూ తీసుకో. త్వరత్వరగా గొయ్యి తవ్వు. కమాన్, క్విక్!"

అలాగే చేశాను. నేను గొయ్యి తవ్వుతుండగా శంకర్ ఏంగిల్ సిద్ధం చేసుకోసాగాడు. కాస్సేపయ్యాక, "రెడీ, స్నాప్ లాగుతున్నాను!" అనర్చాడు.

నేను ఛటుక్కున తలతిప్పి కెమేరావేపు చూశాను. నా ఆలోచన ఆచరణలో పెట్టాను. గొయ్యి తవ్వుతూ, చిన్నగా నవ్వుతూ కెమెరావేపు చూడసాగాను. కెమేరా క్లిక్‌మంది. జిగేలుమని మెరుపు మెరిసింది. ఛటుక్కున తల వంచుకుని గబగబ తవ్వసాగాను.

ఆ తర్వాత రెండుమూడు స్నాప్స్‌కి కూడా అలాగే పోజులు పెట్టాను.

చివరికి—

శవాన్ని గోతిలో చేరుస్తున్నప్పుడు కూడా అలాగే చేశాను.

కానీ, కొన్ని స్నాప్స్‌కి మాత్రం సీరియస్‌గా పోజు పెట్టాను.

మొత్తం ఎనిమిది స్నాప్స్.

# 4

మర్నాడుదయం ఆఫీసులో తీవ్రంగా ఆలోచించసాగాను.

రాత్రి జరిగిన సంఘటన నన్నేమీ ఆందోళనకి గురి చెయ్యలేదు. ఇలాటి పరిస్థితిలో ఆందోళన చెందడంకంటే ఆలోచనలతో కాలం గడపడం మంచిదని గ్రహించాను.

వంటమనిషి హత్యచెయ్యబడింది—ఇప్పుడు కొన్ని సమస్యలు ఏర్పడ్డాయి. హత్య బయటపడనంతవరకు నేను క్షేమంగా వుంటాను. ఇది అందరి హంతకులకీ వర్తిస్తుంది. బయటపడితే ఏమవుతుంది? పోలీసులు దర్యాప్తు చేస్తారు. అయితే నేనుగానీ, శంకర్‌గానీ పట్టుబడే అవకాశాలు కన్పించడంలేదు: ఎక్కడా ఆధారాలు వదిలిపెట్టలేదు.

ఇక—శంకర్ ఆ ఫోటోల సహాయంతో నన్నేమీ

చెయ్యలేడు. ఆ ఫోటోలు హత్యానేరం నా మీద మోపవు. ఇది గ్యారంటీ! శంకర్‌తో నేను జాగ్రత్తగా వ్యవహరిస్తే—ఒకవేళ ఈ వ్యవహారం బెడిసికొడితే—ఈ చిక్కుల్లోంచి నేను బయటపడ్డమేగాక, శంకర్ మెడకి హత్య చుట్టుకుంటుంది.

అయితే నా లాజిక్ శంకర్ తెలివితేటల మీద ఆధారపడివుంది. ఒకవేళ అతను ఫోటోల్లో వీక్ పాయింట్ కనిపెడితే కథ కంచికి, నేను జైలుకి.

రేపు నా బాస్ వచ్చేస్తాడు. వంటమనిషి యింట్లో వుండదు గనుక ఎక్కడికి వెళ్ళిందని అడుగుతాడు. అందుకు నేను సమాధానం సిద్ధం చేసుకున్నాను.

ఈ రోజు శంకర్ నగ డిజైన్ తయారుచేసి తీసుక వస్తాడు. దాన్ని తిరిగి రహస్యపేటికలో పెట్టేస్తాను. ఆ తర్వాత పదిరోజులు నిశ్చింతంగా గడిచిపోతాయి. పద కొండవరోజున నగలు తారుమారవుతాయి ....మరికొన్ని రోజులు గడిచాక వ్యాపారకందని డబ్బు నా చేతికొస్తుంది. నన్నెలాటి అదృష్టం వరించబోతోంది!

ప్చ! కానీ, ఈ అదృష్టానికి మురిసిపోయేందుకు నీరజ లేదు.

నా కళ్ళు చెమ్మగిల్లాయి. కర్చీఫ్‌తో తుడుచుకుని మంచినీళ్ళు తాగాను.

ఆ రోజు నేను ఆఫీసులో చేసిన పనేమీ లేదు. సాయంత్రం అయిదుగంటలకే కారెక్కి ఇంటికెళ్ళాను.

స్నానం చేసి బట్టలు మార్చుకుని కూచున్నాను.

ఇంతలో తలుపు తెరుచుకుని శంకర్ వచ్చాడు. అతని వాలకం చూస్తే నన్ను కలుసుకునేందుకు ఎంత అస హనంగా గడిపాడో తెలుస్తోంది. లోనికివచ్చి నా ఎదు

రుగా చూచున్నాడు.

నేను కంగారుపడ్డాను. ఇప్పుడతని ముఖంలో రంగులు మారుతున్నాయి.

"ఏం జరిగింది?" అడిగాను ఆందోళన అణుచుకుంటూ.

శంకర్ కర్కశంగా చూశాడు, "చూడు మిస్టర్! నీ దగ్గర తెలివివుంటే వుంచుకో! నా దగ్గర మాత్రం ప్రదర్శించకు! ప్రమాదకరం!"

"నేనేం చేశాను శంకర్!"

"డబుల్ క్రాస్ చేయటానికి ప్రయత్నించావు! నువ్వు పరువుగా బ్రతకదల్చుకున్నావా, లేక అందరిచేత ఛీ ఛీ అనిపించుకుంటావా?"

"శంకర్ నేనేం చేశాను?" భయపడుతూ అడిగాను.

శంకర్ నన్ను అసహ్యంగా, హేళనగా చూసి, జేబులోంచి ఒక కవరు తీశాడు. ఆ కవర్లోంచి ఫోటోలు తీసి నాకిచ్చాడు.

వాటిని చూశాను. అవి ఎనిమిది వున్నాయి. వాటిల్లో అయిదు ఫోటోల్లో నా ముఖం చిరునవ్వులో తొణికిసలాడుతోంది. మిగతా మూడుఫోటోల్లో సీరియస్‌గా వుంది.

"బాగా తీశావు" అన్నాను, ఓరగా చూస్తూ.

"నోర్మూయ్!" అర్చాడతను. "ఏమిటా ఫోజు? నిన్ను నవ్వమన్నానా?"

"చెబితేనే నవ్వాలా! నవ్వొచ్చింది, నవ్వేశాను. ఏమిటి తప్పు?" నేనూ అర్చాను.

శంకర్ వుద్రేకంతో పిడికిలి బిగించాడు.

"రాస్కెల్! నువ్వు ట్రిక్ చేశావు!" మళ్ళీ అర్చాడతను, "ఈ ఫోటోలు పోలీసులు చూస్తే ఏమంటారు?"

"ఏమంటారు?"

"హత్య చేసినవాడు నువ్వేదూ, కావాలని ఫోటో తీయించుకుంటాడా?"

నేను చల్లబడిపోయాను. వీడు వీక్ పాయింట్ కని పెట్టేశాడు! ఇక లాభంలేదు. నా ప్లాన్ బెడిసికొట్టింది.

"అలా అనుకుంటారని నాకు తెలీదు" అన్నాను.

"అలాగే అనుకుంటారు. హత్యకేసు నీ మీద నిలబడదు. నా మెడకి చుట్టుకుంటుంది!"

"అవును. హత్య నేను చెయ్యకపోతే నా మెడకెలా చుట్టుకుంటుంది?"

శంకర్ నన్ను క్రూరంగా చూశాడు. "ఆల్ రైట్ బ్రదర్, ఏమిటి నీ అయిడియా?"

"ఏమీ లేదు" అన్నాను తాపీగా.

"మరి నా ఫోటోలెందుకు చెడగొట్టావు? ఏదైనా సదుద్దేశ్యం వుందా?

"శంకర్! నువ్వు పొరబడుతున్నావు. నాకే ఉద్దేశ్యమూ లేదు. నువ్వు ఫోటోలు తీస్తున్నప్పుడు నీ ప్యాంటుగుండీలు వూడివున్నాయి.... అందుకే నవ్వాను."

శంకర్ ఆశ్చర్యంగా చూశాడు. ఆ తర్వాత అతని ముఖం కందిపోయింది.

"ఆల్ రైట్" అని, ఒక నిశ్చయానికి వచ్చి, ఆ అయిదు ఫోటోల్నీ నెగెటివ్స్‌తో సహా అగ్గిపుల్ల గీసి తగలబెట్టాడు.

"అవి పనికిరావు. ఈ మూడు ఫోటోలు చాలు. వీటిలో నీ ముఖభావాలు చాలా బాగున్నాయి. పనికి వస్తాయి."

శంకర్ మాటలు విని నా తల తిరిగింది.

నా ఎత్తు పారలేదు!

ఈ మూడు ఫోటోల్నీ కూడా నేనెందుకు చెడగొట్ట లేదు? ఆలోచించాను. మొత్తం ఫోటోలు చెడగొడితే పరిణామం ఎలా వుంటుందో వూహించాను. గుండె అదిరింది. అప్పుడు శంకర్ పూర్తిగా రెచ్చిపోయి నా 'దొంగవేషం' ఫోటో బట్టబయలు చేసేవాడేమో!

టీపాయ్ మీద ఫోటోలందుకుని చూశాను.

మొదటిఫోటోలో గొయ్యి తవ్వుతున్నాను. రెండవ ఫోటోలో వంటమనిషిని ఎత్తుకుని నడుస్తున్నాను. మూడవ ఫోటోలో ఆమె శవాన్ని గోతిలో పడుకోబెట్టి మట్టి కప్పుతున్నాను.

ఫోటోల్ని ఒకటికి పదిసార్లు జాగ్రత్తగా గమనించాను. లాభంలేదు. నన్ను నిర్దోషిగా నిరూపించే ఆధారాలులేవు.

ఈ ఫోటోలు నన్ను తప్పకుండా హంతకుడ్ని చేస్తాయి!

పెదవులు చప్పరించి నిస్పృహగా శంకర్ని చూశాను.

"ఈ ఫోటోలు నీ దగ్గర ఎప్పటివరకుంటాయి?"

"నగ అమ్మేవరకు. మనం వాటాలు పంచుకునేవరకు."

"ఆ తర్వాత నాకిచ్చేస్తావా నెగెటివ్స్‌తో సహా?"

"అది పరిస్థితుల పైన ఆధారపడి వుంటుంది."

"సరే, నగ నేం చేశావు?"

"తెచ్చాను." జేబులోంచి ప్లాస్టిక్ కవరు తీసి చూపించాడు.

"డిజైన్ తయారైందా?"

"అయింది. పదిరోజుల్లో నగ తయారవుతుంది."

నాకు వెంటనే మరో విషయం జ్ఞాపకం వచ్చింది.

"మంచిది శంకర్. నేనిప్పుడు పూర్తిగా నీ చెప్పు చేతల్లో వున్నాను. హత్య విషయం ప్రాణాలుపోయినా

వెల్లడిచెయ్యను. నువ్వనవసరంగా భయపడి బ్లాక్ మెయిల్లో ఇరుక్కున్నావు. నీవల్ల నా కెంతో ప్రయోజనం చేకూరుతుంది. మూడులక్షలు! నిన్నెందుకు మోసం చేస్తాననుకున్నావు? ఈ డర్టీ బిజినెస్‌లో మనిద్దరం భాగస్తులం కదా?"

"అవును!"

"మరి నేను ఖమ్మంలో తీయించుకున్న ఫోటోమాట ఏమిటి?"

చిన్నగా నవ్వాడతను. "నీ అయిడియా అర్థమైంది." అని జేబులోంచి మరో కవరుతీసి నా కిచ్చాడు:

"ఇదిగో, నీ పరువుకి సంబంధించిన ఫోటోలు. ఇవి నా కవసరంలేదు. నాదగ్గర నీ ప్రాణాలకి సంబంధించిన ఫోటోలున్నాయి. అవసరానికిమించి నేనేదీ వుంచుకోను. ఆ ఫోటోల్నీ, నెగటివ్‌నీ నాశనం చేసేయ్!"

నా రక్తం వురకలు వేసింది.

కవరులోంచి రెండుఫోటోలు, నెగటివ్ తీసిచూశాను. తేలిగ్గా వూపిరి వదిలాను.

"థాంక్స్ శంకర్! నా పరువు రక్షించావు!"

"నో మెన్షన్. పరువు దక్కించుకోబోయి పీకల మీదికి తెచ్చుకున్నావని గుర్తుంచుకో. ఆల్ రైట్, మన తర్వాత కార్యక్రమం ఏమిటి?"

"నగ తిరిగి యథాస్థానంలో పెట్టాలి."

"అవును. రాత్రి పన్నెండుకి వెళ్దాం. అన్నట్టు బాస్‌కి వంట మనిషిగురించి ఏం చెప్తావు?"

ఏం చెప్తానో చెప్పాను.

మెచ్చుకోలుగా నా భుజం తట్టాడు.

శంకర్ వెళ్ళిపోయాక నా నైతిక పతనానికి కారణ

మైన ఫోటోలన్నీ పొయ్యిలో పడేసి కసికొద్దీ కాఫీకాచు
కుని తాగాను.

# 5

మర్నాడు ఆదివారం ఉదయం నేనాలస్యంగా నిద్ర లేచి గడిచిన రాత్రి నెమరువేసుకున్నాను:

రాత్రి మేం ఎప్పటిలాగే బాస్ యింట్లో ప్రవేశించాం. అన్ని జాగ్రత్తలు తీసుకుని నగ యథాస్థానంలో పెట్టేశాము. మేం బెడ్‌రూంలో ప్రవేశించేముందు గుండెలదిరే సంఘటన ఒకటి జరిగింది. కిచెన్‌లో ఏదో గిన్నె దొర్లిన శబ్దం విన్పించి మా గుండెలాగిపోయాయి. గాభరాగా వెళ్ళిచూస్తే ఏముంది, ఏమీ లేదు. బయట ఎక్కడినించో 'మ్యావ్!' అంటూ పిల్లి వెక్కిరించింది!

మేం నవ్వుకుని తిరిగి వచ్చేశాం. ఆ తర్వాత మేము చేసిన పొరపాట్లు ఒక్కొక్కటి బయటపడ సాగాయి. వంటమనిషి గదికి తాళం వేసి లేదు. ఆమె దుస్తులుకూడా గదిలోనే వున్నాయి. ఈ విషయాలు నేను బాస్‌కి ఆమె గురించిచెప్పే సంజాయిషీతో రాజీపడవు.

వెంటనే ఈ పొరపాట్లు సవరించాం. ఆ తర్వాత మరో పొరపాటు - పెరటితలుపు లోపలినుంచి గడియ పెట్టలేదు. ఇలాంటి పొరపాట్లన్నీ జాగ్రత్తగా సరిదిద్దుకుని తిరిగివచ్చాం.

తిరిగి నాబాస్ గృహప్రవేశం పదకొండో రోజున నకిలీ నగతో.

స్నానం ముగించుకుని వచ్చేసరికి తొమ్మిదయింది. కడుపులో మండుతోంటే హోటల్‌కి వెళ్లేందుకు సిద్ధమవుతున్నాను. ఇంతలో ఫోను మోగింది....

ఆలోచించకుండా రిసీవరెత్తాను.

"కమల్! మైబాయ్, ఎలాగున్నావ్?"

అవతలినుంచి నా బాస్ కంఠం నా శరీరంలో విద్యుత్ లా ప్రవహించింది.

తిరిగి బాస్ అరిచేవరకు నాలో చలనంలేదు.

"ఎవరవతల? కమల్....?"

"ఎస్ బాస్! గుడ్ మార్నింగ్! ఎప్పుడొచ్చారు?"

"ఇందాకే నేను దిగాను. ఇప్పుడింట్లోవున్నాను."

నా గుండెలదిరాయి.

"కమల్! ఎలావున్నావ్? కులాసేనా?"

"బాగానే వున్నాను బాస్! నా ఆరోగ్యం చక్కబడిందిప్పుడు!"

"వెరీగుడ్! నువ్వు కుర్రాడివి! కోలుకుంటావు?"

నేను మాట్లాడలేదు. ఆలోచిస్తున్నాను.

"కమల్!" మళ్ళీ అరిచాడు బాస్, "రంభ ఎక్కడ వుంది?"

రంభ వంటమనిషి పేరు. ఆమె మొన్నరాత్రి చనిపోయింది.

అసలు వ్యవహారం ఇప్పుడు ప్రారంభమైంది!

రిసీవర్ గట్టిగా పట్టుకుని, తడబాటు లేకుండా ప్రశాంతంగా అన్నాను:

"రంభ నిన్న మైసూర్ వెళ్ళింది బాస్."

"మైసూర్? ఎందుకు?"

"తమ్ముడి ఆరోగ్యం బాగోలేదని టెలిగ్రాం వచ్చింది"

"తమ్ముడా? వాడిక్కడే వున్నాడు కదా?"

బాస్ మాటలు నాకర్థం కాలేదు.

"వాడు మైసూర్ లో వున్నాడు బాస్" అరిచాను.

"నువ్వే లోకంలో లేవు బాయ్! పది రోజుల క్రితం వాడిక్కడికి వచ్చేశాడు. ఏదో ఫ్యాక్టరీలో పనిచేస్తున్నాడు. నీకు తెలీదా?"

నాకు ముచ్చెమటలు పోశాయి. ఇది నిజమా?

"మరి ఆమె అలా ఎందుకు చెప్పింది? టెలిగ్రాం కూడా చూపించింది. బాస్, నిన్న సాయంత్రం ఆమె మైసూర్ కెళ్ళింది....తమ్ముడి ఆరోగ్యం బాగాలేదని అంది."

"షటప్!" కసిరాడు బాస్, "నువ్వు ఫూల్‌వి; తమ్ముడిక్కడే వున్నాడు. నాకు తెలుసు. రంభ చెప్పింది. మైసూర్ నించి పదిరోజుల క్రితం వచ్చేశాడని!"

"మరి టెలిగ్రాం?" అడిగాను తికమకగా. వ్యవహారం బెడిసి కొట్టిందని నాకు తెలుసు. రంభ తమ్ముడిక్కడే వున్నాడని నాకు తెలీదు! నేననుకున్న దిప్పుడు తలకిందు లయింది!

"నిజంగా ఆమె టెలిగ్రాం చూపించిందా?"

"అవును."

"సరే, ఆమె తమ్ముణ్ణి పిలిపించి సంగతేమిటో తెల్సుకుంటాను. నువ్వేమీ ఆలోచించి బుర్ర పాడుచేసుకోకు! ఈరోజు ఆదివారం. రెస్టుతీసుకో. మళ్ళీ ఖమ్మం వెళ్ళే ఆలోచన వుందా?"

నా మనసు వురకలు వేసింది. ఖమ్మం! మళ్ళీ అక్కడికెళ్ళాలా!

"ఆలోచిస్తాను బాస్" అన్నాను. లైన్ కట్టయింది.

నాకేమీ అంతుబట్టలేదు! నా వూహాలన్నీ వరసగా తల్లకిందులవుతున్నాయి. ఇప్పుడు బాస్‌కి రంభమీద అనుమానం వస్తుంది! అదేమిటో అతనికే తెలియదు, ఆమె

అదృశ్యంలోని ఆంతర్యం అతను తెలుసుకుంటాడా? ఐతే అప్పు డేమవుతుంది?

జరగబోయే సంఘటనలకోసం ఎదురుచూడ్డం తప్ప, వాటిని పసిగట్టి ఎలాటి జాగ్రత్తలూ తీసుకునే స్థితిలో నేను లేను.

పది నిమిషాలతర్వాత మళ్ళీ ఫోను మోగింది.

సందేహించాను—రెస్పాన్స్ ఇవ్వాలా? పారిపో వాలా?

పారిపోవడం పిరికితనం. ప్రస్తుతం నేను పరిస్థితుల్ని జాగ్రత్తగా గమనించాలి. ఒక్క తప్పటడుగు వేశానా సర్వనాశనం తప్పదు!

గుండెలనిండా గాలిపీల్చి రిసీవర్ ఎత్తాను.

బాస్ అర్చాడు: "కమల్, కమ్‌క్విక్!"

గాభరాపడ్డాను. "ఎందుకు? ఏం జరిగింది?"

"దారుణం! ఘోరం! హే భగవాన్!"

"బాస్, ఏం జరిగింది?"

"ఎలా....ఎలా .... చెప్పాలి! వెంట నేరా! క్విక్!"

ఈ మాటలతో అవతల క్లిక్ మంది.

నాబాస్ షాక్ ట్రీట్‌మెంట్ నాప్రాణాలు తోడేసింది. ఎందుకలా గొంతుచించుకుని అర్చాడు? ఏం జరిగింది? ఏమిటా దారుణం? ఏమిటా ఘోరం?

నేనేదేనా పొరపాటు చేశానా—రంభ హత్య విషయంలో?

అయిపోయింది! నేనింకెంత కాలమూ దాగుడుమూత లాడలేను! నాదారి పొడుగునా ముళ్ళే కనిపిస్తున్నాయి!

పదినిమిషాల్లో బాస్ బంగళా చేరుకున్నాను. బాస్ అంబోతులా పరిగెత్తివచ్చి నన్ను కౌగిలించుకున్నంత పనిచేశాడు,

"ప్లీస్ బాస్! బి క్వయిట్! రిలాక్స్!"

నా బాస్ ముఖం టమాటాలా ఎర్రగా కందిపోయింది. నాలో సన్నగా వణకు ప్రారంభమయింది. కాస్సేపటి తర్వాత సృహ కోల్పోయినట్టు ఫీలయ్యాను. అలాటి సితిలో బాస్ నన్ను బెడ్‌రూంలో లాక్కెళ్ళాడు. బెడ్ రూం చిందరవందరగావుంది. నేలమీద తివాసీ చుట్టేసివుంది. తివాసికింద, పదగూడవ రాతిపలక తొలగించివుంది. లోపల స్టీల్ పాత్ర తెల్లగా మెరుస్తోంది.

అయితే అందులో నగల పెట్టె లేదు.

# 6

టిక్-టిక్-టిక్-టిక్....గోడగడియారం శబ్దం తప్ప అంతటా దారుణమైన నిశ్శబ్దం. కొన్ని పరిసితుల్లో నిశ్శబ్దం భరింపరానిదిగా, నరాల్ని పిండేస్తూ, మానసికంగా చిత్రవధ చేస్తుంది.

ప్రస్తుత పరిసితి అలాటిదే.

మధ్యలో రహస్య పేటిక—ఎదురెదురుగా నేనూ నా బాస్. మా ఇద్దరిచూపులూ కలిశాయి: తీక్షణమయిన చూపులు. ఆ చూపుల్లో ఆకర్షణలేదు, వికర్షణలేదు—ఎలాటి బంధమూలేదు—కానీ ఏదో శక్తివుంది.

హఠాత్తుగా నిశ్శబ్దాన్ని పటాపంచలు చేస్తూ గడియారం గంటలు కొట్టసాగింది, పదిగంటలు.

చూపుల్లో మా ఇద్దర్ని బంధించేసిన నిర్వచించలేని శక్తి ఏదో ఆ గంటలకి వీగిపోయింది.

ఆ అవసనుంచి తేరుకున్నాక నాగొంతు తడారిపోయి మాటలు పెగల్లేదు.

"మాశావా? ఈ దారుణం చూశావా? నా ప్రాణ

పదంగా చూసుకునే వజ్రాలహారమెక్కడ?" అర్చాడు బాస్.

నా స్థితి వర్ణించలేనంత హీనంగా వుంది. నా చూపులు పదేపదే నేలలో పాతేసిన పాత్రను చూస్తున్నాయి. ఎక్కడ? నగ ఎక్కడ? నేను చేస్తున్న పాపకార్యాలకి ప్రతిఫలంగా అంధత్వం రాలేదనుకుంటే, పాత్రలో నగ లేదు. ముమ్మాటికీ లేదు!

ఏం జరిగిందో బోధపడ్డాక నా వెన్నులో యెవరో పొడిచినట్టు గావుకేక పెట్టాను.

శంకర్!

గుంటనక్క! వెన్నుపోటు పొడిచాడు. నన్ను వూహించని విధంగా మోసం చేశాడు! నగ కాజేసి నన్ను ఇరికించాడు!

నేను పళ్లునూరడం చూసి బాస్ నన్ను పట్టుకున్నాడు.

"డామిట్! అప్ సెట్ అవకు! ఈపని ఎవరు చేశారో నాకు తెలుసు! కమల్! రంభ టెలిగ్రాం హంబక్! అది దొంగ! మోసకత్తె! ఈ నెక్లెస్ కాజేసి పారిపోయింది."

బాస్ మాటలు నన్నాశ్చర్య పర్చాయి.

"ఈ అనుమానం మీకెందుకొచ్చింది బాస్? ఎక్కడ వుందో మీకూ నాకే తెలుసు" కుదుటపడుతూ అడిగాను.

బాస్ చూపులు నా మీదపడ్డాయి. అనుమానపు చూపులు!

నా మాటల్లో అతనికెలాంటి అర్థం స్ఫురించిందో అంతుబట్టలేదు.

"అవును—నీకూ నాకే తెలుసు" బాస్ అన్నాడు నిశ్చయంగా, "అయితే దానికెలా తెలిసింది?"

"ఈపని ఆమె చేసిందని ఎందుకనుకుంటున్నారు?"

నేను వేస్తున్న ప్రశ్నలు నన్నే చిక్కుల్లో ఇరికిస్తాయని తెలిసినా, ఇది తప్పనిసరి పరిస్థితి. ఇలాటి తప్పనిసరి పరిస్థితి శంకర్ లాటి నీచుడికయినా వద్దు!

బాస్ నిట్టూర్చాడు, "అది విధవ. ఆయిదేళ్ళుగా పనిచేస్తోంది. ఈ ఇంట్లో ఎక్కడేముందో దానికి యెలా తెలియకుండా వుంటుంది? నా దగ్గర నగ వుందని అందరికీ తెలిసినట్టే దానికీ తెలుసు. దానికోసం యెప్పటినుంచి ప్రయత్నిస్తుందో ఎవరికి తెలుసు? చివరికి నగ యెక్కడ వుందో తెలుసుకుని, నేను వూళ్ళోలేని సమయంలో కాజేసి చెక్కేసింది. కమల్ — ఇప్పుడు చెయ్యవలసింది పోలీసులను పిలవడం. వెంటనే ఫోన్ చెయ్!"

స్థాణువైపోయాను. పోలీసులు! రంగప్రవేశం చేస్తున్నారు.

"పూర్ బాయ్! పూర్తిగా అప్ సెట్ అయ్యావు!" కసురుకుని ఫోనెత్తాడు బాస్!

"హల్లో కమీషనర్!" ఫోన్లో పిలుస్తున్నాడు బాస్, "సేఠ్ రంగూన్ వాలా స్పీకింగ్. నా బంగళాలో దొంగతనం జరిగింది.... అవును. దొంగతనం — నెక్లెస్. యస్, టెన్ లాక్స్.... దటీజ్ రైట్ మిస్టర్ దేవరాజ్, కమ్ క్విక్!"

బాస్ ఫోను పెట్టేశాడు.

కమీషనర్ దేవరాజ్! ఈ సిటీకి సింహస్వప్నం! ఎలాటి కేసుల్ని ఎంత చాకచక్యంగా పరిష్కరించాడో పత్రికల్లో చదివాను.

ఇప్పుడు నా కేసు!

నాకు ఏడుపు ముంచుకువచ్చింది.

నా ఈ దుర్దశకు కారకులెవరు? ప్రతి ఒక్కరూ కార

కలే—డాక్టర్, జాని, శంకర్, నా బాస్....చివరకి నీరజకూడా!

కానీ, ఆ రోజు ఖమ్మంలో నేను మాధవి సలహా పాటిస్తే ఈగతి ఎందుకు పట్టేది?

బాస్ సిగార్ పీలుస్తూ పచార్లు చేస్తున్నాడు.

నేను తేరుకుని, దుఃఖం అపుకుని అడిగాను "అసలు రంభ నగ కాజేసివుంటుందన్న అనుమానం మీకెలా వచ్చింది?"

బాస్ నన్ను చూశాడు, "దాని తమ్ముడితో మాట్లాడాను. వాళ్ళిద్దరు పోట్లాడుకుని నాలుగురోజులయిందట. మాటల్లేవు. ఆమె గురించి తనకేమీ తెలియదని చెప్పాడు. ఎక్కడికెళ్ళిందో కూడా తెలియదన్నాడు. అది దొంగ టెలిగ్రాం సృష్టించి, ఇక్కడేవున్న తమ్ముడిని మైసూర్‌లో వున్నట్టు నీతో ఎందుకు చెప్పిందో గ్రహించాను. అదేదో దురుద్దేశ్యంతోనే ఈ పని చేసివుండాలని వూహించాను. వెంటనే నెక్లేసు జ్ఞాపకం వచ్చింది. అదుర్దాగా నెక్లేసు కోసం చూశాను—ఇందులో లేదు!"

బాస్ మాటలు తాత్కాలికంగా నన్ను ఉత్తేజపరిచాయి.

"అవును బాస్. ఆమే చేసిందీ పని! ఆఫీసులో నన్ను కలుసుకున్నప్పుడు చాలా గాభరాగా కనపడింది. చేతిలో ట్రంకుపెట్టె వుంది. ఆమె తలమీద ధూళివుంది-బహుశ ఈ కార్పెట్‌దనుకుంటాను. కానీ, బాస్, ఆమె తమ్ముడు ఇక్కడే వున్నాడని నాకు తెలిస్తే ఆమె దొరికిపోయేది!" అన్నాను వుత్సాహంగా.

బయట కారాగిన శబ్దం వినిపించింది.

చటుక్కున కిటికీలోంచి తొంగిచూశాను.

పోలీస్—కారుమీది అక్షరాలు స్పష్టంగా కన్పిస్తున్నాయి.

కార్లోంచి ముగ్గురు దిగారు—అసిస్టెంట్ కమీషనర్ దేవరాజ్, ఇద్దరు డిటెక్టివ్ ఇన్స్పెక్టర్లు: శివనేశన్, డేవిడ్.

నా గుండె దడదడలాడింది.

ఈ ఇన్స్పెక్టర్లు కొమ్ములు తిరిగిన నేర పరిశోధకులు. దేవరాజ్ కేమాత్రం తీసిపోరు.

బాస్ గబగబ బయటికెళ్ళి వాళ్ళని రిసీవ్ చేసుకున్నాడు.

నేను శంకర్ గురించి ఆలోచించాను: ఈ రాస్కెల్ సిటీలో వున్నాడా? వెంటనే ఈ విషయం తెలుసుకోవాలి. కానీ త్వరపడవద్దు! నా మీద ఎవరికెలాంటి అనుమానమూ రాకూడదు. అప్పుడు శంకర్ పనిపట్టాలి!

వాళ్ళంతా గదిలోకొచ్చేశారు.

# 7

ఆ ముగ్గురు అధికారులతో నేను కరచాలనం చేశాను.

ఆ తర్వాత బాస్ కొన్ని నిమిషాలు గడగడ వాగాడు. అధికారులు తల పంకిస్తూ శ్రద్ధగా విన్నారు. మధ్యమధ్య వాళ్ళ చూపులు నా మీద పడుతున్నాయి. సాధ్యమయినంతవరకు నేను సహజంగా కన్పించడానికి ప్రయత్నిస్తున్నా, శంకర్ గురించి ఆలోచనలు నా తల తినేస్తున్నాయి.

బాస్ పరిస్థితి వివరించి చెప్పాక ఇన్స్పెక్టర్స్ కదిలారు. గదిలో గాలింపు ప్రారంభించారు. ఎక్కడా

ఆధారాలు లేవని నాకు తెలుసు. శివనేశన్ టెలిఫోన్‌లో కాస్సేపెవరితోనో మాట్లాడాడు—అతని మాటల్ని బట్టి తెలుసుకున్నాను, రకరకాల నిపుణులు వస్తున్నారని.

ఉన్నట్టుండి ఉలిక్కిపడ్డాను.

ఆ రాతిపలక మీద శంకర్ వేలిముద్రలున్నాయా?

అయితే మా నాటకం ముగిసినట్టే.

ఏ. సి. దేవరాజ్ నా దగ్గరికి వచ్చి అడిగాడు, "రంభ మిమ్మల్ని ఎన్ని గంటలకి కలుసుకుంది?"

"ఆరు గంటలికి" అనాలోచితంగా అనేశాను.

"టెలిగ్రాంని పరిశీలించారా?"

"మెసేజ్ చదివాను."

"ఎక్కడ బుక్ అయిందో చూశారా?"

"లేదు."

"అప్పుడామె మాటలెలా వున్నాయి?"

"గాభరాగా మాట్లాడింది."

"ముఖం ఎలా వుంది?"

"ఆందోళనగా వుంది. జుత్తు రేగిపోయివుంది. తల మీద ధూళి వుంది. సర్, టెలిగ్రాం అందగానే ఆమె ఉన్నపళంగా బయలుదేరినట్టుంది...."

"అలాగా? లుక్, మిస్టర్. టెలిగ్రాం ఏ అడ్రసుకి వచ్చింది.

నా వొళ్ళు చల్లబడింది, "నాకు తెలీదు!" అన్నాను.

"ఈ బంగళా అడ్రసుకే రావాలి. అవునా?"

"అ....అవును."

"వెరీగుడ్. మిస్టర్ దేవిడ్, గేటుముందు గూర్ఖా వున్నాడు. పిలవండి."

డేవిడ్ తలూపి బయటికెళ్ళాడు.

దేవరాజ్ సిగరెట్ వెల్గించి నా వేపు తిరిగాడు.

"అయితే, ఆమె తలమీద ధూళి వుందా?"

"అవును సర్."

"ఎలాంటి ధూళి?"

"మె త్తటిధూళి—బహుశా ఈ తివాసీది కావచ్చు."

"వెల్, వెల్. లుక్ మిస్టర్. నగ ఎక్కడవుందో మీకూ బాస్‌కూ మాత్రమే తెలుసు. మరి ఆమెకెలా తెలిసింది?"

"నాకు తెలియదు సర్."

దేవరాజ్ అనుమానంగాచూస్తూ అన్నాడు, "ఐసీ."

డేవిడ్ గూర్ఖాని వెంటబెట్టుకొని వచ్చాడు.

దేవరాజ్ హిందీలో ప్రశ్నించాడు.

"నిన్న సాయంత్రం ఆరుగంటలకి నువ్వెక్కడ వున్నావ్?"

"ఇక్కడ లేనుసాబ్. అయిదుగంటలకి రంభకిచెప్పి వెళ్ళాను."

"ఎక్కడికి?"

"బజారుకి."

"ఎప్పుడొచ్చావు?"

"చీకటిపడింది సాబ్....ఏడు గంటలకి."

"బజారుకెందు కెళ్ళావు?"

"పెళ్ళిబట్టలు ఖరీదు చేసేందుకు."

"ఎవరి పెళ్ళి?"

"నా కూతురు పెళ్ళి."

"నువ్వు చెప్పేది నిజమేనా?"

"మీరు కనుక్కోవచ్చు సాబ్."

"సరే వెళ్ళు!"

నాకాశ్చర్యం వేసింది. ఆ సాయంత్రం గూర్ఖా ఇక్కడే వుంటే నా కథనం బూటకమయ్యేది!

"ఆల్ రైట్, టెలిగ్రాం మిస్టరీ మెసంజర్ వల్ల తేలుతుంది. మిస్టర్ డేవిడ్, ఈ జాబ్ మీరుతీసుకోండి." దేవరాజ్ బాస్ వేపు తిరిగి మళ్ళీ అన్నాడు. "మిస్టర్ రంగూన్ వాలా, నెక్లెస్ ఇన్సూర్ చేయించలేదా?"

బాస్ తలూపాడు.

"వెంటనే క్లెయిమ్ చెయ్యండి!" దేవరాజ్ అన్నాడు "పరారీలోవున్న రంభకోసం మేం గాలిస్తాం."

ఆ తర్వాత దేవరాజ్ నా వేపు తిరిగి మళ్ళీ అన్నాడు: "ఆమె మైసూర్ యెలా వెళ్ళింది? బస్సులోనా? ట్రెనులోనా?"

"సర్-ఎలా వెళ్లిందో తెలీదు. ఇప్పటి పరిస్థితినిబట్టి చూస్తే ఆమె మైసూర్ వెళ్ళలేదనిపిస్తుంది."

"అవునవును!" దేవరాజ్ వెంటనే అన్నాడు, "ఆమె తమ్ముడిక్కడే వున్నాడు. అతన్ని మేం ఇంటరాగేట్ చేస్తాం. వెల్, మరోప్రశ్న!"

నేను కోపంగా చూశాను దేవరాజ్ ని. ఏ ప్రశ్న యెలా ముంచుతుందో తెలీదు!

"అడగండి" అన్నాను.

అనుమానంగా చూశాడతను, "ఆమె చాలా గాభరాగా వచ్చిందని మీరన్నారు. అంతదూరం ఆ కంగారులో ఆఫీసుకు రావలసిన అవసరమేమిటి? ఇక్కడి నుంచి ఫోన్ చెయ్యవచ్చుకదా?"

నేను షాక్ తిన్నాను. దేవరాజ్ ప్రశ్నకి కాదు! రాబోయే ప్రమాదాన్ని పసిగట్టి. ఈ ఆలోచన నాకు

తట్టకపోతే ఈ వవ్యహారంలో నేను అనుమానితుడయ్యే వాడ్ని!

కంగుటపడి అన్నాను, "ఆమె ఇంటినుంచి ఫోన్ చెయ్యవచ్చుసర్. కానీ, బంగళా తాళాలు నాకందించాలి కదా? అందుకే వచ్చింది."

"తాళంచెవులు మీకిచ్చిందా?"

"అవును."

"ఎక్కడ వున్నాయి?"

"ఆఫీసులో" నా అబద్ధాలతో నాకే నీరసం వస్తోంది.

"మరి బాస్ ఇంట్లోకెలా వచ్చారు?"

"నా దగ్గర మరో సెట్ వుంది" అన్నాడు బాస్. "కమీషనర్! ప్లీజ్....ఇంకా నా సెక్రటరీని ప్రశ్నిస్తూ అప్ సెట్ చెయ్యకండి! అతనింకా మానసికంగా కోలుకోలేదు."

"మంచిది" అన్నాడు దేవరాజ్.

శివనేశన్ లోపలినుంచి వచ్చాడు: "రంభగది గాలించాను. పనికివచ్చే ఆధారాలు లేవు."

ఇంతలో బయట జీపు ఆగింది. పోలీసు సిబ్బంది బెడ్ రూంలో జొరబడి ఫోటోలూ, వేలిముద్రలూ తీశారు.

రాతిపలక మీదా, స్టీలుపాత్రలో శంకర్ వేలిముద్రలు తప్పకుండా వుంటాయని నాకు తెలుసు. ఇప్పుడేం చెయ్యాలో నాకేమీ తట్టలేదు. దేవరాజ్ మళ్ళీ నన్ను ప్రశ్నించలేదు. కానీ అతని కళ్ళు మాత్రం నన్ను అనుమానంగా చూస్తున్నాయి.

చివరికి—వాళ్ళంతా వెళ్లిపోయాక బాస్ నా భుజం తట్టాడు. "కంగారు పడకు! ఆ నగ నీది కాదు, తెలుసా?"

నేను ఉలిక్కిపడ్డాను, "అవును.... కానీ, బాస్!—"

"ఏమిటి బాయ్!"

"దేవరాజ్ నన్ను అనుమానిస్తున్నాడు!" నా కేడుపు ముంచుకొచ్చింది.

బాస్ చిన్నగా నవ్వాడు, "నిన్నుగాక నన్ను అనుమానిస్తాడా?"

అతని మాటలు విని తీక్షణంగా చూశాను.

బాస్ మళ్లీ అన్నాడు, "రిలాక్స్, యూ పూర్ బాయ్! దేవరాజ్ కు చెప్తాను—నిన్ను డిస్టర్బ్ చెయ్యకూడదని. నువ్వు దిగులుపడకు!"

"సరే, బాస్. కానీ....పోలీసులు నా ఇంటి దగ్గర నిఘా వుంచుతారు—నన్ను వెంటాడుతారు—అదే నాకు నచ్చడంలేదు! నీరసం వస్తోంది!"

"వెల్, వెల్....పోలీసుల గురించి నువ్వెందుకు భయపడుతున్నావు?" ఈ సారి బాస్ కంఠం కఠినంగా వుంది, "నెక్లేస్ నువ్వు దొంగలించలేదు కదూ?.... అవునా?"

నా గొంతు తడారింది. చిన్నగా గొణిగాను: "ఈ సీక్రెట్ ప్లేస్ గురించి మీకూ నాకూ తప్ప యెవరికీ తెలీదు! అందుకే భయపడుతున్నాను!"

"నేనర్థం చేసుకున్నాను. నువ్వు నిశ్చింతంగా వుండు. నిన్ను అనుమానిస్తూ కూచోకుండా రంభని వేగంగా గాలించమని దేవరాజ్ కి చెప్తాను. కమల్, నిన్ను నమ్ముతాను. నువ్వాపని చెయ్యవు!"

బాస్ మాటలు నాకు తృప్తి కల్గించాయి. సెలవు తీసుకుని బయటికి వచ్చి ఈలలుతూ కారెక్కాను.

కారు స్టార్ట్ చేసి ముందుకు దూకించాను.

శంకర్!

వీడి తల యిప్పుడు కొబ్బరికాయలా పగులుతుంది!

# 8

శంకర్ నన్ను మొన్నరాత్రి తనింటికి తీసికెళ్లాడు కాబట్టి అతని యిల్లు కనుక్కోడం కష్టం కాలేదు: పంజగుట్టలో ఓ ఇరుకు వీధిలో పెంకుటిల్లు.

మెయిన్ రోడ్ మీద కారుదిగి అటూ ఇటూ చూశాను. ఆ రోజు ఆదివారం కాబట్టి షాపులన్నీ మూసివున్నాయి. రోడ్డుమీద జనం అట్టేలేరు. సమయం మధ్యాహ్నం ఒంటిగంట.

కారు డిక్కీలోంచి ఖమ్మం నుంచి తెచ్చుకున్న కడ్డీ తీశాను. దాన్ని చేతిలో పట్టుకుని వీధిలో చకచక నడిచాను. నాకెదురు వస్తున్నవాళ్ళు నన్ను గమనిస్తున్నా నేను పట్టించుకోవడంలేదు.

నా ధ్యేయం ఒక్కటే: శంకర్ తల పగలగొట్టడం.

కానీ, అతను ఇంట్లో వున్నాడో లేక సిటీ వదిలి పారిపోయాడో నాకు తెలీదు. నగ దొంగిలించి నన్ను మోసగించి, ఈ వూళ్ళో వుండే ధైర్యం వుందా వీడికి?

ఆలోచించుకుంటూ వెళ్లి ఇంటిముందాగాను.

తాళం వేసిలేదు.

నా గుండెలు వేగంగా కొట్టుకున్నాయి.

ఇంట్లోనే వున్నాడా? ఎంత ధైర్యం!

ఇప్పుడు నాకు గుండె దడతోబాటు భయం కూడా పట్టుకుంది. నేను పట్టుకున్న కడ్డీ జారిపోయింది. శంకర్ మీద దాడి చెయ్యగలనా? అంత ధైర్యం, బలం నాకున్నాయా? లేవు. మరుక్షణం జాలీతో నా ఘర్షణ

జ్ఞాపకం వచ్చింది. ఆ సన్నివేశం, ఆవేశం, తలచుకుంటే శంకర్ తల బద్దలు చెయ్యగలనని నమ్మకం కల్గింది.

కానీ—

జానీ బారినుంచి నన్ను కాపాడుకుంనేందుకు పరోక్షంగా సహాయపడ్డ శంకర్‌ని గాయపరుస్తానా!

ఈ ఆలోచనకి నా వొళ్ళు గగుర్పొడిచింది. మరుక్షణం నాకు ఉపకారం చేసినవారికి అపకారం చేసే సాహసం చెయ్యలేనని తేల్చుకున్నాను.

ఈ వ్యవహారాన్ని సహనంగా, శాంతియుతంగా పరిష్కరించాలి.

ఈ నిశ్చయానికి వచ్చి, ఆవేశాన్ని అణుచుకుని, తలుపు తట్టాను.

వెంటనే లోపలి నుంచి శంకర్ అర్చాడు, "ఎవరు?"

గొంతు గాభరాగా లేదు, గంభీరంగా వుంది.

నేను మరోసారి తలుపుతట్టి, "నీ పార్ట్‌నర్, మిస్టర్ కమలాకర్" అన్నాను.

వెంటనే శంకర్ గొంతు పలికింది. "తలుపుతీసే వుంది. వచ్చేయ్!"

నెమ్మదిగా తలుపు నెట్టాను. కొద్దిగా తెరుచుకుంది. ఏర్పడ్డ సందులోంచి లోనికి తొంగి చూశాను. ఎదురుగా శంకర్ కుర్చీలో కాలుమీద కాలేసుకుని కూచొని, బటానీలు తింటూ ట్రాన్సిస్టర్ వింటున్నాడు.

పూర్తిగా తలుపు తెరిచి లోనికడుగు పెట్టేను.

శంకర్ ముందు నన్ను చూసి నవ్వినా, నా చేతిలో కడ్డీ చూసి అదిరిపడి లేచి నిలబడ్డాడు.

"ఏమిటి కమల్!"

"పరిస్థితి మారింది."

"ఏమిటి నువ్వనేది!" రెట్టించాడతను.

"పరిస్థితి మారింది." మళ్ళీ అన్నాను, "నీ చెప్పు చేతల్లో వుండే పరిస్థితి కాదు—నేను చెప్పు చేతిలో తీసుకునే పరిస్థితి."

శంకర్ కొన్ని క్షణాలు నన్ను చూశాడు: తికమకగా, ఆందోళనగా, ఆ తర్వాత కర్కశంగా చివరికి హేళనగా.

ఫకాలున నవ్వి "నీకు పిచ్చిపట్టింది!" అన్నాడు.

నేనతని మాటలు పట్టించుకోలేదు. చేతిలో కడ్డీని తిప్పుతూ, అతనికి చూపిస్తూ అన్నాను, "ఈ కడ్డీతో నే జానీ పళ్ళూడగొట్టాను. అవి నీ నెత్తిమీద పడ్డాయి. ఇప్పుడా నెత్తిని పగలగొట్టబోతున్నాను. కామెంట్ ప్లీజ్!"

శంకర్ నన్ను ఓ క్షణం పరీక్షగా చూసి ఛటుక్కున అన్నాడు, "నా నెత్తి పగులగొట్టినచో నెత్తురు చిమ్మును. అది నీ బట్టలను తడిపివేయును. నేను గట్టిగా కేక పెట్టెదను. జనం పరిగెత్తి వచ్చెదరు. ఆ తరువాత పోలీసులు....ఆ తరువాత—"

"షటప్! యూ కన్నింగ్ బాస్టర్డ్! పరిహాసానికిది సందర్భము కాదు. నీ నక్కజిత్తులు కట్టిబెట్టి నగ తీయ్!" అర్చాను.

శంకర్ మరోసారి పరీక్షగా చూశాడు.

నా కర్కశత్వానికి ఆశ్చర్యపోయి రెండు నిమిషాల తర్వాత ప్రశాంతంగా అన్నాడు:

"నీ కళ్ళు నెత్తికెక్కాయి. నువ్వు చాలా తొందర పడుతున్నావు. అది మంచిది కాదు. పదిరోజులు పడుతుందన్నాను. పదిరోజులప్పుడే పూర్తయ్యాయా?"

ఈ మాటలతను ఏ ఉద్దేశ్యంతో చెప్పాడో అర్థం కాలేదు.

కపటత్వమా? అమాయకత్వమా?

ఏదేమైనా అతన్ని దారికి తీసుకరావాలి.

"చూడు మిస్టర్, నేనడిగింది ఒరిజనల్ నెక్లేస్ గురించి. నకిలీ కాదు."

"ఒరిజినలా! నా దగ్గరెక్కడిది?" అర్చాడతను.

"నన్ను మోసగించి రాత్రి తస్కరించావు. కానీ తప్పించుకోలేవు. నీ వేలిముద్రలు పోలీసులకి దొరికాయి. నీ గుప్పెట్లో యిరుక్కుని నా బాస్‌కి ద్రోహం చేసినందుకు ప్రాయశ్చిత్తంగా నేనిప్పుడేం చేస్తానో తెలుసా?"

"ఏమిటి కమల్! ఏం చేస్తావు? ఏమీ చెయ్యలేవు. ఎందుకంటే, నువ్వు ఆరోపిస్తున్నట్టు నేనేమీ చెయ్యలేదు కాబట్టి!"

"చేశావు. రంభని చంపి నన్ను ఫోటోల్లో ఇరికించావు. రాత్రి మనం నగ పెట్టేశాక తిరిగి నువ్వు రహస్యంగా వెళ్ళి దొంగిలించావు. నీ నకిలీ నగకథ వట్టి హంబక్. దాని అవసరం లేదు. నన్ను హత్యలో యిరికించే ఫోటోలు నీ దగ్గర వున్నాయి కాబట్టి నీ దొంగతనం నేను బయట పెట్టననుకున్నావు. అది పొరపాటు.

నేనిప్పుడు అన్నిటికీ సిద్ధపడ్డాను. నా బాస్‌తో నేనిలాటి ప్రమాదకరమైన ఆట ఆడుతూ మనశ్శాంతిగా బ్రతకలేను. తిరిగి ఆ నగ బాస్‌కి లభించేవరకు నేనేమైనా చేస్తాను. ఆ నగ నువ్వు నాకిస్తే మనిద్దరం క్షేమంగా వుంటాం. లేదా యిద్దరమూ నాశనమవుతాం. త్వరగా చెప్పు, నీకేది ఇష్టం?"

శంకర్ ముఖంలో నెత్తురుచుక్క లేదు. మార్చ్యురీలో

గుర్తింపుకోసం భద్రపరచిన దిక్కులేని శవంలా కనిపించాడు.

అతన్ని చూసి నాకు భయమేసింది.

"చెప్పు! నీకేది ఇష్టం?" గద్దించాను.

శంకర్ తేరుకుని కళ్ళు చిట్లించాడు. నన్ను తీక్షణంగా చూసి కుర్చీలో కూలబడ్డాడు.

ట్రాన్సిస్టర్ ఆఫ్ చేసి నన్నుకూడా కూచోమని సైగ చేశాడు. అసహనంగా కూచున్నాను. శంకర్ ముఖం ఆందోళనగా వుంది. సిగరెట్ వెల్గించి గట్టిగా రెండు దమ్ములులాగి కప్పుకేసి చూశాడు.

"కమల్, నీ మాటలు ఆశ్చర్యం కల్గిస్తున్నాయి."

అతని మాటలు నాకు విసుగుపుట్టించాయి.

"నగ ఎక్కడవుంది?"

"నువ్వు చాలా చాలా పొరబడుతున్నావు. అది నా దగ్గర లేదు."

నాకు కోపం వచ్చింది, "సరే, మన వ్యవహారం పోలీసులకు చెప్తాను."

"అసలేం జరిగింది!" ఉన్నట్టుండి అర్చాడతను. ఆ తర్వాత చేతులూపుతూ, "ఏమిటిదంతా!" అని గర్జించాడతను.

"నీ కంతా తెలుసు. ఈ పని నువ్వే చేశావు."

"నేను చెయ్యలేదు, నాకేమీ తెలియదు."

"పరిస్థితి సీరియస్‌గా మారుస్తున్నావు. నీ ప్లాను సక్సెస్ కాలేదు శంకర్. నన్ను డబుల్ క్రాస్ చేసి నువ్వు నిశ్చింతగా గడపలేవు. నగ యిచ్చేసెయ్—గుడ్ బై చెప్పుకుందాం!"

"షటప్! పిచ్చికూతలు! నగ నేను దొంగిలించానని

ఎవరన్నారు? ఏమిటి ఆధారం?"

"పోలీసుల దగ్గర వేలిముద్రలున్నాయి!"

"అలాగా? చెక్ చేసుకోమను. ఇప్పుడే పోలీసుల్ని పిలువ్! ఆ వేలిముద్రలు నావైతే నేరం ఒప్పుకుంటాను."

"అది నీకూ నాకూ మంచిది కాదు. సాధ్యమైనంత వరకు ఈ వ్యవహారం నుంచి క్షేమంగా బయటపడేందుకు కృషి చేద్దాం. నువ్వు త్వరపడి ఆ నగ కాజెయ్యకుండా, నకిలీ నగ వచ్చేవరకు ఆగివుంటే, ఈ ప్రమాదం ఏర్పడేది కాదు...."

"కమల్, నాకు వివరంగా చెప్పు. ఏమిటిది? దొంగతనం యెలా జరిగింది? ఎవరు తెలుసుకున్నారు?"

నేను జరిగింది వివరంగా చెప్పాను.

అతను అంతా విని ఆశ్చర్యంగా చూశాడు.

ఆ తర్వాత ముందుకు జరిగి నా చేతులు పట్టుకున్నాడు.

"కమల్, ఆ నగ నేను దొంగిలించలేదు. నా నకిలీ నగ కథ బూటకం కాదు. నిరూపిస్తాను. నిన్ను డబుల్ క్రాస్ చెయ్యాలని నేనెప్పుడూ ఆలోచించలేదు. నాతో కలిసిన వాళ్ళని మోసం చెయ్యను. ఆ నగ నేను దొంగిలించలేదు!"

"మరెవరు దొంగిలించారు?"

"ఏం, నువ్వు కాకూడదా?"

నేను విసురుగా చెయ్యెత్తి అతన్ని కొట్టబోయాను.

అతను చెయ్యిపట్టుకుని, "రిలాక్స్," అన్నాడు. "నీ బాస్ కాకూడదా?"

"శంకర్!" అరిచాను.

నవ్వాడతను, "పదిలక్షలు! ఇన్సూర్ చెయ్యబడ్డ షటప్! నీ బాస్ బుద్ధుల గురించి నాకు తెలుసు!

కమల్, నీ బాస్ తప్పకుండా యేదో గ్రంథం నడుపుతున్నాడు!"

"నోర్ముయ్!" కొట్టబోతే మళ్ళీ చెయ్యి పట్టుకున్నాడు.

"కమల్! ఈ దొంగతనంలో యెవరిదో అదృశ్య హస్తముంది! ఆ నగ ఎక్కడ వుందో నీకూ నాకూ, నీ బాస్‌కూ తప్ప యెవరికీ తెలియదు. దాన్ని నువ్వు తియ్యలేదని నేను నమ్మినట్టు నువ్వు కూడా నన్ను నమ్మాలి! ఇక నీ బాస్ తప్ప తీసే అవకాశం యెవరికి వుంది? ఆలోచించు!"

నేను శంకర్ చెయ్యి విదిలించికొట్టి లేచాను.

"నా బాస్ గురించి ఇలా మాట్లాడావా నాలిక చీరేస్తాను!" అనర్చాను.

ఆ తర్వాత అటూ ఇటూ చూసి పక్కగదిలో కెళ్ళాను. శంకర్ నా వెనక వచ్చాడు.

"నాకిప్పుడు నగ కావాలి. అయిదు నిమిషాలు సమయమిస్తున్నాను. ఈ లోపు ఇచ్చావా సరే, లేదా పోలీసులకి—"

మాటలా పేపి శంకర్‌ని చూశాను.

చిన్నగా నవ్వుతూ చూస్తున్నాడతను.

నేను ఘటుక్కున చూపులు తప్పించాను. గదిలో ఓ మూల ముక్కాలి పీటమీద చిన్న పాతకాలపు సేఫ్ కనిపించింది.

దాని దగ్గరికెళ్ళి కాలితో తన్ని, "దీన్ని తెరువ్!" అనర్చాను.

శంకర్ వేగంగా కదిలివచ్చి నన్ను వెనక్కి లాగాడు.

"రాస్కెల్! అదేమిటనుకున్నావ్? మా తాత ఇచ్చిన పవిత్రమైన కానుక! దాన్ని కాలితో తన్ని పాపం అంటు గట్టుకున్నావు!"

"షటప్! త్వరగా తెరువ్! లేదా ఈ రాడ్‌తో పగల గొడ్తాను!" కడ్డీ తీసుకుని సేఫ్ పిడిమీద ఒక దెబ్బ వేశాను.

"యూ ఫూల్! నిన్ను చంపేస్తాను!"

"కమాన్ మాస్టర్! తాళాలిలా యివ్వు!"

"నా దగ్గర లేవు! నీ కందవు—"

"అయితే ఇప్పుడొకటే మార్గం వుంది—పోలీసుల్ని పిలవడం!"

"నీకు పిచ్చిపట్టింది!" అర్చాడు శంకర్, "నగ నా దగ్గర లేదంటే బుర్ర కెక్కడంలా? రాస్కెల్, సహిస్తున్న కొద్దీ మితిమీరుతున్నావు! నీ పీకనొక్కి పాతి పెట్టేస్తాను!"

శంకర్ రెండుచేతులు జాపి ఛటుక్కున నా దగ్గరికి జరిగాడు.

నేను విసురుగా కడ్డీ ఎత్తాను. శంకర్ చేతులు దింపేసి పళ్ళు నూరుతూ కర్కశంగా చూశాడు. నేనూ చూశాను అంతకంటే కర్కశంగా. మా చూపులు కలిశాయి: ఇద్దరిమధ్య చిచ్చు రగిల్చాయి.

కొన్ని క్షణాలు నిశ్శబ్దం....

ఇంతలో ముందు గదిలో ఏదో కూనిరాగం విన్పించింది. అంత చక్కటిరాగం నేనెప్పుడూ వినివుండలేదు!

ఉలికిపడి మేం కలవరంగా చూసుకున్నాం.

శంకర్ తటాలున వెనక్కి తిరిగి ముందుగదిలో

కళ్ళాడు.

అతను వెళ్ళిన కొన్నిక్షణాలకి అరిచాడు:

"కమల్! ఇలారా! ఎవడొచ్చాడో చూడు!"

పరిసితి నాకేమీ అర్థంగాలేదు. కడ్డీ గట్టిగా పట్టుకుని, లోతుగా గాలిపీల్చి గంభీరంగా ముందు గదిలోకి నడిచాను....

# 9

"హల్లో! హల్లో, మిస్టర్ పిరికీ! సారీ—మొనగాడివి కదూ?" నవ్వాడు జానీ, మునిపళ్ళు లేని నోరు తెరిచి.

నాలో గాంభీర్యం ఎగిరిపోయి వళ్ళు చల్లబడింది.

జానీ!

వీడిక్కడికెలా వచ్చాడు? ఎందుకొచ్చాడు? నాగుండె వేగంగా కొట్టుకుంది. తలతిరిగి స్పృహ తప్పినట్టయింది. నేను ముందుకు తూలగా శంకర్ చెయ్యి నన్ను ఆపింది. తేరుకుని సంబాళించుకున్నాను.

తల విదిలించి జానీని చూశాను. ద్వారంలో నిలబడి వున్నాడు—నడుముమీద చేతులు పెట్టుకుని. తలమీద, కణతమీదా రెండు బ్యాండేజీలున్నాయి — బట్టలు మాత్రం అలాగే వున్నాయి—మురికిగా. మునిపళ్ళు లేని వాడినోరు వికృతంగా, అసహ్యంగా వుంది.

"నువ్వు—ఇక్కడికెందుకొచ్చావ్!" అర్చాను ఆందోళనగా. నా చేతిలో ఇనపకడ్డీ బలంగా బిగుసుకుపోయింది.

వాడు నవ్వాడు, చింపాంజీలా: "నిన్ను చావగొట్టి పళ్ళు కట్టించుకుపోదామని."

శంకర్, నేనూ చూపులు మార్చుకున్నాం.

నాలో ధైర్యం వచ్చింది. "నన్ను చావగొట్టే ప్రయత్నం విరమించుకో!" అన్నాను కడ్డీ చూపిస్తూ, "గుర్తుందా? నా శక్తి నువ్వు గ్రహించావు. మొన్నటి సత్కారం అంత తేలిగ్గా మర్చిపోలేదనుకుంటాను. ఇది పళ్ళు కట్టించుకునే చోటుకాదు—వూడగొట్టే చోటు. అందుకని నువ్విక్కడ్నించి వెళ్ళిపో!"

"కరెక్ట్! సరిగా చెప్పావు మిస్టర్—నిన్ను చావగొట్టే ఆలోచన నువ్వు చెప్పకముందే మానుకున్నాను. అయితే ఇక్కడికి పళ్ళూడగొట్టించుకోడానికి రాలేదు" అన్నాడు జానీ తాపీగా.

"మరి?"

"మీరేదో తగవులాడుకుంటున్నారు—మీ తగవు తీర్చడానికి వచ్చాను" అన్నాడు మరింత తాపీగా.

వాడి మాటలు విని మేం కలవరపడ్డాం.

"మేమిక్కడ వున్నామని నీకెలా తెలుసు?" అడిగాడు ఘటుక్కున.

జానీ తలుపుమూసి లోనికొచ్చి కూచున్నాడు.

"క్యూరియాసిటీ వుంటే తెలుకోలేనిదేమిటి? నాకేమీ తెలీయదనుకోకు! నాకంతా తెలుసు!"

"ఏమిటి నీకు తెలుసు?" వాడి బెదిరింపుకి నా వొళ్ళు మండింది.

వెకిలిగా నవ్వాడు జానీ.

"నీ బాస్ నెక్లేస్ ఎవరు దొంగిలించారో నాకు తెలుసు?" జేబులోంచి సగం కాలిన బీడీ తీసి అన్నాడు.

"ఎవరు?" అన్నాను. శంకర్ ఆవేశంగా జానీ మీదికి దూకబోయాడు. నేనతన్ని వెనక్కి లాగాను.

"నేను" అన్నాడు జానీ, "ఏసు సాక్షిగా నేనే!"

"ఏమిటి ఆధారం?" నా గొంతు సరిగ్గా పెగలేదు.

జానీ మా ఇద్దర్నీ పరీక్షగా చూసి జేబులోంచి పొట్లం తీశాడు. దాన్ని విప్పి నగ చూపించాడు.

నా బాస్ భార్య స్మృతికి చిహ్నమైన అపురూపమైన నగ!

జానీగాడి పాపిష్టి చేతుల్లో ఎంత అపవిత్రమైంది!

నేను తేరుకునేలోపున శంకర్ జానీ మీదికి దూకాడు. జానీ తటాలున శంకర్‌ని వెనక్కి తోసి లేచిబడ్డాడు.

జేబులోంచి కత్తితీసి చూపిస్తూ అన్నాడు, "జాగ్రత్త! నా దరికెవరొచ్చినా యీ కత్తివేటుకి గురవుతారు!"

మేం నిశ్చేష్టులైపోయాం!

జానీ చెరో చేతిలో కత్తి, నగ, మెరుస్తున్నాయి.

ఒకటి ప్రాణాలు తీసేది. మరొకటి విలాస జీవితాన్నందించేది.

నాకేమీ అంతుబట్టలేదు. ఏం జరిగింది? నగ జానీ చేతిలోకెలా వచ్చింది? మేం యెక్కడ పొరపాటు చేశాం?

పరిస్థితి మరింత తీవ్రంగా తయారైంది! నేనీ ఊబిలో మరింత లోతుగా దిగబడిపోయాను.

మా పథకం జానీకి తెలిసిపోయింది!

ఇది ప్రమాదకరం! ఇప్పుడు మా గుట్టు జానీ గుప్పెట్లో వుంది! వీడితో ఏ మాత్రం పొరపాటుగా వ్యవహరించినా మా నాశనం తప్పదు!

హఠాత్తుగా ఉలికిపడ్డాను. నేనేం చేస్తున్నానో నాకే తెలియడంలేదు!

కొన్ని క్షణాలక్రితం శంకర్‌తో ఘర్షణపడ్డాను. పోలీసులకి చెప్తానని బెదిరించాను! కానీ—ఇప్పుడు—ఆ

ఆలోచన ఎంత భయంకరంగా వుంది! పోలీసుల్ని రంగంలో దించితే దాని పర్యవసానం ఎంత తీవ్రంగా వుంటుంది!?

నా బాస్‌కి నేను చేసిన ద్రోహానికి ప్రాయశ్చిత్తంగా నన్ను నేనెందుకు శిక్షించుకోవాలి? దానివల్ల ఏమిటి ప్రయోజనం?

రంభ హత్యకేసులో జీవితాంతం జైల్లో కూచుంటాను. ఫర్వాలేదు. కానీ, బాస్ గురించేమిటి?

ఈ వూహించని పరిణామం అతని మీద ఎలాటి ప్రభావం చూపిస్తుంది?

నేను మోసంచేసినట్టు బాస్‌కి తెలిస్తే గుండె ఆగి చనిపోడా? మతి చలించి పిచ్చివాడై పోడా? లేక-కనీసం జీవితాంతం కృంగిపోడా?

బాస్‌కి నా మీద యెంత విశ్వాసముంది! ఎంత ప్రేమ వుంది! ఏ తండ్రి దగ్గరా ఏ కొడుకూ పొందని ట్రీట్‌మెంట్ నాకు నా బాస్ దగ్గర లభిస్తోంది. అతని వినాశానికి నేను కారకుడ్ని కావాలా!

కాదు! చేసిన ద్రోహానికి ప్రాయశ్చిత్తంగా నన్ను నేను శిక్షించుకుని నా బాస్ వినాశానికి కారకుడ్ని కాకూడదు! ఈ వ్యవహారాన్ని మరో విధంగా హేండిల్ చెయ్యాలి. శంకర్‌తో అంత తెలివితక్కువగా వ్యవహరించినందుకు లోలోన తిట్టుకున్నాను. ఈ వ్యవహారం నుంచి బయటపడే మార్గం యేదో తప్పకుండా వుండి వుంటుంది.

ఏమిటది?

ఇప్పుడాలోచించకూడదు—ఒక సమయంలో ఒక

ఆలోచన. ప్రస్తుతం జానీ గురించి ఆలోచించాలి. వీడితో జాగ్రత్తగా వ్యవహరించి పరిస్థితి సీరియస్ కాకుండా చూడాలి.

తేరుకుని, శంకర్‌నీ ఆ తర్వాత జానీనీ చూశాను.

"ఆల్ రైట్, జానీ. ఆ నగ నువ్వే దొంగిలించావు." అన్నాను.

"అవును."

"అయితే ఈ బిజినెస్‌లో నువ్వు కూడా పార్ట్‌నర్‌గా చేరావు. ఇంకెందర్ని చేర్చావు?" అడిగాను.

"నేనొక్కడినే" అన్నాడు వాడు.

"నీ ముఠా యెక్కడ?"

వాడి ముఖం యెర్రబడింది: "ఆ వెధవల గురించి చెప్పుకోడం సిగ్గుచేటు! నువ్వు కొట్టిన దెబ్బలకు పత్తా లేకుండాపోయారు. ఇప్పుడు ఖమ్మంలో లేరు."

"నువ్వొక్కడికి వంటరిగా వచ్చావా?

"అవును."

"ఏ ఉద్దేశ్యంతో?"

"నీ మీద పగ తీర్చుకోడానికి."

"మంచిదె. కూచో, వివరంగా మాట్లాడుకుందాం."

జానీ నగ జేబులో దోపుకుని, కత్తి చేతిలో పట్టుకుని కూచున్నాడు. ఆ తర్వాత మేం కూచున్నాం.

ఆందోళనగా, ఎర్రబడ్డ ముఖంతో చూస్తున్న శంకర్‌తో నేనన్నా: "నువ్వు జోక్యం చేసుకోకు. బిజినెస్ నేను మాట్లాడతాను."

శంకర్ పరధ్యానంగా తలూపాడు.

నేను జానీ వేపు తిరిగాను: "వెల్, జానీ ఇక మాట్లాడు, నగ యెలా దొంగిలించావు?"

నవ్వాడు జానీ, "చెప్తాను మిస్టర్. ఆవేశంలో కూడ సమయస్ఫూర్తిగా ప్రవర్తించి అందని అవకాశాన్ని చేజిక్కించుకోమనేవాడు వస్తాదు."

"వాడెవడు?"

"నా గురువు—ఆంథోనీ- కేరళలో వున్నాడిప్పుడు."

విసుగ్గా చూశాను, "సరే, చెప్పు."

జానీ నన్ను సీరియస్‌గా చూసి అన్నాడు:

"నీ చేత దెబ్బలు తిని మా వూళ్ళో చులకనైపోయాను. అందరూ నా పేరు చెప్పుకుని నవ్వుకుంటున్నారు! నువ్వలా తిరగబడతావని నేనూహించలేదు! నీ చేత తన్నులు తిని నవ్వులపాలయ్యాను. నా రికార్డ్‌లో యిలాంటి దశ ఎన్నడూ రాలేదు. నాకు తల కొట్టేసినట్టయింది.

"నీ మీద పగ రగిలింది. నిన్ను పట్టుకుని చంపెయ్యాలని నిశ్చయించుకున్నాను. కానీ, ఈ ఆలోచన వచ్చేటప్పటికి నువ్వు వూళ్ళో లేవు. నేను హాస్పిటల్ నుంచి పారిపోయి నీ ఆరా తీశాను. నువ్వు బసచేసిన హోటల్లో నువ్వు హైదరాబాదు కెళ్ళిపోయినట్టు తెలిసింది. రిజిస్టర్‌లో నీ హైదరాబాదు అడ్రసు దొరికింది....

"వెంటనే బయలదేరి నిన్న సాయంత్రం యిక్కడికొచ్చేశాను.

"నిన్ను ఎలా చంపాలో బాగా ఆలోచించుకుని వచ్చాను. చీకటిపడ్డాక అర్ధరాత్రి నీ యింటికివచ్చి పొడిచెయ్యాలనుకున్నాను. అలాగే వచ్చాను. కానీ ఆలస్యమయింది. ఎవరి అదృష్టమో చెప్పలేనుగాని నువ్వు బ్రతికిపోయావు.

"నేను వీధిచివర్లో వుండగా నువ్వు, శంకర్ బయటికి

వచ్చి కారెక్కారు. కారు బయలుదేరింది. నాకేమీ తోచలేదు. కారువెంట కొంతదూరం పరిగెత్తాను. నిన్ను చంపే అవకాశం తప్పిపోయినందుకు తిట్టుకున్నాను. ఐతే నువ్వు శంకర్‌తో ఎక్కడికెళ్తున్నావో అర్థంకాలేదు. శంకర్ ఘరానా నేరస్తుడు!"

జానీ మాట లాగేసి శంకర్‌ని చూశాడు.

"మీరేదో కథ నడుపుతున్నారని అర్థమయింది. కారు వెంట కొంతదూరం పరిగెత్తి దారిలో ఒక స్కూటర్ దొంగిలించాను. దానిమీద మిమ్మల్ని వెంబడించాను. మీ కారు చాలాసేపు ప్రయాణించి ఒక బంగళా వెనుక వీధిలో ఆగింది. మీరిద్దరు కారుదిగారు. నేను వీధిచివర్లో కాచుకున్నాను. కాస్సేపటికి మీరు తాడు సహాయంతో పెరటిగోడ దాటారు. ఆ తర్వాత నేనుకూడా అలాగే చేశాను."

నేను వూపిరిపీల్చడం మర్చిపోయాను.

శంకర్ రెప్పవెయ్యకుండా చూస్తున్నాడు.

మళ్ళీ అన్నాడు జానీ, "ఇంట్లో మీరిద్దరూ ప్రవేశించి కిచెన్ తలుపు తెరిచారు. ఆ తర్వాత లోనికెళ్ళిపోయారు. నేనుకూడా చప్పుడు కాకుండా కిచెన్‌లో ప్రవేశించాను. అప్పుడే—ప్చ్, బాడ్‌లక్! నా చేతికేదో గిన్నె తగిలి కిందపడింది. కంగారుపడి చెంగున బయటకిదూకి పారిపోయాను. మీరిద్దరూ గాభరాగా కిచెన్‌లోకొచ్చి చూశారు — అప్పుడు 'మ్యావ్' అని అరిచిందెవరను కున్నారు?"

పగలబడి నవ్వాడు జానీ.

"ఓ.కే. మీరు తేలికబడి తిరిగివెళ్ళిపోయారు. నేను జాగ్రత్తగా మీవెంట వచ్చాను. మీరు బెడ్‌రూంలో

కెళ్ళాక నువ్వు తివాసీయెత్తి రాళ్లు లెక్క బెట్టసాగావు. నేను తలుపుపక్కన నక్కి గమనించసాగాను...."

బీడీ వెలిగించి మళ్లీ అన్నాడు జానీ:

"కాస్సేపటి తర్వాత నువ్వు రాతిపలక తొలగించావు. పదమూడవ పలక. అప్పుడు శంకర్ జేబులోంచి ప్లాస్టిక్ కవరు తీశాడు.

"అందులో ఏదో మెరుస్తూ కన్పించింది!

"నా ఊపిరి ఎక్కడ అలికిడిచేస్తుందోనని భయపడ్డాను. ఊపిరి బిగబట్టి చూశాను. శంకర్ ఆ కవర్ని నేలలోవున్న పాత్రలో జారవిడిచాడు. తర్వాత నువ్వు పలకపెట్టేసి శుభ్రంగా తుడిచావు. గదిలో మసగ్గా లైటు వెలుగుతోంది. నేనేం చెయ్యాలో వెంటనేతట్టింది. ఛటుక్కున లోనికెళ్లాను. ఆ సమయాన మీరుగనక నన్ను చూసివుంటే చంపేసే వాడ్ని—"

జానీకళ్ళు క్రూరంగా మెరిశాయి.

"తర్వాత ఏం చేసావు?" అడిగాను నింపాదిగా.

"మీరు చూడకుండా నేను గదిలో నేల మీద ప్రాకుతూ బెడ్ కింది కెళ్ళాను. అక్కడనించి గమనించసాగాను. నువ్వు తివాసీ పరిచేసి శంకర్తో బయటికెళ్ళిపోయాక బయటికి వచ్చాను. మీరిద్దరూ గదికి తాళం వేసుకుని వెళ్ళిపోయారు. మీరు పూర్తిగా బంగళానించి వెళ్ళిపోయాక నేను రంగంలో దిగాను. అంత విలువయిన నగ నేను ముట్టుకుంటానని కలలోకూడా అనుకోలేదు!"

తమాషాగా చేతులూపాడు జానీ.

"బయటపడే మార్గంలేదు. గదికి తాళంవేసి వెళ్లారు. కిటికీగుండా దూకుదామనుకున్నాను. కానీ ఆ చువ్వల్లోంచి దూరడానికి నేను పక్షినిగాను. బెడ్ రూంని ఆనుకొని

బాత్ రూంవుంది. లోనికెళ్ళి చూశాను. పైన వెంటిలేటర్ కనిపించింది. కాస్త కష్టపడ్డా ఆ మార్గంగుండా బయట పడ్డాను."

"వెరీగుడ్! కానీ ఒక పొరపాటు చేశావు. నీ వేలి ముద్రలు పోలీసులకి దొరికాయి" అన్నాను.

"లేదు, లేదు! నేను ముట్టుకున్నచోటల్లా శుభ్రంగా తుడిచాను మిస్టర్!"

నేను ఆశ్చర్యపోయాను: "అయితే ఆ నగతో పారి పోకుండా ఇక్కడికెందుకొచ్చావ్?"

"అనుభవంలేక. ఇలాంటి పెద్దపనులు నేనెప్పుడూ చెయ్యలేదు!"

"దొంగ వెధవా! నా పథకంలో పానకంలో పుడక లా తగిలి పాడు చేశావు!" అర్చాడు శంకర్.

జానీ నవ్వాడు, "అనుకున్నవన్నీ జరగవు: నేననుకున్నది జరిగిందా? అనవసర వాదన అవతలబెట్టి అసలు విషయానికొద్దాం."

"నువ్విక్కడి కెందుకొచ్చావో చెప్పు!" అన్నాను.

"బేరం కుదుర్చుకోడానికి" అన్నాడు జానీ, "ఈ నగ నా దగ్గరవుంది గానీ దాన్ని ఏం చెయ్యాలో నాకు తెలీదు. అమ్మబోతే పట్టుబడతాను. నాకు తెలుసు— ఈ లైనులో నా కనుభవంలేదు. మీగురించి ఆలోచించాను. మీ రేదో పథకం వేసుకున్నట్టున్నారు: ఈ నగ అమ్మించాలంటే మీవల్లనే సాధ్యమవుతుంది. పైగా ముగ్గురికీ లాభం! ఆలోచించుకోండి!"

శంకర్ తటాలున వంగాడు, "ఇలా ఇచ్చేయ్! దాన్ని అమ్ముతాను!"

జానీ అదోలా నవ్వాడు. "నాభాగం యెంత?"

నేనడ్డు తగిలాను: "జానీ, ఆ నగ అమ్మడం ఇప్పుడు సులభంకాదు. నువ్వా హారాన్ని దొంగిలించకుండా మాదగ్గ రికి వచ్చి బ్లాక్ మెయిల్ చేస్తే బావుండేది. ఇప్పటి పర సితి వేరు. పోలీసులు దానికోసం గాలిస్తున్నారు దేశ వ్యాప్తంగా! అమ్మడం కష్టంకాదు, ప్రమాదకరం!"

"ఎంతకాలం ఆగాలి?"

"చెప్పలేం. మా ప్లాన్ పదిరోజుల్లో సక్సెస్ కావల సింది. నువ్వు చెడగొట్టావు."

జానీ కాస్సేపు ఆలోచించి అన్నాడు, "సరే. ఎంత కాలమయినా ఆగుతాను. పదిరోజులు—పది నెలలు—పది సంవత్సరాలు—ఎంత కాలమయినా ఆగుతాను. దాన్ని అమ్మి నాలుగవ వంతు భాగం నాకివ్వాలి."

"అలాగే!" శంకర్ అన్నాడు ఉత్సాహంగా, "దాన్ని ప్పుడిస్తావా?"

జానీ అంత తెలివితక్కువ పని చెయ్యడని నాకు తెలుసు.

"ఇస్తాను." అన్నాడతను, "ముందు నా షరతులు ఒప్పుకోవాలి."

"ఏమిటవి?"

జానీ జేబులోంచి కాయితం, పెన్నుతీసి నాకందిం చాడు.

"దీనిమీద మీరు సంతకాలు పెట్టాలి."

నేను ఆతృతగా కాయితం విప్పి చదివాను.

అందులో యిలావుంది :

"నిన్నరాత్రి, అనగా మార్చి ఒకటవ తేదీన, శంకర్-కమలాకర్ అనబడే తోడుదొంగలమైన మేము, సేఠ్ రంగూన్‌వాలా ఇంట్లో వజ్రాలహారం దొంగిలించాము.

అది ప్రస్తుతం మాదగ్గరేవున్నది.

ఈ విషయం ధృవపరచగలము...."

ఈ వాక్యాలు చదివాక నా తల దిమ్మెక్కి కళ్ళు తిరిగాయి.

# 10

శంకర్ తటాలున జానీమీదికి దూకి దవడకిందగుద్దాడు. జానీ కీచుమని అర్చి కిందపడ్డాడు. నేను నోరుతెరిచి చూస్తున్నాను. శంకర్ విసురుగా వాడి డొక్కలోతన్ని వంగబోయాడు—కత్తికోసం. కానీ జానీ శంకర్ కాల్లో పొడిచాడు.

శంకర్ కిందపడి బాధగా అర్చాడు. నేలమీద రక్తం పారుతోంది. అతని పిక్కలదగ్గర ప్యాంటు రక్తంతో ఎర్రబడింది. జానీ చెంగున నిలబడి కాలితో శంకర్ ముఖం మీద తన్నాడు.

శంకర్ గట్టిగామూల్గి తలపక్కకి వాల్చాడు. జానీ అతని కాలరు పుచ్చుకుని లేపి కుర్చీలో కూలేశాడు.

ఈ దృశ్యమంతా నేను వూపిరి బిగబట్టి చూశాను.

"ఓ.కే?" జానీ అడిగాడు కర్కశంగా, "యిలా వుంటుంది నా జవాబు. చూడు కమల్! ఈ ముసలాడిని నీ హద్దులలోవుంచు. లేదా ముగ్గురుకీ ప్రమాదం. ఇక ఆ కాయితంమీద సంతకం పెడ్తావా?"

జానీ ఘమల్ని ఎలాంటి వలలో బిగిస్తున్నాలో తెలుసుకున్నాను.

"పెట్టకపోతే ఏం చేస్తావు?"

"అప్పుడీ నగ నాకెలాగూ ఉపయోగపడదు గనుక పోలీసులకప్పగించి, జరిగింది చెప్పేస్తాను—ఆ విధంగా

వెళుతున్నానని తెలుసు. ఫరవాలేదు. మీరిద్దరూ కూడా తోడుగా వుంటారు గాబట్టి నాకు దిగులువుండదు. ముగ్గురికి బలే కాలక్షేపం, కచేరీ చేసుకోవడానికి."

నేను సందేహించకుండా సంతకం పెట్టి శంకర్‌ని చూశాను.

కాలంతా రక్తమయమై మూల్గుతున్నాడతను. కాయితము, కలం అందించి సైగచేశాను. మాట్లాడకుండా సంతకం చేశాడు.

జానీ కాయితం లాక్కుని చూసుకున్నాడు. చిన్నగా నవ్వి జేబులోంచి నగతీశాడు: "ఇప్పుడు ప్రమాదంలేదు. ఈ కాయితంతో పెద్దబరువు దించుకున్నాను. ఇక నిశ్చింతగా వుంటాను. జాగ్రత్త, నన్ను మోసంచెయ్యకండి! కాయితం పోలీసుల చేతిలో వుంటుంది!"

"ఈ బిజినెస్‌లో మోసంలేదు" అన్నాను.

"వెరీగుడ్!" జానీ నగ నా కందించాడు. వణకుతున్న చేతితో తీసుకున్నాను.

"నగ అమ్మేముందు నాకు తెలియజేయాలి. అలాగే మీ రెక్కడికయినా వెళ్ళినా నాకు తెలియజేయాలి. నగ అమ్మాక, నాభాగం యిస్తే ఈ కాయితం ఇచ్చేస్తాను. దట్సాల్."

లేచి నిలబడ్డాడు జానీ.

"ఎక్కడ వుంటున్నావు?" అడిగాను.

"ఎందుకు? చూడు కమల్, నువ్వోలాంటి యెత్తులూ వెయ్యకూడదు!"

"నా ఉద్దేశ్యం అదికాదు. మనం ముగ్గురం పార్టనర్స్. ఎవరెక్కడెక్కడ వున్నారో తెలుసుకుంటే ఎందుకయినా మంచిది."

జానీ అనుమానంగా చూశాడు: "ఓ.కే. బేగం బజా గల్లో [illegible]."

మళ్లీ నేను ఏమీ అడక్కుండా గుడ్ బై చెప్పి బయటికి దారితీశాడు.

హఠాత్తుగా నిశ్శబ్దం ఆవరించుకుంది జానీ నిష్క్రమణతో.

చాలాసేపు మేం మాట్లాడుకోలేదు. శంకర్ మాట్లాడే స్థితిలో లేడు. అతని కాలికి బలమయిన గాయం తగిలింది.

"అనవసరంగా ఎగిరావు!" అన్నాను.

"నో్ర్యాయ్!వాడికి బుద్ధిచెప్తాను!" అర్చాడు శంకర్.

"చూడు శంకర్, నీ ప్రవర్తన నాకు నచ్చలేదు. నువ్వే ప్రమాదం తెచ్చిపెట్టేలా కన్పిస్తున్నావు! జానీతో జాగ్రత్తగా వ్యవహరిస్తే ఏ అపాయమూ వుండదు. పైగా కొన్ని చిక్కులు విడదీయవచ్చు—"

"అంటే డబుల్ క్రాస్ చేస్తావా?"

"అది పొరదు. ప్రస్తుతం ఏమీ చెయ్యలేం. మనం వాడి గుప్పెట్లో వున్నాం. ఈ నగ అమ్మేంతవరకూ వుంటాం. ఇది అమ్మడం సులభంగాదు. చాలాకాలం పట్టవచ్చు. అంతవరకు ఎటునుంచి ఏం ముంచుకువస్తుందోనని భయపడుతూ గడపడమెందుకు?"

"అంటే ఏం చేస్తావ్?"

"నాకో ఆలోచనవుంది. ఈ నగ మనం యెలాగూ అమ్మలేం. తిరిగి యథాస్థానంలో పెట్టేద్దాం—"

"నీకు పిచ్చిపట్టింది!"

"చెప్పేది పూర్తిగా విను. నువ్వు నకిలీ నగ ఆర్డరిచ్చావు. అది వచ్చాక దాన్ని జానీచేతిలో పెట్టి వాడి వల్లోంచి బయటపడదాం!"

"అంతే, ఈపథకానికి గుడ్ బై కొట్టాలా?"

"తప్పదు! మనం అనుకున్నది పూర్తిగా అప్ సెట్ అయింది. పోలీసులు రంభకోసం గాలిస్తున్నారు. ఈ దొంగతనంతో ఆమెకి సంబంధంలేదని తెలుసుకోడానికి యెంతోకాలం పట్టదు! అప్పుడామె హత్య బయటపడుతుంది. ఈ అపాయం ఏర్పడకుండా నగ తిరిగి బాసుకు అందేలా చేసి ఆమెని గాలించే పనిని మాన్పిద్దాం."

శంకర్ కళ్ళు మెరిశాయి. ఆ చూపుల్లో భావం పసిగట్టాను. నా మాటల్లో అతనికేదో పాయింట్ తట్టింది.

"నగ యిలా యివ్వు!" చెయ్యిజాపి అన్నాడు కర్కశంగా.

"ఎందుకు?"

"పథకం వేసుకున్నాక ముందుకు సాగడమే తప్ప వెనక్కి తగ్గడమనేది లేదు! కమాన్ ఇలా యివ్వు!"

"ఇవ్వను" అన్నాను.

"సరే వెళ్ళు, వెళ్ళు కమల్! గెటవుట్!" అరిచాడతను కళ్ళుమూసుకుని, "వెళ్ళేముందు ఫోటోల విషయం మర్చిపోకు."

"వాటినేం చేస్తావు?"

"పోలీసులకి పంపిస్తాను. ప్లీజ్ గెటవుట్!"

అప్పుడుగానీ నాకు ఫోటోల విషయం తట్టలేదు. ఐతే ఈ వ్యవహారం అంత తేలిగ్గా తేలేదిగాదు. చాలా అడ్డంకులున్నాయి. ప్రస్తుతం నేను అన్నిటికీ తలవంచాలి. అంతకుమించి గత్యంతరంలేదు. ఈ అడ్డంకులే నా సమస్యకు పరిష్కారం చూపిస్తాయి....

నన్ను క్షేమంగా బయటపడేసే మార్గమేమిటది?

వెంటనే తట్టలేదు. మరికొంత సమయం కావాలి,

ప్రస్తుతం శంకర్‌కి నగ అప్పగించి వెళ్ళిపోవాలి.

అతని చేతిలో నగ పెట్టి, "అలాగే శంకర్, గుడ్ లక్" అన్నాను.

శంకర్ చిన్నగా నవ్వి, "ఐ పిటీయూ, పూర్ ఫెలో!" అన్నాడు.

అతని మాటలువిని ఆవేశంగా పిడికిలి బిగించాను. అతని ముఖంమీద గుద్దాలనిపించింది. కానీ, పరిస్థితి మరింతగా చెడుతుంది.

కాబట్టి నా పిడికిలి జేబులో పెట్టుకుని బయటకు నడిచాను.

**కమల్ తిరిగి శంకర్ నుండి నగను స్వాధీనం చేసుకో గల్గుతాడా?...**

**మాయమైన వంటగత్తె విషయం బయట పడుతుందా...**

**శంకర్ తీసిన ఫోటోలు, జానీ వ్రాయించు కున్న వుత్తరం పోలీసులచేతికి చిక్కుతాయా?**

**కమలాకర్ చివరకు ఏమవుతాడు???**

**వీటికి సమాధానాలు 'పరువు ఖరీదు' చివరి భాగం "చచ్చి సాధించాడు"లో వచ్చే నెల చదవండి...**

# బంగారు గూడు - వజ్రాల గుడ్లు

## అజీజ్

"సాయంత్రం త్వరగా రండి!" అంది సద్గుణ భర్తకు టై అందిస్తూ.

"ఏమిటి విశేషం?" అడిగేడు మంజునాథ్ కుతూహలంగా.

"ప్లాజాలో కొత్త పిక్చర్ వచ్చిందట!"

టై ముడివేసుకుంటూ, "ఏ పిక్చర్?" అడిగాడు మంజునాథ్.

"ది ఓమన్! మంచి థ్రిల్లింగ్ స్టోరీ అట. పక్కింటి ఇంజనీర్ గారి భార్య చెప్పింది. రాత్రి సెకండ్ షో కెళ్ళారట వాళ్ళు. ఆ పిక్చరులోని భయంకర దృశ్యాలు జ్ఞాపక మొచ్చి రాత్రంతా నిద్రపట్టలేదుట ఆవిడకి."

"ఐతే నువ్వూ ఈ రాత్రి జాగారం చెయ్యదలచుకున్నా వన్నమాట" అన్నాడు మంజునాథ్ నవ్వుతూ.

"మీకా భయం అక్కర్లేదులెండి. చదువుకునే రోజులలో నాకు 'ఆడపులి' అనే బిరుదు ప్రదానం చేశారు కొంటె

కోణంగులు. అదిసరేగానీ, ఐదున్నరకల్లా వచ్చేయాలి. అరమయిందా?"

"రాణీవారు ఆజ్ఞాపించడం, ఈ దాసుడుంగారు నిరాకరించడమూనా? అలాగే మేడమ్! టాకీసుకు ఫోన్ చేసి రెండు టికెట్లు రిజర్వ్ చేయించి వుంచు."

కారు తాళంచెవులుతీసి అందించింది సద్గుణ. మంజునాథ్ బయటకివచ్చి, పోర్టికోలో తళతళ మెరుస్తున్న చవర్లెట్ కారెక్కాడు. గుమ్మంలో నిలుచున్న భార్యకు టాటా చెబుతూ ముందుకి పోనిచ్చాడు.

పాండీబజారులో వుంది అతని వజ్రాల దుకాణం! తండ్రి యీమధ్యే గతించడంతో, లక్షల పెట్టుబడితో సాగే ఆ వ్యాపార భారమంతా అతనిమీద పడింది. తండ్రికి ఒక్కడే కొడుకు. బాదరబందీలులేవు. కొత్తగా పెళ్లయింది. బాల్యంనుంచి తండ్రిదగ్గర వ్యాపారంలో రాటుదేలాడు గనుక బిజినెస్‌లో అతనికే యిబ్బందులూ ఎదురు కావడంలేదు.

దుకాణం అనేక భద్రతా యేర్పాట్లతో నిండివుంది గనక అందులో దొంగలు పడతారన్న చింతకూడా అతని దరిజేరదు. ఇరవై లక్షలు విలువజేసే వజ్రాభరణాలెప్పుడూ ఆ దుకాణంలో నిక్షేపంగా నిదురబోతూ వుంటాయి. షాపు తలుపులకూ, కిటికీలకూ బర్గ్లర్ అలారమ్స్ ఫిట్ చేసి వున్నాయి.

బయట షోకేసుల్లో శక్తివంతమైన మైక్రోఫోన్స్ బిగించి వున్నాయి.

దుకాణం బయటనిల్చుని ఆభరణాలు చూస్తూ ఎవరేం మాట్లాడుకుంటున్నారో ఊపిరితోసహా షాపులోపల కూర్చుని స్పష్టంగా వినవచ్చు. ఒక్కోసారి ఫుట్‌పాత్

మీద నడిచేవారి మాటలుకూడా వినిపిస్తుంటాయందులో.

మంజునాథ్ పెర్సనల్ ఆఫీసులో, అత్యంతాధునిక మయిన ఓ బుల్లెట్ ప్రూఫ్ సేఫ్ గోడలో ఓగించివుంది. చాలా ఖరీదయిన ఆభరణాలు దాచివుంటా యందులో. ఎంతో గొప్ప కస్టమర్స్ వస్తేతప్ప వాటిని బయటికితీసి చూపించరు.

ఆ దుకాణం కొల్లగొట్టడానికి ఆరుసార్లు ప్రయత్నాలు జరిగాయి. ఆ ప్రయత్నాలు ఫలించడం అటుంచి, ఆ దొంగలిప్పటికీ వివిధ జైళ్లలో మగ్గుతున్నారు. అందులో ఇద్దరు దొంగలు కేవలం షోకేస్ ముందు నిల్చుని, చెవులు కొరుక్కున్న పాపానికే పట్టుబడిపోయారు.

వ్యాపారంలో మంజునాథ్‌కు సహాయకులుగా జయదీప్, శివానందం అనే యిద్దరు ఉద్యోగులు పనిచేస్తున్నారక్కడ. శివానందం వృద్ధుడు. అతని తండ్రి హయాం నించీ అక్కడే పనిచేస్తూ విశ్వాసపాత్రుడిగా, అనుభవశాలిగా పేరు గడించాడు.

జయదీప్ ముప్ఫయ్యేళ్ల యువకుడు. చురుకయినవాడు. ఒకవిధంగా ఆ షాపులో సెక్యూరిటీ విధులు నిర్వహించేది అతనే! దుకాణంలోకి వచ్చేపోయే కస్టమర్లపై నిఘా వుంచడం, మైక్రోఫోన్స్ రిసీవింగ్ సెట్లముందుకూర్చుని వారి సంభాషణలు వినడం అతని డ్యూటీ.

అతని తెలివితేటలవల్లే ఒకసారి షాపులో ఆభరణాలు పరిశీలిస్తున్నట్టు నటిస్తూ ఓ వజ్రపుటుంగరం కాజేయబోయి పట్టుబడిందో ఘరానా స్త్రీ! మరోసారి సెక్లెన్ స్వాహా చెయ్యడానికి నక్కజిత్తులు వేసిన ఓ పెద్దమనిషి రెడ్‌హాండెడ్‌గా పట్టుబడ్డాడు. మంజునాథ్‌కు జయదీప్ శక్తి సామర్థ్యాలపై పూర్తి నమ్మకం వుంది.

షాపుముందు ఫుట్‌పాత్ పక్కన కారు పార్క్ చేసి దిగాడు మంజునాథ్. సరిగ్గా అదే సమయంలో అతని దృష్టి షాపు షోకేస్ యివతల నిల్చుని ఏదో మాట్లాడు కుంటున్న ఓ వ్యక్తిమీదా, అతని పక్కనున్న అందమైన యువతిమీదా నిలిచింది.

ఆ వ్యక్తికి సుమారు నలభయ్యేళ్ళుంటాయి. ఖరీదైన సూటు. సన్నగా గీసుకున్న గడ్డం. కణతలదగ్గర నెరసిన జుత్తు.

యువతి గొప్పింటి బిడ్డలా నాజూకుగావుంది. గులాబీ రంగు ఒళ్ళు. చారడేసి కళ్ళు. కోలమొహం. అయితే ఆమెచూసే చూపుల్లోనూ, కదలికల్లోనూ ఏదో అసహజత్వం కనిపించింది మంజునాథ్‌కు. కారు అద్దాలుపైకెత్తి డోర్స్ లాక్ చేస్తూ వాళ్ళవేపే చూడసాగాడు.

ఆ వ్యక్తి ఆమె చెయ్యిపట్టుకుని, "ప్రమోదా! నేను చెప్పిన వజ్రాలషాపు ఇదే!" అంటున్నాడు. అతని కుడి చేతిలో ఓ బ్రీఫ్‌కేసుకూడా వుంది. దాన్ని గుండెకదమి పట్టుకుంటూ, "భగవంతుడి దయవల్ల మనమిక్కడికి సురక్షితంగా చేరుకున్నాం! ఇక భయపడే అవసరం లేదు. అంతా మనమనుకున్నట్లే జరుగుతుంది. పద. లోపలికెళ్ళి షాపు యజమాని మంజునాథ్‌ను కలుసుకుందాం!" అన్నాడు ఆమెకు ధైర్యం చెబుతూ.

ఆ యువతి అతని ఒక్కమాటకూ బదులివ్వడంలేదు. అసలామాటలామెకు వినిపించనట్లే శూన్యంలోకి చూస్తున్నట్లు షోకేస్‌వైపు చూస్తూ నిల్చుంది.

అతనామె భుజంమీద చెయ్యివేసి నడిపించుకుంటూ షాప్‌లోకి తీసికెళ్ళాడు. మరబొమ్మకిమల్లే యాంత్రికంగా అడుగులువేస్తూ అతనివెంట లోపలికెళ్ళింది.

వారి చర్యలు చూస్తూ అక్కడే నిలుచున్న మంజునాథ్ కి ఆ యువతి ప్రవర్తన చాలా విచిత్రంగా తోచింది. ఎవరు వాళ్లు? అతనామె కేమౌతాడు? తండ్రా? ఆలోచిస్తూ షాప్ లోకి చూశాడు.

వాళ్ళు లోపలికి ప్రవేసించగానే కౌంటరులో కూర్చున్న శివానందం వినయంగా లేచివచ్చి, "దయచేయండి, దయచేయండి! అమ్మగారి కేమయినా చూపించమంటారా" అడిగాడు నమ్రతగా.

"సారీ! మేము బేరం చెయ్యడానికి రాలేదు. మంజునాథ్ గారిని కలుసుకోడాని కొచ్చాం!" అన్నాడతను బ్రీఫ్ కేస్ గుండెకదుముకుంటూ.

"వారింకా షాపుకు రాలేదు...." శివానందం వాక్యం పూర్తికాకముందే మంజునాథ్ వడివడిగా నడుస్తూ షాపులో అడుగు పెట్టాడు.

"అదుగో, మాటల్లోనే వచ్చారు. నూరేళ్లాయుఃషు" అన్నాడు శివానందం.

మంజునాథ్ వాళ్లను పట్టించుకోనట్టు, బూట్సు టకటక చప్పుడు జేసుకుంటూ తన ఆఫీసులోకెళ్లి, ఈజీ ఛేర్ లో చతికిలబడ్డాడు. దానిపక్కనే సెక్యూరిటీ కేబిన్ లో కూర్చున్న జయదీప్ బైట మాట్లాడుకుంటున్న వారి మాటలు రిసీవింగ్ సెట్ పై వింటూనేవున్నాడు. ఆ యువతినీ, ఆ వ్యక్తినీ గమనిస్తూనే వున్నాడు.

అంతలో శివానందం మంజునాథ్ గదిలో ప్రవేశించి- "ఎవరో దక్షిణామూర్తి గారట. చాలా ముఖ్యమైన పని మీద మిమ్మల్ని కలుసుకోవాలంటున్నారు. పంపించమంటారా" అన్నాడు.

సిగిరెట్ అంటించి, "పంపించండి!" అన్నాడు మంజునాథ్.

శివానందం వెళ్ళిన రెండు నిమిషాలకు వాళ్ళిద్దరూ లోన అడుగుపెట్టారు. ఇప్పటికి ఆ వ్యక్తి చెయ్యి ఆమె భుజంమీదే వుంది. అతని సాయంలేనిదే ఆమె నడవలేదా? అనుకుంటూ తెచ్చిపెట్టుకున్న చిరునవ్వుతో లేచి, "రండి, రండి! ప్లీజ్, టేక్ యువర్ సీట్స్!" అన్నాడు మంజునాథ్.

దక్షిణామూర్తి ముందు ఆ యువతిని కూర్చోబెట్టి, తను కూర్చుని—"మంజునాథ్‌గారూ! మీ గురించీ మీ వ్యాపారం గురించీ చాలా విన్నాను. ఐతే, వ్యక్తిగతంగా కలుసుకునే అవసరం ఇప్పుడే కలిగింది. ఈ అమ్మాయి నా అన్నకూతురు. ప్రమోద. ప్రస్తుతం నేనొక వస్తువు అమ్మే ప్రయత్నంలో వున్నాను. దాన్ని కొనగలిగే కస్టమర్లను వెతికిపెట్టడంలో మీ సహాయం కావాలి మాకు. ఐతే, వీలైనంత త్వరగా ఈ పని జరగాలి. సాధ్యపడితే ఈ రోజే అమ్మకం జరిగి, డబ్బు మా చేతికందితే మరీ మంచిది!" అన్నాడు.

మంజునాథ్ సిగరెట్ చివరిదమ్ము లాగి, ఏష్‌ట్రేలో నొక్కుతూ-"ముందా వస్తువు చూపించండి! నా స్తోమతకు తగితే నేనే కొనేస్తాను. లేదా, తెలిసిన కస్టమర్లకు కబురు పెడతాను. దేశంలోని ప్రముఖ ఆభరణాల అభిమానులంతా నాకు తెలుసు. వారు సేకరించిన అనేక విలువైన వస్తువులు నా చేతులమీదే అమ్ముబడ్డాయి. అందుకు నా కమిషన్ త్రీ పర్సెంట్ తీసుకుంటాను" అన్నాడు బిజినెస్ ధోరణిలో.

దక్షిణామూర్తి తలూపి, "అలాగే!" అంటూ చేతిలో

వున్న బ్రీఫ్‌కేస్ టేబిల్ మీద పెట్టి, లాక్స్ తెరవసాగాడు.

ఆ యువతిమాత్రం బెల్లంకొట్టిన రాయిలా కూర్చునుంది. వాళ్లతో గానీ, వాళ్ల మాటలతో గానీ ఎటువంటి ప్రమేయం లేకుండా ఎదురుగావున్న గోడకేసి చూస్తోంది. ఆ అమ్మాయి పిచ్చిదైనా అయుండాలి. లేదా, చెవిటిదీ-మూగదీ అయినా అయుండాలి.

అంతలో దక్షిణామూర్తి బ్రీఫ్‌కేస్ తెరిచాడు. అందులో ఓ ఎరుపురంగు మఖమల్ పెట్టెవుంది.

దాన్ని ఇవతలికి తీసి, "మంజునాథ్‌గారూ! నేను చూపించబోతున్న అమూల్యమైన ఆ వస్తువు నిజానికి నాది కాదు. అమ్మాయి ప్రమోదే దానికి సర్వాధికారిణి. నగరంలో ఎందరో వజ్రాల వ్యాపారులున్నారు. నాకు ఎవ్వరిమీదా నమ్మకంలేదు. అందుకే మీ దగ్గరికి వచ్చాం!" అన్నాడు దక్షిణామూర్తి.

"నా పట్ల మీ కున్న సదభిప్రాయానికి థాంక్స్!" అంటూ కుతూహలంగా ఆ పెట్టెవేపు చూశాడు మంజునాథ్.

దక్షిణామూర్తి నెమ్మదిగా పెట్టెమూత పైకెత్తాడు. అంతే!

దాంట్లోవున్న వస్తువులు చూడగానే ఒక్కసారి వూపిరి ఆగినట్టు తోచింది మంజునాథ్‌కు. ఆశ్చర్యంతో అతని కళ్ళు విప్పారేయి!

# 2

పెట్టెలోపల స్వచ్ఛమైన బంగారంతో జేసిన ఓ పిచ్చుక గూడుంది. దాని మధ్య అచ్చు పిచ్చుకగుడ్ల

ఆకారంలోవున్న ఐదు వజ్రాలగుడ్లు మెరుస్తున్నాయి ధగధగ!

రంగురంగుల వజ్రాలు ఒకదాని నొకటి నేర్పుగా అతికించి, అచ్చం గుడ్ల ఆకారాల్లో రమ్యంగా తయారుజేశారు. మంజునాధ్ తన జీవితంలో రకరకాల వజ్రాలూ, ఆభరణాలూ చూశాడు. కాని, ఈ రోజు చూస్తున్న అద్భుత పనితనం అదివరకెన్నడూ చూసి ఎరగడు.

ప్రపంచంలోని ప్రముఖ ఆభరణాల చరిత్రలన్నీ అతనికి క్షుణ్ణంగా తెలుసు. ఆ గుడ్లను చూడగానే ఎప్పుడో చదివిన ఇండోనీషియా ఆభరణాల చరిత్ర లీలగా కదలాడింది అతని కళ్ళ ముందు.

కొన్నివందల సంవత్సరాల క్రితం ఇండోనీషియాలోని ఒక సంస్థానాన్ని కిట్టకచోరణ్ అనే రాజు పరిపాలించేవాడు. నాలుగు పెళ్ళిళ్లు చేసుకున్నా అతనికి సంతానం కలగలేదు. ఒక తపస్వి సలహాపై, సింగపూర్ నుండి మేలి రకానికి చెందిన వజ్రాలు తెప్పించి, వాటిని గుడ్లరూపంలో మలిపించి, బంగారు గూడులో ఉంచి రాజమందిరంలోని దేవాలయంలో, దేవతాపాదాల ముందుంచి, ప్రార్థనలు జరిపించాడు.

ఏడాది తిరక్కుండానే ఆ రాజుకు యిద్దరు కవల పిల్లలు పుట్టారు. దాంతో, ఆ మహిమ జ్ఞాపకార్థం ఆ వజ్రాలగుడ్లు ఆ మందిరంలోనే వుంచబడ్డాయి.

కొన్నేళ్ళ తరవాత అనుకోకుండా ఆ సంస్థానంలో ప్రజలు తిరుగుబాటు లేవదీశారు. ఎటుచూసినా హత్యలూ, దౌర్జన్యాలూ కొనసాగాయి. అప్పుడే మందిరంలోంచి వజ్రాలతో సహా ఆ బంగారుగూడు మాయమైంది.

తరవాత యెంత గాలించినా వాటి ఆచూకీ లభించ లేదు. ఇన్నేళ్ళ తరవాత ఆ అమూల్యసంపద యిప్పుడు మంజునాథ్ ముందు మెరుస్తోంది. భరింపరాని ఎక్సైట్ మెంట్‌తో అతని గుండె వేగంగా కొట్టుకుంటోంది. ఆ వ్యాపారంలో అతనికున్న అనుభవం వెంటనే వాటి మూల్యాన్ని కట్టేసింది.

ఎనభై లక్షలు!

అనుకోకుండా అతనిలో ఓ అనుమానం మొల కెత్తింది.

అవి నిజమైనవా? నకిలీవా?

"క్షమించాలి! వీటిని పరీక్షించడానికి మీకేమీ అభ్యంతరం లేదుకదా?" అడిగాడు దక్షిణామూర్తిని.

అతను ఇబ్బందిగా మొహం పెట్టి, "సరే, మీ ఇష్టం!" అన్నాడు.

బల్లసొరుగులోంచి డైమండ్ టెస్టర్ తీసి, పది నిమిషాలపాటు ఆ గుడ్లనీ, గూడునీ క్షుణ్ణంగా పరీక్షిం చాడు మంజునాథ్.

అన్నీ స్వచ్ఛమైనవే! మోసానికి తావులేదు!

దక్షిణామూర్తి నవ్వి "ఇప్పుడైనా అనుమానం తీరిందా?" అడిగాడు.

మంజునాథ్ సాలోచనగా తలూపి, "వీటి ఖరీదు యెంతో తెలుసా మీకు?" అడిగాడు.

"వస్తువుల విలువలూ, ఖరీదు కాలానుగుణంగా మారు తుంటాయి. వీటి విలువ కష్టమర్లే నిర్ణయిస్తారు. రసపిపాస గల వాళ్ళెవరికైనా ఇవి నచ్చితే కోటి రూపాయలు చెల్లించడానిక్కూడా వెనుదీయరు!"

"నిజమే! కాని, మార్కెట్ రేట్ ప్రకారం వీటి

మూల్యం ఎలభై లక్షలే వుంటుందని నా అంచనా!"

"కావచ్చు! మీ అనుభవాన్ని బట్టి అంచనా వేశారు. సరే, అదే వెలకు అమ్మేయ్యండి. ఈ రోజే!"

"సారీ! ఒక్క రోజులో జరిగే పని కాదిది. ఇరవై లక్షల వ్యవహారమైవుంటే, నేనే వీటిని కొనేవాణ్ణి. ఇది ఎనభై లక్షల వ్యవహారం! కస్టమర్లను వెదకవలసి వుంటుంది. ఇటువంటి వస్తువులు కొనే స్తోమత గలవాళ్ళూ, అభిరుచి గలవాళ్ళూ దేశంలో ఏడెనిమిది మందికి మించివుండరు."

"ఒప్పుకుంటాను. కాని, మేము వెంటనే వీటిని అమ్మేయాలి. ఎక్కువ రోజులు ఆగే ఓపికలేదు. డబ్బు ఈ రోజే మా చేతికందే పక్షంలో డెభైఐదు లక్షలకే అమ్మేస్తాం! ప్రమోదకు ప్రస్తుతం డబ్బు అవసరం చాలా వుంది!"

మంజునాథ్ పెదవి విరిచి "ఈ ఒక్క రోజులో అంత పెద్దబేరం కుదరడం కష్టం! మీకంతగా డబ్బు అవసరం వుంటే, నా దగ్గర వడ్డీలేకుండా లక్షరూపాయలు తీసుకోండి. బదులుగా వీటిని నా దగ్గరుంచండి. ఆ మొత్తానికి మీకు రసీదు యివ్వబడుతుంది. ఆ లోపల నేను కస్టమర్ల కోసం గాలింపు ప్రారంభిస్తాను. వారం రోజుల్లో మీ పని జేసిపెట్టగలనన్న నమ్మకం ఉంది నాకు. ఏమంటారు?" అడిగాడు.

దక్షిణామూర్తి కాసేపు ఆలోచించి—"ఏం చేస్తాం? అవసరం మాది. అలాగే కానివ్వండి" అన్నాడు.

"అన్నట్టు మరోవిషయం చెప్పడం మర్చాను."

"ఏమిటిది?"

"ఇంత విలువైన వస్తువులు నా దగ్గరుంచుకోడం సామాన్య విషయంకాదు. ఇవి మీ స్వంతమో, కాదో

నాకు తెలీదు. రుజువు చెయ్యాలి. ఇలా అడుగుతున్నందుకు ఏమీ అనుకోవద్దు. మా బిజినెస్ రూల్సు కూడా పాటించాలి కదా?"

"ఆల్ రైట్! మీకెలాంటి నిదర్శనాలు కావాలి?" అడిగాడు దక్షిణామూర్తి.

"రసీదులూ, డాక్యుమెంట్లూ మొదలైన వేవైనా వుంటే...."

"ఓ.కే! నే వెళ్లి మా లాయర్ని పిల్చుకొస్తాను. అతని దగ్గరే వున్నాయి డాక్యుమెంట్లూ, రసీదులూ!"

"అంతదూరం మీరు వెళ్లడం దేనికి? ఇక్కణ్ణించి ఫోన్ జేసి, తీసుకురమ్మంటే చాలదూ?"

దక్షిణామూర్తి రిస్టువాచీ చూసుకుని, "ఈ సమయంలో అతను కోర్టులో వుంటాడు. బిజీలాయర్. టాక్సీలో వెళ్లి తీసుకొస్తాను. అంతవరకూ ప్రమోద యిక్కడే వుంటుంది. మళ్ళీ వీటిని మోసుకెళ్లడం దేనికి? మీ దగ్గరేవుంచి, తాత్కాలికంగా రసీదు రాసివ్వండి చాలు" అన్నాడు.

మంజునాథ్ తలూపి, రిసిట్ బుక్ అందుకుని, తాత్కాలిక రసీదు రాసి అందించాడతనికి. తరవాత ఆ వజ్రాల గుడ్డను గూడులో వుంచి, గోడలోవున్న సీక్రెట్ సేఫ్‌లో దాచేశాడు.

అంతవరకూ బెల్లంకొట్టిన రాయిలా కూర్చున్న ప్రమోద భుజంతట్టి—

"అమ్మా! ప్రమోదా! ఇక నువ్వేం భయపడవద్దు. అంతా సవ్యంగా జరిగిపోతుంది. నేను గంటలోపల వచ్చేస్తాను. అంతవరకూ నువ్విక్కడే కూర్చో!" అంటూ లేచాడు దక్షిణామూర్తి.

ఆ యువతి నోటినుంచి పల్లెత్తు మాట లేదు. శూన్యంలోకి

చూస్తున్నట్టు అతనివైపు చూస్తోంది. అతను కూడా ఆమె జవాబుకోసం యెదురు చూడకుండా గబగబ గదిలోంచి వెళ్ళిపోయాడు. ఆ అమ్మాయి కన్నార్పకుండా తలుపు వైపే చూడసాగింది.

మంజునాథ్ కొద్దిగా దగ్గి, "కాఫీ, కూల్ డ్రింక్స్ ఏమైనా తీసుకుంటారా?" అడిగాడు.

ఐనా, ఆమెలో ఉలుకూ, పలుకూ లేదు! తలతిప్పి అతనివైపు చూడనైనా లేదు!

పేపర్ వెయిట్ అందుకుని, గట్టిగా బల్లమీద వాయించాడు మంజునాథ్. ఆ శబ్దానికి బైట కూర్చున్న శివానందం పరిగెత్తుకొచ్చాడుగానీ, ఆ అమ్మాయి మాత్రం శిలా ప్రతిమలా అలాగే కూర్చునుంది.

దాంతో ఆమె మూగదీ, చెవిటిదీ అయ్యుంటుందని నిశ్చయించుకున్నాడు మంజునాథ్.

# 3

గంట గడిచింది.

దక్షిణామూర్తి రాలేదు!

రెండుగంటలు దాటాయి.

ఐనా అతని ఐపులేదు!

అసహనంగా రిస్టువాచీ చూసుకున్నాడు మంజునాథ్. మధ్యాహ్నం మూడుగంటలు!

ప్రమోద యిప్పటికీ అలాగే కూర్చునుంది రాతిబొమ్మలా.

లాయర్ని పిల్చుకొస్తానని వెళ్ళిన వ్యక్తి యింకా రాలేదేం? ఏమయ్యాడు? రావడం ఆలస్యమైతే కనీసం ఫోన్ జేసి చెప్పవచ్చుగా? మరోగంట ఓపిగ్గా కాచుకున్నాడు మంజునాథ్. ఐనా, దక్షిణామూర్తి వస్తున్న జాడలేదు.

ఇక అతనిలో సహనం చచ్చిపోయింది. లేచి కాలు గాలిన పిల్లిలా గదిలో పచార్లు జెయ్యసాగాడు. ఇప్పుడు ప్రమోద కూడా కుర్చీలో అటూ ఇటూ కదులుతోంది. ఇప్పుడేం చెయ్యాలి? ఆ వస్తువులైతే వాల్ సేఫ్‌లో భద్రంగా వున్నాయి. కాని, ఈ అమ్మాయినేం చేసేది? వాళ్ల అడ్రసు కూడా తనకు తెలీదే? అడిగి తెలుసుకుందామన్నా ఆ అమ్మాయి మూగదీ, చెవిటిదీ! ఏమిటి దారి యిప్పుడు?

ఆలోచిస్తూ చటుక్కున ఆమె ముందాగాడు మంజునాథ్. ప్రమోద మొదటిసారి తలెత్తి అతనివైపు చూసింది. ఆశ్చర్యంతో మంజునాథ్ నోరు తెరుచుకుంది. ఆమె కళ్లలో కన్నీళ్ళు! బహుశా, పినతండ్రి రానందుకేమో?

"ప్రమోదా!" పిల్చాడు ఆప్యాయంగా.

అతని పెదాల కదలికవల్ల గ్రహించివుంటుంది తన పేరు ఉచ్చరించాడని. దీనంగా చూస్తూ తలూపింది.

"భయపడక! చిన్నాన్న త్వరలోనే వచ్చేస్తారు. కాస్త ఓపికపట్టు." అన్నాడు మంజునాథ్ ధైర్యం చెబుతూ.

ప్రమోద కళ్ళు తుడుచుకుని, తలుపువైపు చూడసాగింది.

సాయంత్రం ఐగుగంటలు గడిచినా దక్షిణామూర్తి జాడ లేకపోయేసరికి యిక అతనిలో ఆశా, ఓపికా నశించాయి. అతను రాకపోడానికి అనేక కారణాలు తడుతున్నాయి. ఆక్సిడెంటుకు గురై ఆస్పత్రిపాలయ్యాడేమో? లాయర్ దొరక్క అతనికోసం తిరుగుతున్నాడేమో! లేదా, ఏదైనా ప్రమాదంలో ఇరుక్కున్నాడేమో?

వెళ్లేటప్పుడు అతని అడ్రసూ, అతని లాయర్ పేరూ అడగనందుకు తనను తాను తిట్టుకున్నాడు మంజునాథ్.

చీకటి పడబోతోంది. ఇప్పుడీ అమ్మాయి నేం చెయ్యాలి? ఆమె నెలా ఓదార్చాలి? సడన్‌గా ఓ ఆలోచన తట్టి, టేబిల్ మీద టెలిఫోన్ దగ్గరికి లాక్కున్నాడు. తన యింటికి రింగ్ చేసి రిసీవరందుకున్నాడు.

అవతల పనిమనిషి విమల పలికింది.

"విమలా! మీ అమ్మగారున్నారా యింట్లో?"

"ఉన్నారండి!"

"లైన్‌లోకి రమ్మను."

రెండునిమిషాల తరవాత సద్గుణ కంఠం వినిపించింది.

"టికెట్లు రిజర్వ్ చేయించాను. త్వరగా వచ్చేయండి."

"నీ సినిమా సంగతెలా వున్నా, నేనిప్పుడో చిక్కులో యిరుక్కున్నాను. నీ సహాయం కావాలి. వెంటనే షాప్‌కు బైలుదేరి రా!"

"ఏం జరిగింది? ఎందుకలా వున్నారు?" సద్గుణ కంఠంలో ఖంగారు.

"చెబుతాను. వెంటనే వచ్చేయ్!"

పావుగంటలో వచ్చింది సద్గుణ,

"ఏమండీ, ఏం జరిగింది? యెందుకు పిలిచారు నన్ను?" అంటూ హడావుడిగా ఆఫీసులో అడుగుపెట్టింది సద్గుణ.

మంజునాథ్ ఆమెని కూర్చోమన్నట్టు సైగచేసి ముందు ప్రమోదను పరిచయం చేశాడు. తరవాత జరిగినదంతా పూసగుచ్చినట్టు వివరించి, "ఆ దక్షిణామూర్తి ఇప్పుడప్పుడే వస్తాడన్న నమ్మకం లేదు. నువ్వీమెని యింటికి తీసికెళ్ళి ధైర్యం చెబుతూవుండు. ఆ లోగా నేనతని గురించి ఆరా

తీస్తాను" అన్నాడు.

సద్గుణ భర్తను క్షుణ్ణంగా అర్థం చేసుకున్న యిల్లాలు. ఆప్యాయంగా ప్రమోద చెయ్యిపట్టుకుని లేచింది. ఆమె తన భార్య అనీ, ఆమెవెంట తమ యింటికెళ్లమని సైగల తోనూ నోటితోనూ నచ్చచెప్పాడు మంజునాథ్. ఆమె అతని సంజ్ఞలు అర్థంజేసుకుని తలూపింది.

వాళ్ళిద్దరూ బయటకెళ్ళగానే జయదీప్‌ని పిలిచి—

"నువ్వు టాక్సీలో వాళ్ళకారును వెంబడించు. ఇల్లు చేర గానే, దూరంగావుండి, ఇంటిమీద నిఘా వేసి వుంచు. వాళ్ళకేదయినా ప్రమాదం జరుగుతుందేమోనని నా మనసు కీడును శంకిస్తోంది" అన్నాడు మంజునాథ్.

జయదీప్ తలూపి బయటికి నడిచాడు.

ఏడుగంటలవరకూ అక్కడే కూర్చుని ఎదురుచూశాడు మంజునాథ్.

దక్షిణామూర్తి రాలేదు!

అతని ఆచూకీ ఎలా తెలుసుకోవాలా అని తీవ్రంగా యోచిస్తున్న అతనికిసడన్‌గా జ్ఞాపకంవచ్చాడు డిటెక్టివ్ దుర్యోధన్. వెంటనే షాపుకట్టేసి అతని ఇంటికెళ్ళా లని నిశ్చయించుకున్నాడు. వెళ్లేముందు భార్యకు ఫోన్ చేసి చెబుదామని రిసీవరెత్తి ఇంటికి రింగ్ చేశాడు.

అవతల ఫోన్ మోగుతున్నశబ్దం స్పష్టంగా వినిపిస్తోంది. కానీ ఎవ్వరూ యెత్తడంలేదు. ఆశ్చర్యం వేసింది మంజు నాథ్‌కు. అయిదునిమిషాలు ట్రైచేసినా అవతలినుంచి రెస్పాన్స్‌లేదు. వాళ్ళిక్కడనుంచి యింటికెళ్ళి గంటన్నర అయింది. సద్గుణ ప్రమోదను తీసుకుని మరెక్కడకీ పోయే ప్రసక్తిలేదు. కనీసం పనిమనిషి విమలకూడా యెందుకు యెత్తడంలేదు ఫోను? కొంపదీసి....

ఆ ఆలోచన రాగానే మంజునాథ్ గుండెలో దడ ప్రారంభమయింది. చకచక డిటెక్టివ్ దుర్యోధన్ ఇంటికి రింగ్ చేసి, రిసీవరందుకున్నాడు.

అవతల అతని అసిస్టెంట్ అర్జున్ మాట్లాడుతున్నాడు.

మంజునాథ్ తనని పరిచయం చేసుకుని, వెంటనే దుర్యోధన్‌తో మాట్లాడాలని కోరాడు. రెండు నిమిషాల తరవాత వచ్చాడు డిటెక్టివ్ లైన్‌లోకి.

మంజునాథ్ అతనికి జరిగినదంతా పూసగుచ్చినట్లు వివరించి, "ఇప్పుడు నన్నేం చెయ్యమంటారు?" అడిగాడు ఆందోళనగా.

"షాపుకట్టేసి వెంటనే ఇంటికెళ్ళండి. మేమూ అక్కడికే వస్తున్నాం!" అన్నాడు దుర్యోధన్.

## 4

కారు పోర్టికోలో ఆపగానే దిగి, గబగబ తలుపును సమీపించాడు మంజునాథ్. కాలింగ్ బెల్ వత్తడానికి లేచిన అతని చెయ్యి అప్రయత్నంగా ఆగిపోయింది. దగ్గరగా చేరవేసుంది తలుపు. మెల్లిగా తోశాడు. కిర్రుమంటూ తెరుచుకుంది. నిశ్శబ్దం!

"సద్గుణా!" పిల్చాడు.

లోపల సూదిపడితే వినిపించే నిశ్శబ్దం!

"విమలా!" పిల్చాడు గట్టిగా.

జవాబు శూన్యం!

తడబడే అడుగులతో ముందు డ్రాయింగ్ రూంలో అడుగుపెట్టాడు. అక్కడ కనిపించిన దృశ్యం అతన్ని రాతిబొమ్మను చేసింది. పనిమనిషి విమల నేలమీద తాళ్ళతో బంధించబడుంది. అరవకుండా నోట్లో గుడ్డలు

కుక్కి వున్నాయి. అతన్ని చూడగానే ఆమె కంఠం లోంచి చిత్రవిచిత్ర శబ్దాలు బయటకి వచ్చాయి.

మంజునాథ్ కళ్లలో భార్యా, ప్రమోదా తళుక్కు మన్నారు. వాళ్ళకేమయిందో అన్న ఆలోచన రాగానే విమల విషయం మరిచి, చటుక్కున వెనుదిరగబోయాడు.

అంతే! మెడ వెనుక ఏదో చల్లగా తగిలి అతని ఒళ్లంతా జల్లుమంది.

"కదలక! ఇది పిస్తోలు!" వెనకనించి వినిపించిందో అపరిచిత కంఠం.

మంజునాథ్ గుండె దడదడ కొట్టుకుంది.

"నెమ్మదిగా వెనక్కి తిరుగు. పిచ్చి వేషాలకు పోయావో గుండు నీ మెదడులో తిష్ట వేస్తుంది" ఆజ్ఞాపించాడతను.

ఊపిరి బిగబట్టి, నెమ్మదిగా వెనక్కి తిరిగాడు మంజునాథ్. మొహానికి మఫ్లర్ చుట్టుకుని ఓమనిషి నిల్చున్నాడు ఎదుట. చింపిరిజుత్తు, చీకికళ్ళు, దట్టమయిన కనుబొమలు, గళ్లషర్టు, నల్లపాంటు, కాళ్లకి బూట్సు.

"ఎవరునువ్వు?" అడిగాడు మంజునాథ్ అతన్ని ఓరగా చూస్తూ.

"నా వివరాలు తరవాత. ముందు అవెక్కడున్నాయో చెప్పు!"

"అంటే?"

"అర్థంకాలా? గుడ్లు!"

"కోడిగుడ్లా! వంటగదిలో ఫ్రిజ్ లో వుంటాయి. వెళ్ళి తెచ్చుకో."

"నోర్ముయ్! ఆ వజ్రాలగుడ్ల సంగతి నేనడిగేది."

"ఈమధ్య వజ్రాలుకూడా గుడ్లు పెడుతున్నాయా?

కలికాలం! అలాంటిగుడ్లు నేనింతవరకూ చూళ్లేదే?"

"పిచ్చివాగుడు కట్టిపెట్టు! నాకంతా తెలుసు. ఉదయం ఆ ముసలివెధవ బ్రీఫ్ కేసుతో నీ షాపులో అడుగు పెట్టాడు. తరవాత వట్టిచేతులతో వంటరిగా బయటి కొచ్చాడు....అవి నీదగ్గరే వున్నాయ్. మర్యాదగా వాటి నెక్కడ దాచావో చెప్పి ప్రాణాలు కాపాడుకో!"

"ముందు నా భార్యసంగతి చెప్పు!", అన్నాడు మంజు నాథ్ అసహనంగా.

"పడగ్గదిలో పడుంది."

"చంపావా?"

"లేదు. చెప్పినట్లు వినకుంటే నీకళ్లముందే నీభార్యను కాల్చి పారేస్తాను."

"నీకేం కావాలి?"

"ఆ బంగారుగూడూ, వజ్రాలగుడ్లూ!!"

"వేళాపాళా లేకుండా వాటిని జేబులో వేసుక తిరుగుతా ననుకున్నావా? అవి షాపులో ఉన్నాయి!"

"పద. నావెంట షాపుకువచ్చి, వాటిని నా కప్పగిస్తావో, నీ కళ్లముందు నీభార్య ఘోరమైన చావు చూస్తావో ఆలోచించుకోడానికి రెండు నిమిషాలు వ్యవధి యిస్తున్నాను. తేల్చుకో!" అన్నాడతను పిస్తోలూపుతూ.

క్షణం యోచించాడు మంజునాథ్. తరువాత తలూపి, "ముందు నా భార్యను చూపించు.ఆమె క్షేమంగా వుందో లేదో నాకెలా తెలుసు?" అన్నాడు.

"ఆల్ రైట్! పద మేడమీదకి" అన్నాడతను పక్కకి జరుగుతూ. మంజునాథ్ మేడమీదకి నడిచాడు. పిస్తోలుతో అతన్ని కవర్ జేస్తూ మేడమీదికెళ్ళాడతను. పైన తెరిచివున్న పడగ్గదిలో అడుగుపెట్టారిద్దరూ. లోపల

సద్గుణా, ప్రమోదా మంచంమీద తాళ్లతో కట్టిపడేసి వున్నారు. ఇద్దరి నోర్లూ గుడ్డలతో బిగదీసి వున్నాయి.

వాళ్ల నాసితిలో చూడగానే మంజునాథ్ రక్తం మరిగిపోయింది. వెనకాముందూ యోచించకుండా మెరుపులా వెనుదిరిగి, చిఱుతలా ఆ వ్యక్తిమీదకి లఘించాడు.

ఊహించని పరిణామాని కతను బెదిరిపోయి, ట్రిగ్గర్ వత్తేశాడు! గుండు తగలగానే మంజునాథ్ మొదలు నరికిన చెట్టులా కిందకూలాడు. ఆ వ్యక్తి ఖంగారుగా అతన్ని సమీపించి,వంగి పరీక్షగా చూశాడు. మంజునాథ్ చావలేదు! అతని గుండెలో దిగవలసిన గుండు కొద్దిలో తప్పి, జబ్బలో దిగింది. ఆ షాక్‌వల్లే అతనికి స్పృహ తప్పింది!

అదే క్షణంలో తలుపు దగ్గర చప్పుడు వినిపించి చటుక్కున వెనుదిరిగాడతను.

"ఢాం!"మన్న శబ్దంతో గది మారుమోగింది.

ఆ వ్యక్తి చేతిలోవున్న పిస్తోలు యెగిరి అవతల పడింది. గుండు నిప్పుకణంలా అతని మణికట్టులో దిగబడింది. కెవ్వుమంటూ కింద కూచుండిపోయాడు. తలుపు దగ్గర నిల్చున్న డిటెక్టివ్ దుర్యోధన్, అతని అసిస్టెంట్ అర్జున్ హడావుడిగా లోపలికి వచ్చి, ముందు మంజునాథ్‌ని పరిశీలించారు.

అతను బ్రతికేవున్నాడని గ్రహించి, తేలిగ్గా ఊపిరి తీసుకుంటూ, ఆడవాళ్ల దగ్గరికెళ్లు విప్పాడు దుర్యోధన్.

"ఆయనెలా వున్నారు?" అంటూ ఒక్క ఉదుటున మంచం దిగింది సద్గుణ.

"నిక్షేపంగా వున్నాడు. గుండు జబ్బలో దిగింది. ప్రాణభయం లేదు" అంటూ, ఫోన్ దగ్గరికి నడిచి,

క్రయింబ్రాంచికి రింగ్ చేసి, ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డిని సిబ్బందితో తక్షణం అక్కడికి రమ్మని కోరాడు దుర్యోధన్.

తరవాత అడుగులో అడుగు వేసుకుంటూ, దెబ్బతిని కూలబడ్డ నేరస్థుణ్ణి సమీపించి, "ఎవరు నువ్వు?" అడిగాడు తీక్షణాగా.

అతను తలెత్తి క్షణంపాటు డిటెక్టివ్‌ని రెప్ప వాల్చకుండా చూసి, జవాబివ్వకుండా తల దించుకున్నాడు.

"మర్యాదగా అడుగుతుంటే చెప్పాలి. నీలాంటి వాళ్ల చేత నోరు విప్పించే పద్ధతులు నా దగ్గరున్నాయి" అంటూ గాయపడ్డ అతని మణికట్టుమీద బూటుకాలితో గట్టిగా నొక్కాడు దుర్యోధన్.

అతను బాధతో గావుకేక పెట్టాడేగానీ నోరు విప్పలేదు. కాలు కొద్దిగా ఎత్తి గట్టిగా తొక్కాడు దుర్యోధన్.

"నన్ను నరికి ముక్కలుజేసినా, మీ ప్రశ్నలకి జవాబివ్వను" అరిచాడతను మొండిగా.

అంతలో అంబులెన్స్‌తోబాటు పోలీస్ బలగం వచ్చేసిందక్కడికి.

గాయపడ్డ నేరస్థుణ్ణి చూడగానే ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డి కళ్లు పెద్దవయ్యాయి.

"జోగేంధర్! నువ్వా?" అన్నాడు ఆశ్చర్యంగా.

"వీడు తెలుసా మీకు?"

"తెలీకేం? మా పాత అల్లుడే! వివిధ నేరాలకింద నాలుగుసార్లు ప్రభుత్వ ఆతిథ్యం స్వీకరించిన బాపతు!"

దుర్యోధన్ జరిగిందంతా ఇన్‌స్పెక్టర్‌కు వివరించాడు. మంజునాథ్‌కింకా స్పృహరాలేదు. అతన్ని జోగేంధర్ని

అంబులెన్స్‌లో ఎక్కించాడు.

"వీళ్ళని హాస్పిటల్లో అడ్మిట్ చేసి, దక్షిణామూర్తి గురించి యేమైనా తెలుస్తుందేమో వాకబ్ చేయించండి. నేను హెడ్‌క్వార్టర్స్‌లో మిమ్మల్ని కలుసుకుంటాను. లేదా ఫోన్ జేస్తాను" అన్నాడు దుర్యోధన్.

సార్జంట్ డేవిడ్‌ని, మరికొందరు కానిస్టేబుళ్ళని అక్కడే వదిలి అంబులెన్స్‌లో వెళ్ళిపోయాడు ఇన్‌స్పెక్టర్. జరుగుతున్న సంఘటనలు కళ్ళతో చూస్తూ, నోరు కదపలేక భయవిహ్వలురాలై వున్న ప్రమోద చేత వాళ్ళ వివరాలు సేకరించడానికి ప్రయత్నించసాగాడు డిటెక్టివ్ దుర్యోధన్.

అంతలో అతని అసిస్టెంట్ హడావుడిగా గదిలోకి వచ్చి "సార్, కాంపౌండ్లో క్రోటన్ మొక్కలమధ్య యెవ్వరో స్పృహతప్పి పడున్నారు" అన్నాడు.

అందరూ ఆదరాబాదరా కాంపౌండ్లోకి పరిగెత్తారు. చీకట్లో క్రోటన్ మొక్కలమధ్య బోర్లా పడున్నాడో యువకుడు. దుర్యోధన్ టార్చితీసి వెలిగించాడు. అతని తల వెనక బొప్పి కట్టివుంది. వెల్లకిలా తిప్పి, టార్చి మొహంమీద వేశాడు.

"అరె, ఇతను మా షాపులో పనిజేసే జయదీప్!" అంది సద్గుణ నివ్వెరబోతూ.

అప్పుడు జ్ఞాపకం వచ్చింది డిటెక్టివ్‌కు. మంజునాథ్ తనకు ఫోన్ జేసి, షాపునించి ప్రమోదా, సద్గుణా కార్లో వెళ్ళగానే వాళ్ళను వెంబండించడానికి జయదీప్‌ను పంపానని చెప్పిన విషయం!

కానిస్టేబుళ్ళ సాయంతో అతన్ని లోపలికి తీసికెళ్ళి, మొహంమీద నీళ్ళు చల్లారు. కాసేపటికి కళ్ళు తెరిచాడు

జయదీప్. అందర్నీ ఆశ్చర్యంగా చూస్తూ లేచి కూర్చున్నాడు.

"జయదీప్! ఏం జరిగింది? నిన్నెవరు స్పృహపో గొట్టారు?" అడిగాడు దుర్యోధన్.

"షాపునించి టాక్సీలో మేడమ్ కారు వెంబడిస్తూ యిక్కడికి చేరుకున్నాను. అప్పటికే చీకటిపడింది. వాళ్ళిద్దరూ యింట్లోకి రాగానే, నేను కాంపౌండ్లో ప్రవేశించి, క్రోటన్ గుబురుమధ్య నిల్చుని చూడసాగాను. కాసేపయాక నా వెనక ఏదో చప్పుడై చటుక్కున తిరిగి చూడబోయాను. మాడు పగిలేలా తలవెనక పడింది దెబ్బ! ఆ షాక్‌నించి కోలుకునేలోగా మరోటి పడింది. అక్కడే కూలిపోయాను" చెప్పాడు జయదీప్.

అంతలో ప్రమోద తనకు తీవ్రమైన తలనొప్పి వస్తున్నట్టు చేత్తో సైగ చేసింది. సద్గుణ ఆమెను నడిపించుకుంటూ మేడమీదికి తీసికెళ్ళింది.

సరిగ్గా అదే సమయంలో హాల్లో కాలింగ్ బెల్ మోగింది.

"ఎవరో చూడు!" అన్నాడు దుర్యోధన్, అర్జున్‌తో.

అతను బైటికెళ్ళి, ఓ యువకుణ్ని వెంటబెట్టుకొచ్చాడు. సోఫాలో ఫుల్‌సూటులో కూర్చున్న దుర్యోధన్ని చూడగానే, "మంజునాథ్ మీరేనా?" అడిగాడతను.

"కాదు. మీరెవరు?"

"నా పేరు సంతోష్! మంజునాథ్ గార్ని అర్జంటుగా కలుసుకోవాలి."

"ప్రస్తుతం ఆయన ఇంట్లో లేరు."

"నేను ప్రమోదకోసం వచ్చాను."

దుర్యోధన్ కనుబొమలు ముడిపడ్డాయి. "ప్రమోదకు

మీ రేమవుతారు?"

"ప్రస్తుతం ఏమీ కాను.

"అంటే?"

"భవిష్యత్తులో మా మధ్య బలీయమైన బంధం ఏర్పడే అవకాశముంది."

"చెప్పేది కాస్త సూటిగా చెప్పండి!"

"ప్రమోద నా బాల్యస్నేహితురాలు. ఇద్దరం కలిసి మెలిసి పెరిగాము. యవ్వనంలో అడుగుపెట్టేసరికి మా స్నేహబంధం ప్రేమబంధంగా మారింది. బాల్యంనించీ ఒకర్నొకరం క్షుణ్ణంగా అర్థం చేసుకున్నవాళ్ళం గనక జీవితంలోనూ భాగస్వాములం కావాలనుకున్నాము. అంతలో మా కుటుంబం మద్రాసు వచ్చేసింది. ఐనా, నేను ప్రమోద బాగోగులు కనుక్కుంటూనే వున్నాను.

ఆమె సుమారు రెండుకోట్ల ఆస్తికి వారసురాలు. అంతటి అపార సంపద యిచ్చిన భగవంతుడామెకు తీరని అన్యాయం చేశాడు. నోరున్నా మాట్లాడలేదు. చెవులున్నా వినలేదు. పినతండ్రి ప్రాపకంలో దయనీయంగా జీవిస్తోంది.

దక్షిణామూర్తి పరమనీచుడు. ధూర్తుడు. స్వార్థపరుడు. ఈ మధ్య ప్రమోదకు చెందవలసిన ఆభరణాలన్నీ ఒక్కొక్కటీ అమ్మడానికి ప్రయత్నిస్తున్నాడని విశ్వాసనీయ వర్గాలద్వారా తెలిసింది నాకు. ప్రమోద నోరులేని ప్రాణి. అతన్ని అడిగే దిక్కులేదు. ఆ అన్యాయాన్ని అరికట్టడానికి ఆమెకు ఒకరి సహాయం కావాలిప్పుడు.

అందుకే, నేను స్నేహితుడిగా రంగంలోకి దూకాను. ఈ రోజు ఉదయం దక్షిణామూర్తి ప్రమోదను వెంటబెట్టుకుని మంజునాథ్ గారి జువెలరీ షాప్‌లోకెళ్ళినట్టు

తెలిసింది నాకు. నేనక్కడ కెళ్ళేలోగా షాపు కట్టేశారు. దానికెదురుగావున్న జనరల్ స్టోర్‌లో కనుక్కుంటే ప్రమోద పోలికలుగల యువతి కారులో మంజునాథ్ భార్య వెంట వెళ్ళిందని తెలిసింది. అందుకే యిక్కడికి వచ్చాను" అన్నాడు సంతోష్.

"మీ రిద్దరూ ప్రేమించుకున్న మాట నిజమే అయితే, యింకా పెళ్ళెందుకు జేసుకోలేదు? ఆ విధంగా ఆమెకు తోడూ, రక్షణా లభిస్తాయి కదా?" అడిగాడు దుర్యోధన్ అనుమానంగా.

"నేనంటే దక్షిణామూర్తికి మొదటినించీ కన్నెర్ర! ప్రమోద నన్ను పెళ్ళి జేసుకుంటే ఆమె ఆస్తిమీద తన అధికారం లుప్తమౌతుందని భయం! నా మీద లేనిపోని అపోహలు సృష్టిస్తూ నానించి ఆమెను దూరం జెయ్యడానికి ప్రయత్నిస్తున్నాడు. ఈ మధ్య నేను మా లాయర్ని సంప్రదించాను.

దక్షిణామూర్తి గనక ప్రమోద ఆభరణాలు అమ్మేస్తే, ఆ డబ్బంతా ఆమె పేర బ్యాంకులో సురక్షితం జెయ్యవలసిందిగా ప్రభుత్వాన్ని అభ్యర్థించి, ఆమె ఆస్తిపాస్తులు సంరక్షించడానికి ఓ ట్రస్టీని నియమించాలని కోరతాను. చెప్పండి. ప్రమోద యెక్కడుంది? నేనామె నొక్కసారి చూడాలి" అన్నాడు సంతోష్ దీనంగా.

దుర్యోధన్ పనిమనిషి విమలని పిలిచి "ఇతన్ని పైకి తీసికెళ్ళి ప్రమోదను చూపించు" అన్నాడు.

విమల వెంట మేడమీది కెళ్ళాడు సంతోష్.

జయదీప్ సోఫాలోంచి లేచి, "ఇక నాకు సెల విస్తారా? ఒంట్లో చాలా నీరసంగా వుంది!" అన్నాడు.

దుర్యోధన్ తలూపి, "వెళ్ళి రెస్టుతీసుకో. అవసరమైతే

కబురుచేస్తాను" అన్నాడు.

జయదీప్ వెళ్ళిపోగానే దుర్యోధన్ లేచి, అడుగులో అడుగు వేసుకుంటూ మేడమీదికెళ్ళి, తలుపు దగ్గరాగి, ప్రమోదవున్న గదిలోకి చూశాడు. ఆమె మంచంమీద కూర్చునుంది. సంతోష్ ఆమె చేతులు పట్టుకుని, యేదో మాట్లాడుతున్నాడు. అతని మాటలు అరమైనట్టు తలూపు తోంది ప్రమోద. ఇప్పుడామె కళ్ళల్లో మునుపటి భయమూ, ఆందోళనా లేవు. కొత్త వెలుగు కన్పిస్తోంది.

దీన్నిబట్టి సంతోష్ ఆమెకు పూర్వపరిచయస్తుడేనన్న నమ్మకం ఏర్పడింది డిటెక్టివ్‌కి.

"ప్రమోదా! యిప్పుడు నీకే ప్రమాదమూ లేదు. నా కంఠంలో ప్రాణం వుండగా నిన్నెవ్వరూ మోసం చెయ్యలేరు. నువ్విక్కడ సురక్షితంగా వున్నావ్. ఇక రెస్టు తీసుకో. నే మళ్ళీ వస్తాను" అంటూ ఆమె భుజంతట్టి బైటికి వచ్చాడు సంతోష్.

దుర్యోధన్ని చూడగానే, "ప్రమోదని వెంటబెట్టుకుని ఆ వజ్రాల దుకాణంలోకెళ్ళిన దక్షిణామూర్తి యేమయ్యాడు? ఆమెనిక్కడికెందుకు తీసుకొచ్చారు?" అడిగాడు.

"అతను మంజునాథ్‌కు అమ్మజూపిన ఆభరణాలు వాళ్ల స్వంతమేనని నిరూపించడానికి, తమ లాయర్ని పిల్చుకొస్తానని వెళ్లాడు. ఇంకా తిరిగి రాలేదు...." అంటూ జరిగిందంతా అతనికి వివరించి, "దక్షిణామూర్తి వాళ్ల ఫామిలీ లాయర్ యెవరో తెలుసా మీకు?" అడిగాడు దుర్యోధన్.

"తెలుసు. ఆయన పేరు నరోత్తమరావు. హబీబుల్లా రోడ్‌లో వుంటాడు. ఇప్పుడా ఆభరణాలెక్క

డున్నాయి?"

"షాపులో భద్రంగా వున్నాయి. ఇక్కడ దక్షిణా మూర్తికి బంధువులుగానీ, దగ్గర స్నేహితులుగానీ ఎవ్వరైనా వున్నారా?"

"లేరనే అనుకుంటాను. అతను మద్రాసు వచ్చినప్పుడల్లా ప్లాజా హోటల్లో బసచేస్తాడు. బంధువులూ, స్నేహితులూ వుండివుంటే హోటల్లో దేనికి దిగాలి?"

"అతని క్యారెక్టర్ యెటువంటిది? దురలవాట్లేమైనా వున్నాయా?"

"ఒకటీ, రెండూ కాదు. అతనికి లేని దురలవాటు లేదనే చెప్పాలి. అంత వయసొచ్చినా అతనింకా పెళ్ళి చేసుకోలేదంటే మీరాశ్చర్యపోవచ్చు. కారణం సంసార లంపలాటం తన రంగేళీ జీవితానికి అవరోధం కదా? అందుకు!"

"ఐసీ, పాపం ఆ మూగపిల్ల అండ జూసుకుని...."

"ప్రమోద పుట్టుకతో మూగదీ, చెవిటిదీ కాదు! రెండేళ్ళక్రితం వరకూ ఆమె మనలాటి మామూలు మనిషే! అప్పుడామె తలిదండ్రులు కూడా బ్రతికే వున్నారు. ఒక రోజు రాత్రి ఆ ముగ్గురూ కారులో మద్రాసు వస్తుండగా మార్గంమధ్య కారు ఏక్సిడెంట్‌కు గురై ఆమె తలిదండ్రు లిద్దరూ అక్కడికక్కడే మరణించారు.

ఆ షాక్‌తో ప్రమోద మాట పడిపోయింది. వినికిడి శక్తి కూడా హరించుకుపోయింది.... ఆ తరవాత దేశంలోని ప్రముఖ డాక్టర్లెందరో ప్రయత్నించి చూశారు. లాభం లేకపోయింది!"

సాలోచనగా తలూపాడు డిటెక్టివ్ దుర్యోధన్.

"ఇక నాకు సెలవిప్పిస్తారా? ఇప్పుడు ప్రమోద కేమీ

ప్రమాదంలేదని నాకు నమ్మకం యేర్పడింది. అవసరమైతే మళ్లీ కలుసుకుంటాను" అన్నాడు సంతోష్.

తలూపాడు దుర్యోధన్.

అతను వెళ్ళిపోగానే సద్గుణ పక్కగదిలోంచి బైటికి వచ్చి "ఆ కుర్రాడు ప్రమోదను నిజంగానే ప్రేమిస్తున్నాడంటారా?" అడిగింది.

"ఏమో చెప్పడం కష్టమే! రెండుకోట్ల ఆస్తికి ఏకైక వారసురాలైన ఒక అవిటి అమ్మాయిని ఎలాంటి వాడైనా కళ్ళుమూసుకుని గాఢంగా ప్రేమించెయ్యగలడు. ఈ రోజుల్లో నటులకేం కొదవలేదు. అందులో, ప్రేమ నటన యేమంత కష్టమైంది కూడా కాదు.... ఇక మేము వెళ్లొస్తాం! మీకేం భయంలేదు. బైట నలుగురు కానిస్టేబుళ్ళు కాపలా వుంటారు. మీ భర్త విషయంలోనూ ఆందోళన పడకండి. గుండు ప్రాణాపాయ ప్రదేశంలో తగల్లేదు" అంటూ ఆమెకు ధైర్యం చెప్పి కిందికి వచ్చాడు దుర్యోధన్.

సార్జంట్ డేవిడ్‌కు నలుగురు కానిస్టేబుళ్ళని అక్కడే కాపలావుంచి వెళ్ళమని చెప్పి, అసిస్టెంట్ అర్జున్‌తో బైటికి నడిచాడు.

"లాయర్ నరోత్తమరావు తెలుసా నీకు? టెలిఫోన్ డైరీలో అతని అడ్రస్ వుంటుంది. టాక్సీలో వెళ్లి దక్షిణామూర్తి ఈ రోజతన్ని కలుసుకున్నాడో లేదో వాకబ్ జెయ్యి. అలాగే ప్లాజా హోటల్‌కెళ్లి ఆరా తియ్యి. నేను యింటి దగ్గరే వుంటాను" అంటూ గ్రాడ్విన్ కారెక్కి యింటికి బైలుదేరాడు దుర్యోధన్.

# 5

టెలిఫోన్ గణగణ మోగింది. రిసీవర్ అందుకుని, "హలో, డిటెక్టివ్ దుర్యోధన్ స్పీకింగ్!" అన్నాడు.

"నేనుసార్! జయదీప్ మాట్లాడుతున్నాను."

"ఏం జరిగింది? ఎక్కణ్ణించి మాట్లాడుతున్నావ్?"

"మద్రాసుకు యెనభయిమైళ్ళ దూరంలోవున్న వడి వేలూర్ నించి మాట్లాడుతున్నాను."

"అక్కడికెలా వెళ్ళావ్? ఎందుకెళ్ళావ్?" అడిగేడు దుర్యోధన్ ఆశ్చర్యంగా.

"మద్రాస్ నుండి సంతోష్‌ని వెంబడిస్తూ వచ్చాను."

"ఎందుకు? మంజునాథ్ ఇంట్లోంచి అందరికన్నా ముందే నువ్వు వెళ్ళిపోయావుకదూ?"

"ఔను! నే చెప్పబోయే విషయాలు మిమ్మల్ని చాలా ఆశ్చర్యపరచవచ్చు. సంతోష్‌ని మొదటిసారి చూడగానే నా కతనిమీద యెందుకో అనుమానం కలిగింది. కారణం, కాంపౌండులో కాపలా కాస్తున్నప్పుడు నా వెనకనుంచి తలమీద కొట్టినవ్యక్తిని స్పృహతప్పి పడిపోతూ చూసేను. అతనూ, ఇతనూ ఒక్కరే అనిపించింది!"

"పొరబడుతున్నావేమో! మరొక్కసారి ఆలోచించుకుని చెప్పు!"

"ముందు నాకూ ఇలాగే సందేహం కలిగింది. ఎప్పుడయితే నేను ఆయింట్లోంచి బయటికివచ్చానో, పోర్టికోలో ఆగివున్న సంతోష్‌కారు కనిపించింది. అనుకోకుండా కారు లోపలికి తొంగిచూశాను. బాక్‌సీట్లో కనిపించిన వస్తువు నా సందేహాన్ని పటాపంచలు చేసింది. అదేమిటో తెలుసా? లావుపాటి ఇనపకడ్డీ! దాంతో నే నా తలమీద దెబ్బతీసి వుంటాడు."

"సంతోష్ ఇప్పుడెక్కడున్నాడు?"

"అతని కారు ఈ ఊళ్లో ప్రవేశించగానే తిన్నగా ఊరి చివరవున్న పెద్దభవనాన్ని సమీపించింది. చీకట్లో కారు ఆపి, కాంపౌండ్ గేటు తోసుకుని లోపలికెళ్లాడు. నేను అతన్ని టాక్సీలో వెంబడిస్తూ వచ్చానిక్కడకి.

చాలా సేపు అతనికోసం వైట్ చేస్తూ టాక్సీలో కూర్చున్నాను. ఎంతకీ తిరిగిరాకపోయే సరికి ఫోన్‌లో మీకీ విషయం తెలీజేద్దామని ఊళ్లోకొచ్చాను. ఇక్కడ శాంతి నివాస్ అనే లాడ్జింగ్ వుంది. అదృష్టవశాత్తూ అందులో టెలిఫోనుంది. మీరు మంజునాథ్ గారింటిలో వుంటారని అక్కడికి ఫోన్ చేస్తే, ఇంటి కెళ్ళిపోయారని చెప్పారావిడ...."

"నీలో డిటెక్టివ్‌ల కుండవలసిన లక్షణాలన్నీ పుష్కలంగా వున్నాయి. ఆల్ రైట్! నువ్వక్కడేవుండు. నేను వెంటనే బయలదేరి వస్తున్నాను" అంటూ రిసీవర్ దించి, ఫోన్‌పక్కనేవున్న నోట్‌పాడ్ మీద తాను వడివేలూర్ వెడుతున్నట్టు రాసి, ఇంటికి తాళంవేసి కారెక్కాడు డిటెక్టివ్ యుగంధర్.

వడివేలూర్ చేరడానికి రెండుగంటల పదిహేను నిమిషాలు పట్టింది.

ఊరికి దక్షిణదిశలో చిట్టచివరగా వుందా యిల్లు. దాన్ని ఇల్లనేకంటే పురాతన పద్ధతిలో కట్టిన రాజభవనం అనడం మేలు. భవనంచుట్టూ యెత్తయిన ప్రహరీగోడ. కాంపౌండ్‌లో ప్రవేశించడానికి విశాలమయిన ఇనప ఊచల గేటు. కాంపౌండ్‌లో ఏపుగా, గుబురుగా పెరిగిన చెట్లు. భవనం బయటగానీ, లోపలగానీ ఎక్కడా లైటు వెలగడము లేదు. చుట్టూ మసకచీకటి. కీచురాళ్ళ రొద.

ఇంటికి దూరంగా కీనీడలో కారాపి దిగాడు దుర్యోధన్. చుట్టూ కలయజూస్తూ గేటువైపు నడిచాడు. తెరుచుకుంటుందేమోనని కొద్దిగా తోసిచూశాడు. కీచుమంటూ తెరుచుకుంది. నెమ్మదిగా కాంపౌండ్‌లో అడుగుపెట్టాడు. చెట్లమధ్య నడుస్తూ కొద్దిదూరం వెళ్ళాడో లేదో ఎదురుగా ఓ ఆకారం కదులుతున్నట్టు కనిపించి చటుక్కున ఆగిపోయాడు.

"జయదీప్!" పిల్చాడు స్వరం తగ్గించి.

"ఎస్ సార్!" అంటూ గబగబ అతన్ని సమీపించాడు జయదీప్.

దుర్యోధన్ ఏదో అడగాలని నోరు తెరిచాడు. అదే క్షణంలో వెనక ఎవ్వరో కదిలిన చప్పుడై చటుక్కున వెనుదిరిగాడు.

అంతే, గాలిని చీలుస్తూ యేదో పైకిలేవడం, రివ్వున కిందికి రావడం వంటి శబ్దం వినిపించింది. అతను వెనక్కు తిరగడంవల్ల తలమీద పడవలసిన ఆ పిడుగుదెబ్బ అతని భుజంమీద పడింది. క్షణంపాటు ఆ భుజం విరిగిపోయినట్టు తోచిందతనికి.

అదే క్షణంలో జయదీప్ మీదకూడా మరో వ్యక్తి దాడి చేశాడు. వాళ్ళిద్దరూ ఒకర్నొకరు వాటేసుకొని కింద పడిపోయారు. తనమీద దెబ్బతీసిన వ్యక్తి చెయ్యి మరోసారి పైకి లేవగానే బూటుకాలితో అతని తొడలమధ్య శక్తికొద్దీ తన్నాడు దుర్యోధన్. అటువంటి దెబ్బ తట్టుకోవడం సామాన్యుడికి సాధ్యంగాదు. గావుకేక పెడ్తూ ఇనపకడ్డీ కిందపడేసి రెండుచేతులతో అక్కడ అదుముకున్నాడతను.

ఆ అవకాశాన్ని వదులుకోకుండా అరిచేతి అంచుతో

వాడి మెడ వెనక 'కరాటే' దెబ్బతీశాడు దుర్యోధన్. కాండం నరికిన చెట్టులా కిందకూలి స్పృహతప్పాడతను. చటుక్కున జయదీప్ వైపు చూశాడు దుర్యోధన్. వాళ్ళిద్దరూ నేలమీద పొర్లుతూ ఒకరొకర్ని కుమ్ముకుంటున్నారు.

మెరుపులా అటు పరిగెత్తాడు దుర్యోధన్. అప్పటికే ఆలశ్యమైపోయింది. ప్రమాదాన్ని పసిగట్టిన ఆ హంతకుడు నేలమీంచి స్ప్రింగులా లేచి జయదీప్ డొక్కలో తన్ని కన్నుమూసి తెరిచేలోగా చీకట్లో అదృశ్యమయ్యాడు.

"జయదీప్! ఎలా వున్నావ్?" అడిగాడు దుర్యోధన్ ఆతృతగా.

జయదీప్ గట్టిగామూలిగి, "పక్క టెముకల్లో తన్నేడు రాస్కెల్! నేను మీలా ఫయిట్ చెయ్యలేను. అనుభవంలేదు" అంటూ నెమ్మదిగా లేచికూర్చున్నాడు.

"వీళ్ళిద్దరూ సంతోష్ మనుషులేనంటావా?"

"ఏమో చెప్పలేను!" అన్నాడు జయదీప్ అతని సాయంతో లేచి నిల్చుంటూ.

"ఇంత రాత్రివేళ సంతోష్ ఇక్కడికెందుకొచ్చాడు? ఈ ఇల్లెవరిది?"

"అదే నాకూ అర్థంగావడం లేదు. కారు యింటికి దూరంగా ఆపి, అతనీయింట్లో ప్రవేశించాడంటే తప్పకుండా ఏదో నేరం చెయ్యడానికే వచ్చుంటాడనిపిస్తోంది."

"ముందా స్పృహతప్పిన వ్యక్తి ఎవ్వరో చూద్దాం రా" అన్నాడు దుర్యోధన్ నేలమీద బోర్లాపడున్న ఆగంతకుడివైపు నడుస్తూ.

జేబులోంచి సింగిల్ సెల్ టార్చితీసి, వెలిగించి, కాలితో వాణ్ణి వెల్లకిలాతిప్పి మొహంమీద వెలుగు వేశాడు, అంతకు

నుందా శాల్తీని యెక్కడో చూసినట్టే తోచిందతనికి. గబగబ వాడిజేబులు గాలించాడు. సిగరెట్ పాకెట్, మాచ్ బాక్స్, పాతపర్సు, డ్రయివింగ్ లైసెన్సూ బైట పడ్డాయి.

లైసెన్స్‌మీద వాడిఫోటో, వివరాలు వున్నాయి.

సెంజప్పన్,

తంబుచెట్టి స్ట్రీట్, డోర్ నెంబర్ 3-1-146.

అదే సమయంలో కిందపడున్న సెంజప్పన్ కొద్దిగా కదిలి, చిన్నగా మూలుగుతూ కళ్ళు తెరిచాడు. టార్చి వెలుగులో దుర్యోధన్ని చూడగానే అదిరిపడి లేచి కూర్చున్నాడు. "మ్....మీరు డిటెక్టివ్ దుర్యోధన్ కదూ?" అడిగాడు వణికే కంఠంతో.

తలూపాడు డిటెక్టివ్.

"క్షమించండి! చీకట్లో మిమ్మల్ని గుర్తించలేకపోయాను. నేనిప్పుడు నేరవృత్తిలో జీవించడంలేదు. చాలారోజుల క్రితం కేవలం రెండుసార్లు శిక్ష అనుభవించాను.ఇప్పుడా వృత్తి మాని కష్టపడి సంపాదిస్తున్నాను."

"రాళ్ళకు బదులు తలకాలయలుకొట్టి సంపాదిస్తున్నావన్నమాట!"

"ప్రమాణంచేసి చెబుతున్నా సార్! నామాట నమ్మండి. మమ్మల్ని సంతోష్ అనేవ్యక్తి ఇక్కడకాపలా కాయడానికి తీసుకొచ్చాడు. తాను లోపలికెడుతున్నాననీ, ఎవ్వరయినా వస్తే లోనికి రానివ్వకుండా అడ్డుపడమనీ చెప్పివెళ్ళాడు."

"అతను లోపలికెందుకెళ్ళాడు?"

"మాకు తెలీదు."

"మీలాగే సంతోష్‌కూడా ఎవరికోసమైనా పనిచేస్తు న్నాడా?"

"తెలీదు. కణ్ణదాసన్ అనేవ్యక్తి మమ్మల్ని పురమా యించాడు. సంతోష్ మమ్మల్నిక్కడకి తీసుకొచ్చాడు."

"కణ్ణదాసన్ ఎవరు? ఎక్కడుంటాడు?"

"మద్రాసులో! ట్రిప్లికేన్‌లో అతనికి వజ్రాల దుకాణ ముంది. అంతేగాదు, విలువయిన చరిత్రాత్మక వస్తువులు కూడా సేకరించి అమ్ముతుంటాడు,"

"పారిపోయిన నీ రెండో సహచరుడెవ్వడు?"

"వాడిగురించి నాకేం తెలియదు సార్!"

"బొంకేవంటే నాలుక చీరేస్తాను. చెప్పు యెవడు వాడు?"

"దేవుడిమీద ఒట్టేసి చెబుతున్నా సార్! వాడి గురించి నాకేం తెలీదు. కణ్ణదాసనే వాణ్ని నా వెంట సంతోష్ దగ్గరకి పంపాడు."

"వాళ్లిద్దరిలో మీ యజమాని ఎవరు?"

"కణ్ణదాసనే సార్! అతనే మాకు డబ్బిస్తానన్నాడు. నేనిప్పుడు నేరవృత్తి మానేశాన్సార్!"

"మూర్ఖుడా! నా మీద యినపకడ్డీతో దాడిజెయ్యడం నేరం కాదా?"

"తప్పయింది సార్! క్షమించండి. మిమ్మల్ని సంతోష్ శత్రువనుకున్నాను. ఇకపై యిటువంటి పొరపాట్లు చెయ్యన్సార్. ఇక నన్ను వదిలిపెట్టండి. మీకు పుణ్య ముంటుంది" అన్నాడు సెంజప్పన్ చేతులు జోడిస్తూ.

"ఆల్‌రైట్! నేను మద్రాసు వచ్చి నీ గురించి ఆరా తీయిస్తాను. నీవు చెప్పిందాంట్లో అక్షరం ముక్క పొల్లు

పోయినా, నీ చేతులుకు అరక్షణంలో అరదండాలు బిగుసుకుంటాయి. వెళ్ళి క్కాణ్నించి" అన్నాడు దుర్యోధన్ కటువుగా.

"థాంక్స్ సార్!" అంటూ లేచి, గబగబ చీకట్లో అదృశ్యమయ్యాడు సెంజప్పన్.

# 6

"జయదీప్! నువ్వు బైటే వుండు. నేను లోపలకెళ్ళి యేం జరుగుతోందో చూస్తాను. సంతోష్ యే మార్గాన లోపల ప్రవేశించాడో చూద్దాం పద!" అంటూ టార్చికి అరచెయ్యి అడ్డంపెట్టి, కొద్దిపాటి వెలుగులో ముందుకు నడిచాడు దుర్యోధన్.

భవనం సింహద్వారం మూసివుంది. దాని కటూ ఇటూ అనేక కిటికీలున్నాయి. అందులో ఓ కిటికీ రెక్కలు తెరిచివున్నాయి. దాని చువ్వలు కోసి, పైకి మడిచి వున్నాయి.

"సంతోష్ ఈ మార్గానే లోపలికెళ్ళుంటాడు. ఇలాంటి వ్యవహారాల్లో నీకట్టే అనుభవం లేదు. అందుకే నువ్వు బైట వుండి, నే వెళ్ళాక సంతోష్ బైటికి వస్తే నిలేసి నన్ను కేకెయ్యి!" అంటూ కిటికీ ఊచ అందుకుని, చేతుల మీద లేచి లోపలికి చూశాడు దుర్యోధన్.

లోపల మనిషి ఛాయలేదు. మసక చీకటి!

నెమ్మదిగా లోపలికి దూకేశాడు. అతని కాళ్ళకు రబ్బర్ బూట్సున్నా ఆ నిశ్శబ్ద నిశీధిలో ఏదో భారీ వస్తువు కిందపడ్డ శబ్దమయింది. ఊపిరి బిగబట్టి, చెవులు రిక్కించి అక్కడే కూర్చున్నాడు కాసేపు. ఎక్కడా ఏ అలికిడీ వినిపించక పోవడంతో నెమ్మదిగా లేచి ముందు

నడిచాడు. ఓ గదిలో గూర్ఖా శవం కనిపించింది. అతని గుండెలో ఈటె దించబడింది. శవాన్ని పరిశీలించాక ముందుకు నడిచాడు.

ఆ గది దాటాక హాలువచ్చింది. హాలుమధ్య చాలా తక్కువ ఓల్టేజ్ బల్బు వెలుగుతోంది గుడ్డిగా. లంకంత ఇల్లు అది. కిందా మీదా అనేక గదులున్నాయి. హాలు మధ్య పైకెళ్ళడానికి విశాలమయిన మెట్లున్నాయి. హాలు చుట్టూవున్న గదులముందు ఆగుతూ లోపల యేవయినా శబ్దాలు వినిపిస్తాయేమోనని చూశాడు.

ఏ అలికిడీ లేదు. సంతోష్ యేమయ్యాడు? ఇంత పెద్ద యింట్లో మనిషి ఛాయలేదేమిటి? ఆలోచిస్తూ పిల్లిలాగా మెట్లవైపు నడిచాడు.

మేడమీదున్న గదులన్నీ చూసుకుంటూ, చిట్టచివర వున్న గది ముందాగాడు. ఆ గదితలుపులు మూసివున్నాయి. పిస్తోలు రెడీగా పట్టుకుని మునివేళ్లతో తోసిచూశాడు. సవ్వడికాకుండా తెరుచుకున్నాయి. లోపల చీకటి! గదిలో యెవ్వరో వున్నట్టు గట్టిగా ఉఛ్వాస నిశ్వాసలు వినిపిస్తున్నాయి. యెవరు? హంతకుడా?

ఠెంగున లోనికి గెంతి, గోడకి అతుక్కుపోయాడు. ఎటువంటి ప్రతిఘటన జరక్కపోయేసరికి యెడంచేతిలో వున్న టార్చిబటన్ వత్తాడు. ఆ కాంతిలో కనిపించిన దృశ్యం అతన్ని చకితుణ్ని చేసింది!

ఓ పక్క మంచం. ఆ మంచంమీద బోర్లాపడున్నాడో వ్యక్తి ఫుల్‌సూటులో. మంచాన్ని సమీపించాడు. కుంభకర్ణుడిలా నిద్రపోతున్నాడతను. కుదిపి చూశాడు. అతనిలో చలనంలేదు. గట్టిగా భుజం తట్టాడు. ఐనా, అతను కళ్ళు

తెరవలేదు. అనుమానం వచ్చి కనురెప్పలు కొద్దిగా ఎత్తి చూశాడు.

బాగా మత్తు సేవించి వున్నట్టు పాలిపోయి వున్నాయి కళ్ళు! ఎవరతను? ఆలోచిస్తూ గబగబ అతని జేబులో వెదికాడు. కొన్ని కాగితాలూ, పర్సూ బైటపడ్డాయి. ఆ కాగితాల్లో ఓ విజిటింగ్ కార్డు కూడా వుంది. దానిమీద ముద్రించివున్న పేరూ, చిరునామా చూసి నిర్ఘాంత పోయాడు దుర్యోధన్.

దక్షిణామూర్తి
(లాండ్ లార్డ్)
వడివేలూర్.

ప్రమోద పినతండ్రి దక్షిణామూర్తి ఇతనేనా? ఇదేనా వాళ్ళ యిల్లు? లాయర్ని పిల్చుకొస్తానని వెళ్ళిన వ్యక్తి యిక్కడెలా వచ్చాడు? ప్రమోదనూ, వజ్రాలగుడ్డనూ మంజునాథ్ షాపులోనే వదిలి డబ్బుకూడా తీసుకో కుండా యెందుకొచ్చాడు? వచ్చినవాడు సూటుకూడా విప్పకుండా పడుకున్నాడేమిటి? తాగాడా?

ముహం మీదికి వంగి వాసన చూశాడు దుర్యోధన్. తాగినట్టు వాసనేదీ వెయ్యడంలేదు. మరి ఏమిటీ మైకం? ఆలోచిస్తూ వృథా కాలయాపన జేసేబదులు వెంటనే పోలీసుల్ని పిలిపించడం మంచిది. అనుకుంటూ టార్చి ఫోకస్ గోడలమీద వేశాడు.

తలుపుపక్కన కనిపించింది ఎలక్ట్రిక్ స్విచ్, వత్తి గదిలో లైటు వెలిగించాడు. మంచంపక్కన టీపాయ్ మీద కనిపించింది టెలిఫోన్. ముందు ఎక్ఛేంజికి ఫోన్ జేసి, లోకల్ పోలీస్ స్టేషన్‌కు కనెక్ట్ చెయ్యమని కోరాడు.

ఫోన్ చేసిన పదినిమిషాల్లో చేరుకున్నాడక్కడికి పోలీసులు!

స్థానిక సబిన్‌స్పెక్టర్ దుర్యోధన్ని చూడగానే గుర్తుపట్టి, "మీరా! మద్రాసునించి యెప్పుడొచ్చారు?" అడిగాడు ఆశ్చర్యంగా.

దుర్యోధన్ అతనికి జరిగింది పూస గుచ్చినట్టు వివరించి "గూర్ఖా శవాన్ని, స్పృహలేని దక్షిణామూర్తినీ వెంటనే మద్రాసు తరలించాలి. గూర్ఖా హత్యకు ఉపయోగించిన ఆ ఈటెమీద హంతకుడి వేలిముద్రలుంటాయి. దాన్ని కూడా వెంట తీసికెళ్లాలి. అంబులెన్స్ తెప్పించండి" అన్నాడు.

అంతలో అంబులెన్స్ వచ్చేసింది. దక్షిణామూర్తినీ, శవాన్ని ఈటెనీ దాంట్లో చేర్చారు కానిస్టేబుళ్ళు.

అప్పటికే తూరుపుదిక్కున తెలతెలవారసాగింది. సార్జంట్, ఇద్దరు కానిస్టేబుళ్లతో సహా అంబులెన్స్‌లో బయలుదేరాడు సబిన్‌స్పెక్టర్.

## 7

వాహనాలు మద్రాసు చేరగానే సరాసరి జనరల్ హాస్పిటల్ ముందు ఆపించి, దక్షిణామూర్తిని హాస్పిటల్లో చేర్పించాడు దుర్యోధన్.

డాక్టర్లు అతన్ని పరీక్షించి, పెథడిన్, మార్ఫిన్ వంటి మత్తు ఇంజక్షన్లే అతని మైకానికి కారణమనీ, ఆందోళన పడాల్సిన అవసరం లేదనీ చెప్పారు.

ఆ తరవాత క్రయింబ్రాంచి హెడ్‌క్వార్టర్స్‌కు ఫోన్ చేసి, ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డిని పిలిపించాడు దుర్యోధన్.

అతనికి జరిగిందంతా వివరించి, "గూర్ఖా శవాన్ని పోస్ట్ మార్టం జరిపించి, ఆ ఈటెమీద వేలిముద్రలు తీయించండి. సంతోష్ ఈ హత్యకు కారకుడని నా అనుమానం! నేనతని చిరునామా అడిగి తెలుసుకోనందుకు చింతిస్తున్నాను.

వడివేలూర్ నించి అతను రాత్రే వచ్చేసుంటాడు. మీ సిబ్బందిని రంగంలోకి దింపి అతనికోసం వెతికించండి. అన్నట్టు జోగేంధర్, మంజునాథ్ యెలా వున్నారు?" అడిగాడు.

"జోగేంధర్ని హాస్పిటల్ నించి డిశ్చార్జ్ జేశారు. మంజునాథ్ భుజానికి ఆపరేషన్ చేసి గుండు బయటికి తీసేశారు. అతనికి జ్వరం వచ్చింది. ఇంకా హాస్పిటల్ లోనే వున్నాడు. జోగేంధర్ని లాకప్ లో వుంచాం. ఎంత తన్నినా నోరు విప్పడంలేదు వెధవ!" అన్నాడు ఇన్ స్పెక్టర్.

"ట్రిప్లికేన్ లో నివసించే కణ్ణదాసన్ అనే వజ్రాల వ్యాపారి తెలుసా మీకు?"

"తెలీకేం? చాలా రోజుల్నించీ వాడు మా దృష్టిలో వున్నాడు. ఖరీదైన దొంగవస్తువులు సేకరించి అమ్మడంలో సిద్ధహస్తుడట. వాణ్ని రంగుచేతులతో పట్టుకోవాలని యెన్ని పథకాలు వేసినా పారడంలేదు. చాలా తెలివిగా తన వ్యవహారాలు నడుపుకుంటున్నాడు. ఆల్ రైట్. మళ్లీ వచ్చి కలుసుకుంటాను." అని, గూర్ఖా శవం వున్న అంబులెన్స్ యెక్కి వెళ్ళిపోయాడు ఇన్ స్పెక్టర్.

"పద, మంజునాథ్ ని చూద్దాం!" అంటూ జయదీప్ ను వెంటబెట్టుని ఆరో నెంబర్ వార్డువైపు నడిచాడు దుర్యోధన్.

వాళ్ళని చూడగానే మంజునాథ్ నవ్వాడు చిన్నగా. అతని మొహం పాలిపోయివుంది. జ్వరంవల్ల నీరసంగా కనిపిస్తున్నాడు. దుర్యోధన్ స్టూలుమీద కూర్చుని, అంతవరకూ జరిగిందంతా అతనికి పూసగుచ్చినట్లు వివరించాడు.

అంతా విన్న మంజునాథ్ మొహం మరీ పాలిపోయింది భయంతో. "ఆ వజ్రాలగుడ్లు దరిద్రంలా దాపురించాయి నా ప్రాణానికి. అవి నా దగ్గరకి వచ్చినప్పట్నుంచే యీ సంఘటనలు జరుగుతున్నాయి. నా మనసెందుకో కీడును శంకిస్తోంది. దేనికైనా మంచిది. ఒకసారి వాటిని చూసిరావాలి. నన్ను మీ వెంట షాపుకు తీసికెళ్ళండి" అన్నాడు ఆందోళనగా.

"ఈ సిటిలో, యింత జ్వరంతో షాపుకు వెళ్తారా? నో, నో!"

"నా మాట వినండి. వాటినొకసారి చూడందే నా మనసు శాంతించేలా లేదు. గంటక్రితమే నా భార్యా, శివానందం వచ్చి నన్ను పరామర్శించి వెళ్ళారు. ప్రమోదను యింట్లో వంటరిగా వదిలి యెందుకొచ్చావని నా భార్యని యింటికి పంపేశాను. షాపు తెరవమని శివానందానికి తాళం చెవులిచ్చి పంపాను.

ఒక్కోసారి నేను లేకున్నా అతను షాపు తెరిచి వ్యాపారం చూసుకుంటాడు. చాలా నమ్మకస్తుడు. అతన్నెందుకు పంపానా అని యిప్పుడు చింతిస్తున్నాను. ఆ ముసలాడిమీద దౌర్జన్యం జరిపి, ఆ వజ్రాలగుడ్లు ఎవరైనా యెగరేసుకుపోవచ్చు. అందుకే, ఒక్కసారి అక్కడికెళ్ళి చూడాలనుంది."

దుర్యోధన్ ఒక్కక్షణం ఆలోచించి, "ఆల్ రైట్!

నేవెళ్ళి చూస్తాను. మీరు నిశ్చింతగా వుండండి" అన్నాడు ధైర్యం చెబుతూ.

"థాంక్స్! అలాగే నా ఆఫీసులోని సీక్రెట్ సేఫ్ తెరిచి ఆ వజ్రాలగుడ్లు క్షేమంగా వున్నాయో, లేదో చూడండి. ఎనభైలక్షల సంపద పోతే నా పీకమీద కొస్తుంది. దివాలా తీస్తాను."

"ఓ.కే! నా మీద మీకంత నమ్మకమున్నందుకు థాంక్స్!" అన్నాడు దుర్యోధన్ నవ్వుతూ.

"ఎంతమాట! ప్రభుత్వానికీ, ప్రజలకూ, మీ మీద యెంత విశ్వాసం వుందో, మీకన్నా నాకే యెక్కువ తెలుసు. ఉండండి. ఆ సేఫ్ తెరుచుకునే నంబర్లు రాసిస్తాను. అలాగే, మీరక్కడికి వస్తున్నట్లు శివానందానికి ఉత్తరం రాసిస్తాను" అంటూ ఓ చీటీమీద నెంబర్లూ, వేరే కాగితంమీద వుత్తరం రాసిచ్చాడు మంజునాథ్.

దుర్యోధన్ ఆ నెంబర్లు చదివి చీటీ కాల్చిపారేశాడు. అతని దగ్గర సెలవు తీసుకుని జయదీప్‌తో బయటికి వచ్చాడు. "జయదీప్! నువ్వు ట్రిప్లికేన్ వెళ్ళి కణ్ణదాసన్ షాపులో వున్నాడో, లేదో కనుక్కో. ఈ సంఘటనలన్నిటికీ అతనే మూలకారకుడని నా అనుమానం!"

"ఓ.కే. సార్! మిమ్మల్ని మళ్ళీ యెక్కడ కలుసుకోమంటారు?"

"నా ఇంట్లో!"

జయదీప్ టాక్సీ యెక్కి వెళ్ళిపోయాడు.

కారు స్టార్ట్ జేసి, పావుగంటలో మంజునాథ్ షాపు ముందు ఆపి దిగాడు దుర్యోధన్. షాపు తెరిచేవుంది. శివానందం నిక్షేపంగా తన కౌంటరులో కూర్చునున్నాడు.

డిటెక్టివ్‌ని చూడగానే లేచి, "నమస్కారం సార్!

హాస్పిటల్ కెళ్ళి మంజునాథ్‌ను చూశారా?" అడిగాడు.

దుర్యోధన్ తలూపి, తను వచ్చిన పని చెప్పి, మంజునాథ్ రాసిచ్చిన ఉత్తరం అందించాడతనికి. శివానందం ఉత్తరం చదివి, "వెళ్ళండి. అదే వారి ఆఫీస్ రూం!" అంటూ చూపించాడు యెడంవైపు.

దుర్యోధన్ ఆఫీసులో అడుగుపెట్టి చుట్టూ కలయజూశాడు. కుడివైపు గోడలో బిగించివుంది సీక్రెట్ సేఫ్. మంజునాథ్ రాసిచ్చిన నంబర్లు తిప్పగానే, "క్లిక్"మంటూ తెరుచుకుంది లాక్!

తలుపు తెరవగానే "జిగేల్"మన్న వెలుక్కి అతని కళ్లు మూతలు పడిపోయాయి. నెమ్మదిగా కనురెప్పలు విప్పి చూశాడు. విస్మయంతో అతని కళ్ళు విప్పారాయి. అదివరకెన్నడూ చూడని చిత్రమైన గుడ్లు! వజ్రాలగుడ్లు!!

బంగారు గూడులోంచి ఓ గుడ్డు తీసి, వేళ్ల మధ్య తిప్పుతూ పరీక్షించసాగాడు. ఆ పనితనం అతన్ని చకితుణ్ని చేస్తోంది. అంతలో వెనక అడుగులశబ్దం వినిపించి, "శివానందం! గుడ్లన్నీ క్షేమంగా వున్నాయి. మంజునాథ్ అనవసరంగా భయపడుతున్నాడు" అన్నాడు.

ఐనా, వెనకనించి జవాబు రాకపోయేసరికి, నెమ్మదిగా వెనుదిరిగి చూశాడు. దిగ్భ్రాంతితో దుర్యోధన్ నోరు తెరుచుకుంది. తలుపు దగ్గర ఓ ఆజానుబాహుడు నిల్చున్నాడు. వాడిచేతిలో సూటిగా తనవైపు గురిపెట్టివున్న పిస్తోలు!

దుర్యోధన్ కనుబొమలు ముడివడ్డాయి. "ఎవరు నువ్వు? లోపలికెలా వచ్చావ్?"

"కాళ్ళు కనిపించడంలా? నడిచి వచ్చాను."

బయట శివానందం వుండగా వీడింత నిశ్శబ్దంగా యెలా

రాగలిగాడు లోపలికి? శివానందం కూర్చునే కౌంటర్ బల్లకు తప్పకుండా ప్రమాదాన్ని సూచించే అలారం బటన్ బిగించివుంటుంది. అటువంటి వ్యక్తి లోనికి వచ్చినా, అతను బటన్ వత్తి తనని దేనికి హెచ్చరించ లేదు?

"ఎత్తులు వెయ్యడానికి అనవసరంగా ఆలోచించక! బుద్ధిగా చేతులు పైకెత్తి ఆ గోడవైపు తిరిగి నిల్చో!" ఆజ్ఞాపించాడతను.

"నీ ఉద్దేశం ఏమిటి?"

"ఉద్దేశం వేరే చెప్పడం దేనికి? ఆ వజ్రాలగుడ్లకోసమే వచ్చానని తెలీడంలేదూ?"

"అవి నీ స్వంతఆస్తి అయినట్లే మాట్లాడుతున్నావే!"

"ఈ క్షణం నించీ ఈ షాపులోవున్న ప్రతి వస్తువూ నా స్వంతమే! ఊఁ, చెప్పినట్టు జెయ్" అరిచాడతను.

తాత్సారం జెయ్యకూడదు. ఇంత ఖరీదైన సంపద యెదుట వుండగా, ఒక మనిషి ప్రాణాలు తీయ్యడం వీడికి తృటిలో పని. నెమ్మదిగా చేతులు పైకెత్తాడు దుర్యోధన్. ఆ వజ్రాల గుడ్డింకా అతని చేతిలోనే వుంది. దాన్ని వేళ్ల మధ్య యిరికించి తిప్పుతూ, మెరుపులా అతని మొహం మీదికి విసిరాడు. అంతే!

రెండు సంఘటనలు ఒకేసారి జరిగాయి. ఆ వస్తువేమిటో తెలీక అతను తన కళ్లని కాపాడుకోడానికి యెడంచేత్తో మొహం దాచుకున్నాడు. మరుక్షణం అతని కుడిచెయ్యి అప్రయత్నంగా పిస్తోలు ట్రిగ్గర్ని వత్తేసింది. అలా జరుగుతుందని ముందే ఊహించిన దుర్యోధన్ తృటిలో పక్కకి తప్పుకున్నాడు. గుండు అతనికి వెంట్రుక వాసిలో మీసుకెళ్లి ఇనప్పెట్టెకి తగిలింది.

ఆ లిప్తపాటి వ్యవధిని వృధాపోనివ్వలేదు దుర్యోధన్. కాళ్ల కింద స్ప్రింగులు వున్నట్టు రివ్వున గాలిలోకి యెగిరి అతని కుడిచేతిమీద తన్నేడు. పిస్తోలు యెగిరి అవతల పడింది. క్షణం జాగుచెయ్యకుండా బూటుతో యీడ్చి అతని తొడలమధ్య తన్నేడు. గావుకేక పెడుతూ చేతులతో అక్కడ అదుముకున్నాడతను. ఇనప కడ్డీలాటి వేళ్లని అతని కళ్లలో పొడిచాడు దుర్యోధన్.

"అబ్బా!" అన్న ఆర్తనాదం. కళ్ళు మూసుకున్నాడతను.

అరచేతి అంచుని కటిక వాడికత్తిలా పైకిలేపి, అతని మెడమీద చివరిదెబ్బ తీశాడు దుర్యోధన్. అంతే! కాండం నరికిన చెట్టులా కింద కూలాడతను.

చకచక కిందపడ్డ పిస్తోలూ, వజ్రాలగుడ్డా యిన పెట్టెలో పెట్టేసి యధాప్రకారం దానికి లాక్ వేశాడు దుర్యోధన్.

లోపలింత గొడవ జరుగుతున్నా, బయట శివానందం యేం చేస్తున్నట్టు? అనుకుంటూ గబగబ బయటికెళ్లి కౌంటర్ వైపు చూశాడు. అక్కడ కనిపించిన దృశ్యం అతన్ని రాతిబొమ్మను చేసివేసింది.

శివానందం కౌంటర్ మీద తలఆనించి కూర్చునున్నాడు. అతని తలవెనక భారీవస్తువుతో కొట్టినట్టు పగిలివుంది. రక్తం వరదలా కారి వీపంతా తడిసివుంది. దగ్గరకెళ్లి పరీక్షగా చూశాడు. శివానందంలో చలనంలేదు. మరణించాడు! అప్పుడు పడింది డిటెక్టివ్ దృష్టి, కౌంటర్ బల్లకు బిగించివున్న పుష్‌బటన్ మీద.

వత్తిచూశాడు దాన్ని. బర్‌గ్లర్ అలారమ్ బిగ్గరగా మోగింది షాపులో! శివపాదం తల—వెనకవైపు పగిలి

వుంది. అంటే, హంతకుడు నింపాదిగా కౌంటరులో ప్రవేశించి, అతని వెనక నిల్చుని, తలమీద కొట్టాడన్న మాట. అలారమ్ బటన్ చేతికింత చేరువలోవుండగా హంతకుడు కౌంటరులో ప్రవేశించి తనవెనక్కి వచ్చినా శివానందం దాన్ని ఎందుకు వత్తలేదు? తాను లోపలున్నా నని తెలిసికూడా దేనికి అరవలేదు?

అంటే, హంతకుడతనికి బాగా పరిచయస్తుడైవుండాలి. అందుకే అతను కౌంటరులో ప్రవేశిస్తున్నా, తనమీద దాడిచేస్తాడని ఏమాత్రం ఊహించలేక ఆ బటన్ వత్తకుండా ఊరుకున్నాడు శివానందం! లోపల తనచేత మూర్ఛపోయిన వ్యక్తిగాక, వాడివెంట యింకెవరయినా వచ్చారా ఇక్కడికి? ఎవరు?

తీవ్రంగా యోచిస్తూ, కౌంటర్ బల్లమీదున్న టెలిఫోన్ దగ్గరకి లాక్కుని గబగబ క్రయింబ్రాంచికి రింగ్ చేశాడు దుర్యోధన్. ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డి లైన్‌లోకి రాగానే అతనికి జరిగింది వివరించి తక్షణం సిబ్బందితో బయలదేరి రమ్మని చెప్పాడు.

పదినిమిషాల్లో బాణాల్లా దూసుకువచ్చి షాపుముందు ఆగాయి పోలీస్ వాహనాలు. హడావుడిగా లోపలికి వచ్చాడు ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డి. అంతలో స్పృహతప్పిన వ్యక్తికి తెలివి వచ్చేసింది. అతని చేతులు వెనక్కి విరిచి బేడీలు బిగించారు. పదిహేను నిమిషాలు ప్రయత్నించినా వాడు తన పేరుగానీ, ఇతర వివరాలుగానీ చెప్పడానికి ససేమిరా ఒప్పుకోలేదు.

"ఇలాటివాళ్ళు మర్యాదగా నోరు విప్పరు. హెడ్ క్వార్టర్స్‌కు తీసికెళ్ళి మీ పద్ధతులుపయోగించండి" దుర్యోధన్ అన్నాడు.

అక్కడ్నుంచి తిన్నగా తన యింటికి చేరుకున్నాడు దుర్యోధన్.

అప్పటికే జయదీప్ అక్కడికివచ్చి, అతని అసిస్టెంట్ అర్జున్‌తో మాట్లాడుతూ కూర్చున్నాడు లోపల.

దుర్యోధన్ని చూడగానే అర్జున్ విష్ చేసి, "జయదీప్ అంతా చెప్పాడు. చేతిలో పనిలేక ముళ్ళమీద కూర్చున్నట్టుంది నాకు. ఏదయినా పనుంటే చెప్పండి" అన్నాడు.

"అందుకే వచ్చానిక్కడికి." అంటూ జయదీప్ వైపు తిరిగి, "నువ్వెళ్ళిన పనేమైంది?" అడిగాడు దుర్యోధన్.

"కణ్ణదాసన్ షాపులోలేడు. వాకబ్ చేశాను. ఊళ్లోనే వున్నాడుట. ఉదయమే ఎక్కడికో వెళ్ళాడుట" జయదీప్ చెప్పాడు.

"ఆల్ రైట్! అతనిసంగతి నేను చూసుకుంటాను. నువ్వెళ్ళి రెస్టుతీసుకో. అవసరమైతే పిలిపిస్తాను"అన్నాడు దుర్యోధన్.

జయదీప్ లేచి, వాళ్ళదగ్గర సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు.

"ఈరాత్రి నేను దొంగచాటుగా కణ్ణదాసన్ ఇంట్లో ప్రవేశించాలనుకుంటున్నాను. ఆ ఇంట్లో ఏదో రహస్యం దాగివుందని నా అనుమానం! ఇక నువ్వు చెయ్యవలసిన పనేమిటో చెబుతాను" అంటూ ముందుకువంగి, అసిస్టెంటుకు ఆదేశాలిచ్చాడు దుర్యోధన్.

అంతా విన్న అర్జున్ తలూపి, లేచి గబగబ బయటికి నడిచాడు.

# 8

రాత్రి ఒంటిగంట ప్రాంతంలో నల్లదుస్తులూ, కాన్వాస్ బూట్లూ తొడుక్కొని కావలసిన వస్తువులు జేబుల్లో వేసుకొని బయలుదేరడానికి సిద్ధమయ్యాడు. ఇంటికి తాళం వేసి, గ్రాబ్డిన్ కారెక్కి కదిలాడు ట్రిప్లికేన్ వైపు.

పావుగంటలో చేరుకున్నాడక్కడికి.

కణ్ణదాసన్ ఇంటికొస్త మూలాన, చిరుచీకట్లో కారాపి దిగాడు. అది సెకండ్ షో వదిలిన సమయం. వీధిలో కుక్క దిక్కు లేదు. నల్లదుస్తులు తొడుక్కోవడం వల్ల అతని ఆకారం చీకట్లో పూర్తిగా కలిసిపోతోంది. అడుగులో అడుగు వేసుకుంటూ ఇంటిని సమీపించాడు.

షాపువెనకే వుంది కణ్ణదాసన్ మేడ. తలెత్తి మేడ మీదకి చూశాడు. బాల్కనీలోంచి ఓ గదిలో వెలుగుతున్న జీరోవాట్లు కాంతి కనిపిస్తోంది మసగ్గా. బహుశా, అది పడగ్గదయి వుంటుంది. బాల్కనీ పక్కనే వుంది నీటి గొట్టం! దాన్ని సమీపించి, ముందు మట్టిలో అరచేతులు రుద్దుకొని, అందుకొన్నాడు గొట్టాన్ని.

జాగ్రత్తగా గబగబ ఎక్కసాగాడు పైకి. సగం దూరం వెళ్ళాడో లేదో, "ఢాం! ఢాం!!" అన్న చప్పుళ్లు వినిపించి ఉలిక్కిపడ్డాడు. పైన మేడమీది గదిలోంచి వినిపించాయా చప్పుళ్ళు. మరుక్షణం చావుకేక!

కన్నుమూసి తెరిచేలోగా బాల్కనీ అంచు అందుకొని ఎగిరి లోపలికి దూకాడు దుర్యోధన్.

అక్కణ్నించి ఆ గదిలోకెళ్లే తలుపు మూసుంది. తెరిచి వున్న కిటికీలోంచి చూశాడు లోపలికి. ఆశ్చర్యంతో దుర్యోధన్ కళ్ళు విప్పారాయి.

గది మధ్యలో సంతోష్ నిల్చునున్నాడు! అతని చేతిలో పిస్తోలు!! ఓ గోడవారగా మంచం! ఆ మంచం మీద రక్తపుమడుగులో కణ్ణదాసన్!!

అంతలో బయటనుంచి ఓ లావుపాటి స్త్రీ పరుగెత్తు కొచ్చిందా గదిలోకి. "ఏం జరిగింది? ఏమిటాచప్పుళ్ళు? ఎవరు కేకలేశారు?" అంది ఒగరుస్తూ. బహుశా, ఆమె కణ్ణదాసన్ భార్య అయ్యుంటుంది.

మంచంమీద నిర్జీవంగా పడున్న భర్తనీ, చేతిలో పిస్తోలుతో దిక్కులుచూస్తూ నిలుచున్న సంతోష్‌నీ చూడ గానే గుండెలు బాదుకుంటూ, "నీచుడా! కన్నకొడు కులా పెంచి పెద్దవాణ్ణి చేసిన ఆయన్ని చంపేశావా?" అంటూ పెడబొబ్బలు పెట్టసాగింది.

ఆ కేకలకు ఇద్దరు నౌఖర్లు పరిగెత్తుకొచ్చారక్కడికి. "వీణ్ణి పట్టుకోండి, కట్టేయండి. నేను పోలీసులకి ఫోన్ చేస్తాను" అంటూ ఫోన్ దగ్గరికి పరిగెత్తిందా స్త్రీ.

అంతే. నౌఖర్లు దగ్గరికి రాకముందే ఛెంగున తలుపువైపు గెంతి పరుగు లంకించాడు సంతోష్.

"పారిపోతున్నాడు. తరమండి, పట్టుకోండి" అరిచిందా స్త్రీ.

నౌఖర్లుకూడా అతని వెనకే బయటకి పరుగుతీశాడు.

సంతోష్ ఈ ఇంట్లోనే తలదాచుకుంటాడని అనుమానించాడు తను. ఆ అనుమానం తీర్చుకోడానికే యిలా వచ్చాడు. పోలీస్ బలగంతో హఠాత్తుగా రైడ్ చేస్తే దొంగదారిన అతను పారిపోవచ్చనే ఈ విధంగా రావలసి వచ్చింది. ఐతే యిటువంటి దృశ్యం కంటబడుతుందని ఎంతమాత్రం ఊహించలేదు.

నీటిగొట్టం అందుకుని గబగబ కిందికి చేరుకున్నాడు

దుర్యోధన్. ఇది చాలా పెద్దయిల్లు. ఎన్ని తలుపులు వున్నాయో, ఎన్ని కిటికీలున్నాయో, అవి ఎక్కడెక్కడున్నాయో తనకి తెలీదు. సంతోష్ యే దారిన పారిపోతాడో అంచనా వెయ్యడం కష్టం!

వెంటనే క్రయింబ్రాంచ్ హెడ్క్వార్టర్స్ కెళ్లి, ఇన్స్పెక్టర్ రాజారెడ్డిని కలుసుకోవాలి అనుకుంటూ కారుదగ్గరికి పరిగెత్తి, పది నిమిషాల్లో చేరుకున్నాడు హెడ్క్వార్టర్స్‌కు. ఇన్స్పెక్టర్ రాజారెడ్డి అప్పుడే తన బలగంతో జీప్ యెక్కుతున్నవాడల్లా దుర్యోధన్ కారు చూడగానే ఆగిపోయాడు.

"కణ్ణదాసన్ ఇంటినించి యిప్పుడే ఫోన్ వచ్చింది. సంతోష్ అతన్ని పిస్తోలుతో చంపి పారిపోయాడుట" అన్నాడు కారు దగ్గరికి వస్తూ.

దుర్యోధన్ జరిగిందంతా అతనికి పూసగుచ్చినట్టు వివరించి, "సంతోష్ కణ్ణదాసన్ పెంపుడు కొడుకని ఇప్పుడే తెలిసింది నాకు. ఐతే, పెంపుడు తండ్రిని యిలా దేనికి చంపాడో ఊహించలేకపోతున్నాను" అన్నాడు.

"అన్నట్టు మీరు హాస్పిటల్లో అడ్మిట్ జేసిన దక్షిణామూర్తి తెలివిరాగానే ఎవ్వరి మాట వినిపించుకోకుండా, టాక్సీలో మంజునాథ్ యింటికెళ్లి ప్రమోదను వెంటబెట్టుకుని వడివేలూర్ వెళ్ళిపోయాడట" అన్నాడు ఇన్స్పెక్టర్.

"ఎప్పుడు వెళ్ళాడు? ఎందుకు వెళ్ళనిచ్చారు?" అన్నాడు దుర్యోధన్ ఆశ్చర్యంగా.

"నాకు తెలిస్తేగా? సాయంత్రం మంజునాథ్ భార్య ఫోన్ జేసి చెప్పింది నాకు. ప్రమోద కూడా పినతండ్రి వెంట వెళ్లడానికి అభ్యంతరపెట్టలేదుట. అందుకే ఆమె

కూడా వాళ్లని వారించలేక పోయిందట."

చటుక్కున రిస్టువాచీ చూసుకున్నాడు దుర్యోధన్. రాత్రి మూడుగంటలు!

"మనం వెంటనే వడివేలూర్ వెళ్ళాలి. నా అసిస్టెంట్ అర్జున్ వేరే పనిమీదున్నాడు. కణగాసన్ శవాన్ని మార్చ్యురీకి పంపే పని మీ సార్జంట్ డేవిడ్ కప్పగించి, మీరు నా వెంట రండి. నా అంచనా సరైనదైతే హంతకుడు అక్కడే పట్టుబడతాడు."

ఇన్స్పెక్టర్ తలూపి, సార్జంట్ కు ఆదేశాలు జారీచేసి, దుర్యోధన్ వెంట కారెక్కాడు.

కారు వడివేలూర్ చేరడానికి తెల్లవారు జాము ఐదు గంటలయింది. దక్షిణామూర్తి ఇంటిదగ్గర కారాపి దిగారిద్దరూ. ఆ ఇల్లు ఇంకా నిశ్శబ్దంలో నిదరబోతోంది. గేటు తెరిచి కాంపౌండ్లో ప్రవేశించారు.

# 9

అప్పుడే తూరుపుదిక్కున తెలతెలవారసాగింది.

కాలింగ్ బెల్ వత్తిన యెంతో సేపటిగ్గానీ తలుపు తెరుచుకోలేదు.

దక్షిణామూర్తి వాళ్లను చూడగానే, "మీరా!" అన్నాడు ఆశ్చర్యంగా.

"హాస్పిటల్ నించి యెవరికీ చెప్పకుండా ప్రమోదను తీసుకుని యెందుకు వచ్చేశారు?" అడిగాడు ఇన్స్పెక్టర్.

కోపంతో అతని మొహం ఎర్రబడింది. "అది నా స్వంతవిషయం! మీ అనుమతి తీసుకోడానికీ, ఆజ్ఞలు పాటించడానికీ నేను మీ బానిసను కాను. ఖైదీని అంతకన్నా కాను" అన్నాడు ఆవేశంగా.

"దక్షిణామూర్తి గారూ! మీరు అనవసరంగా ఆవేశ పడుతున్నారు. ముందు లోపలికి పదండి. మీతో కొన్ని ముఖ్యవిషయాలు మాట్లాడాలి" అన్నాడు దుర్యోధన్ శాంతంగా.

"నేనిప్పుడు మీతో మాట్లాడే మూడ్‌లో లేను. దయ చేసి నన్నిలా ఒంటరిగా వదిలి వెళ్ళండి" అన్నాడు దక్షిణా మూర్తి మొహం చిట్లిస్తూ.

ఇన్‌స్పెక్టర్ ఉరిమి చూశాడతన్ని, "మిస్టర్ దక్షిణా మూర్తీ! ఇది మూడు హత్యలకు సంబంధించిన విషయం! కొద్దిగంటల క్రితమే మద్రాసులో కణ్ణదాసన్ హత్య జెయ్యబడ్డాడు. ఈ సంఘటనలతో మీకూ సంబంధం వుంది గనక, మిమ్మల్ని ప్రశ్నించే అధికారం మాకుంది. మర్యాదగా మాతో సహకరించకపోతే, నా అధికారాన్ని వినియోగించవలసి వస్తుంది జాగ్రత్త!" అన్నాడు కోపంగా.

"కణ్ణదాసన్ హత్యజెయ్యబడ్డాడా? ఎప్పుడు? ఎవరు చంపారతన్ని?" అడిగాడు దక్షిణామూర్తి నివ్వెరబోతూ.

"సంతోష్ చంపాడు!"

"అరెస్ట్ చేశారా వాణ్ని?"

"లేదు, పారిపోయాడు!"

"నాకు మొదటినించీ వాడిమీద సదభిప్రాయంలేదు. అమ్మాయి ప్రమోదను ప్రేమిస్తున్నట్టు నటిస్తూ, ఆమెను పెళ్ళిచేసుకుని, ఆ సంతా కాజేయాలని వాడి ప్రయత్నం! అదంతా ఆ తండ్రీ కొడుకుల పన్నాగం! కణ్ణదాసన్ వాడి పెంపుడు తండ్రి!

నేను వాళ్ళ ఆటలేవీ సాగనివ్వడంలేదని నా మీద కక్షగట్టారు. ప్రమోదకింకా మైనారిటీ తీరలేదు. అందుకే

నేను వాళ్ళదారి కడ్డున్నా, నన్ను చంపకుండా తాత్సారం జేస్తున్నారు. కారణం, ఇప్పుడీ ఆస్తంతా నా ఆధీనంలో వుంది. నన్ను చంపినా, మైనారిటీ తీరని ప్రమోదకా ఆస్తిరాదు. చట్టరీత్యా ఆమెను పెళ్ళి జేసుకోనూ లేదు!

అందుకే ఆమెకు మైనారిటీ తీరేవరకూ నన్ను ప్రాణాలతో వుంచదలచారేమో, ఇంతవరకూ యే హానీ తలపెట్టలేదు."

"సంతోష్ను పెంపుడుతండ్రిని చంపేంతటి కారణాలేవీ కనిపించడంలేదే? మరి అతన్ని దేనికి చంపాడంటారు?" అడిగాడు దుర్యోధన్.

"అదే నాకూ అర్థంకావడంలేదు. ఏవో కారణాలు వుండనే వుంటాయి."

"సరే, ఇప్పుడు చెప్పండి. మంజునాథ్ షాపునించి లాయర్ని పిల్చుకొస్తానని వెళ్ళిన మీరు యిక్కడికెలా వచ్చారు? స్పృహలేనిస్థితిలో యెందుకు పడున్నారు?" అడిగాడు దుర్యోధన్.

దక్షిణామూర్తి వెంటనే పలకలేదు. కాసేపు ఆలోచించి, "రండి. లోపలికి రండి. ఇక నేనెవ్వరికీ భయపడే అవసరంలేదు. అంతా చెప్పేస్తాను" అంటూ తలుపుకడ్డం తొలిగేడు.

దుర్యోధన్, ఇన్స్పెక్టర్ ఇద్దరూ లోన అడుగు పెట్టారు. మేడ మెట్లమధ్య భయాందోళనలతో వాళ్ళనే చూస్తూ నిల్చునుంది ప్రమోద.

దక్షిణామూర్తి వాళ్ళను వెంబబెట్టుకుని తన గదిలోకి తీసికెళ్ళాడు.

"కూర్చోండి" అంటూ వాళ్ళకు సోఫాలు చూపి

తను మంచంమీద కూర్చున్నాడు. ప్రమోద ఓ పక్కగా నిల్చుని వాళ్లను చూడసాగింది.

"ఆ రోజు మంజునాథ్ షాపునించి బయటికి రాగానే టాక్సీయెక్కి లాయర్ కోసం బయలుదేరాను. కొద్దిదూరం వెళ్ళాక యెవ్వరో నా టాక్సీని వెంబడిస్తున్నట్టు అనుమానం వేసింది....లాయర్ వుండే వీధిమొదట్లో నేను టాక్సీ దిగి, సందులోపడి వెళుతుండగా నా అనుమానం నిజమేనని తేలింది.

వెనకనించి నలుగురు రౌడీలు పరిగెత్తుకొచ్చి, నన్ను కొడుతూ బలవంతంగా ఓ అంబాసిడర్ కారు దగ్గరికి యీడ్చుకెళ్ళారు. అంతక్రితం నా టాక్సీని వెంబడించింది ఆ కారే!

బాక్ సీట్లో కణ్ణదాసన్ కూర్చునున్నాడు. ఏ వజ్రాల గుడ్లను సంపాదించడానికి ఇన్నాళ్ళూ అతను నన్ను బ్లాక్ మెయిల్ జేస్తున్నాడో, ఆ వజ్రాలగుడ్లతో నేనా రోజు మంజునాథ్ షాపుకెళ్ళడం తెలిసిపోయిందట అతనికి.

మా తాత ముత్తాతల కాలంలో, ఈ చుట్టుపక్కల మాకో సంస్థానం వుండేది. ఆ రోజుల్లోనే మా తాతగారు యెవరి దగ్గరో ఆ వజ్రాలగుడ్లు కొన్నారట. అది మా వంశ అమూల్య సంపదగా యెంతో జాగ్రత్తగా ఇన్నాళ్ళూ కాపాడుతూ వస్తున్నాం!

వాటి సంగతి మా అన్నగారు, అంటే ప్రమోద తండ్రిద్వారా కణ్ణదాసన్‌కు తెలిసింది. వాళ్ళిద్దరూ అప్పుడు మంచి స్నేహితులు. కణ్ణదాసన్‌ది ఈ ఊరే....

మా అన్నగారి మరణానంతరం, తన చేతిలో కీలు బొమ్మనైవున్న నన్ను బెదిరించడం ప్రారంభించాడు కణ్ణ

దాసన్. ఆ వజ్రాలగుడ్డ యివ్వమనీ, లేదా రహస్యం బయట పెట్టేస్తాననీ! అన్నగాను వాటినెక్కడ దాచి పెట్టానో నాకు తెలీదనీ, వాటికోసమే గాలిస్తున్నాననీ, దొరగ్గానే యిచ్చేస్తానని యిన్నాళ్ళూ బొంకుతూ వస్తున్నాను.

ఇక వాటిని ఇంట్లో వుంచడం ప్రమాదమని గ్రహించి మంజునాథ్ కమ్మేద్దామని అన్ని షాపుకెళ్ళాను. ఆ సంగతి కణ్ణదాసన్ కెలా తెలిసిందో తెలిసిపోయింది....

నేను లాయర్ ఇంటికెళ్ళకముందే తన మనుషులతో నన్ను కారులోకి తెప్పించి, ఇన్నాళ్ళూ తనని మోసం చేసినందుకు నన్ను నానా బూతులూ తిట్టి, ఆ వజ్రాలగుడ్డ సంగతి మర్చిపొమ్మనీ, మంజునాథ్ దగ్గర్నించి వాటి నెలాగో తాను సంపాదించుకుంటాననీ, పిచ్చివేషాలు వెయ్యకుండా బుద్ధిగా యింటికెళ్ళమనీ, మళ్ళీ మంజునాథ్ షాపులో అడుగు పెట్టవద్దనీ హెచ్చరించాడు.

నా పీక వాడి చేతిలో వుంది గనక, చచ్చినట్లు తలూపాను. అదే కారులో వాడి మనుషులు నన్ను యిక్కడికి తీసుకొచ్చి, ఏదో ఇంజక్షన్ యిచ్చి, పక్కమీద పడేసి వెళ్ళిపోయారు .... ఆ తరవాత కళ్ళు తెరచి చూస్తే హాస్పిటల్లో వున్నాను!"

కణ్ణదాసనంటే మీ రెందుకంత భయపడేవారు? అతనలా మీమీద దౌర్జన్యం జేస్తుంటే పోలీసుల సహాయం కోరకుండా ఎందుకూరుకున్నారు?" అడిగాడు దుర్యోధన్ ఆశ్చర్యంగా.

"రెండేళ్ళక్రితం మేమిద్దరం కలిసి ఓ నేరం చేశాము. స్వయంగా చెయ్యకున్నా, ఓ కిరాయిహంతకుడిచేత

చేయించాము. కణ్ణదాసన్ చచ్చాడు గనక యిప్పుడా నేరాన్ని బయటపెట్టినా, మీరు దాన్ని రుజువు చెయ్యలేరు. అందుకే యింత నిబ్బరంగా ఆ సంఘటనలన్నీ చెప్పడానికి సిద్ధమయ్యాను. ఇక వినండి...." అంటూ ప్రారంభించడానికి కంఠం సర్దుకున్నాడు దక్షిణామూర్తి.

సరిగ్గా అదేక్షణంలో తలుపుదగ్గరేదో చప్పుడై వులిక్కిపడి అటు చూశాడు ఇన్‌స్పెక్టర్. అంతే. "ఢాం! ఢాం!!" రెండుసార్లు పేలింది పిస్తోలు.

మరుక్షణం గుమ్మంలో నిల్చున్న ముసుగుమనిషి మెరుమెలా తలుపుమూసి అవతల గడియపెట్టేశాడు. గుళ్ళు రెండూ దక్షిణామూర్తి గుండెలో దిగాయి. అతని నోట్లోంచి అరుపు కూడా ఇవతలికి రాలేదు. గుండె పట్టుకుని తోసినట్టు మంచంమీంచి కింద పడిపోయాడు. అంతే!

ఊహించని విధంగా ప్రమోద కేక పెడుతూ అతన్ని సమీపించి, "చిన్నాన్నా! చిన్నాన్నా ఏమైంది? ఏమిటిదంతా?" అంటూ ఏడవసాగింది.

ఆశ్చర్యంతో ఒకరి మొహాలొకరు చూసుకున్నారిద్దరూ. తరవాత ఒక్క ఉదుటున లేచి, తలుపు దగ్గరికి పరిగెత్తి లాగి చూశారు దాన్ని. తెరుచుకోలేదు. అదే సమయంలో బయట నడవాలో రెండుసార్లు పిస్తోలు పేలిన శబ్దాలు వినిపించాయి. మరుక్షణం గావుకేక గింగురుమంది ఇల్లంతా. ఎవ్వరో దబ్బున కిందపడ్డ చప్పుడు!

"ఇంట్లో యెవ్వరూ లేరే? ఆ ముసుగుమనిషి ఎవ్వర్ని కాల్చివుంటాడు ...." ఇన్‌స్పెక్టర్ మాట పూర్తికాకముందే అవతల తలుపు గడియ తీస్తున్న చప్పుడైంది.

భళ్ళున తెరుచుకుంది తలుపు. గుమ్మంలో నిల్చున్న

అర్జున్ని చూసి నిర్ఘాంతపోయాడు ఇన్‌స్పెక్టర్. అతని చేతిలో పిస్తోళ్ళున్నాయి.

"మద్రాసునించి వాణ్ని వెంబడిస్తూ వచ్చాను. ఇక్కడికి రాగానే వాడు మొహానికి ముసుగు తొడుక్కుని యింట్లో ప్రవేశించాడు. వాడివెనక నేనూ లోనికి రావాలా, బయటేవుండి యెదురుచూడాలా అని ఇంకా ఆలోచిస్తుండగానే, లోపల పిస్తోలు కాల్పులు వినిపించాయి.

ఇంకేమీ ఆలోచించకుండా లోపలకి పరిగెత్తుకొని వచ్చాను. అదేక్షణంలో వాడీగది తలుపుమూసి గడియ పెట్టి వెనుదిరిగాడు. క్షణం వృథా చెయ్యకుండా, నా పిస్తోలు గురిపెట్టి కాల్చాను. గుళ్ళు కుడిచేతిలోనూ, తొడలోనూ దిగాయి. గావుకేక పెడుతూ కిందకూలాడు. వెంటనే వాడి చేతిలోంచి ఈ పిస్తోలు స్వాధీనం చేసుకొన్నాను" అన్నాడు అర్జున్.

ముగ్గురూ గబగబ నడవాలో కెళ్ళి చూశారు.

ఆ ముసుగుమనిషి కిందపడి మూలుగుతున్నాడు. దుర్యోధన్ వంగి, అతని మొహంమీది ముసుగు లాగేశాడు. అంతే! దిగ్భ్రాంతితో ఇన్‌స్పెక్టర్ నోరు తెరుచుకుంది.

"జయదీప్! నువ్వా?" అన్నాడు నమ్మశక్యంగాక.

"ఔను, అక్షరాలా అతనే! ఎప్పుడయితే మంజునాథ్ షాపులో శివానందం హత్య జరిగిందో అప్పుడే నా అనుమానం ఇతనిమీదికి మళ్ళింది. శివానందంవంటి అనుభవశాలి అనుమానాస్పదులు షాపులో ప్రవేశించినా, అలారమ్ బటన్ వత్తకుండా తన వెనక్కి వచ్చి దాడిచేసే వరకూ ఊరుకుంటాడా?

ఎంతో పరిచయమున్న వాడైతేనే అతను కూర్చున్న

కాంటమెలో ప్రవేశించి, మాయమాటలమధ్య అతనిపై చావుదెబ్బ తీయగలడు. అతనికంతగా పరిచయమున్న వ్యక్తి యెవరు? దేనికయినా మంచిదని యితన్నొకంట కనిపెట్టడానికి అర్జున్ని నియమించాను" అన్నాడు దుర్యోధన్.

"రాత్రి ఒంటిగంట సమయంలో ఇతను కణ్ణదాసన్ యింటికెళ్ళి చీకట్లో మొహానికి ముసుగు తొడుక్కుని, వెంటిలేటర్ గుండా ఇంట్లో ప్రవేశించాడు. అటుపిమ్మట మేడమీద పిస్తోలు పేలిన చప్పుడు వినిపించింది. కొద్దిసేపటికే ఇతను వెంటిలేటర్ ద్వారా మళ్ళీ బయటపడి, టాక్సీ యెక్కి వడివేలూర్ బయలుదేరాడు. నేనూ టాక్సీలో జాగ్రత్తగా వెంబడిస్తూ వచ్చానిక్కడికి" అన్నాడర్జున్.

"అంటే, కణ్ణదాసన్ని చంపింది సంతోష్ కాదా? మరి అతను ఇంట్లోంచి దేనికి పారిపోయాడు?" అడిగాడు ఇన్స్పెక్టర్.

"ఆ విషయాలు తరువాత. ముందు శవాన్ని, నేరస్థుడినీ హెడ్క్వార్టర్స్కు తీసికెళ్ళే ఏర్పాట్లు చెయ్యాలి. ప్రమోదకు మళ్ళీ మాటవచ్చేసింది. బహుశా, పినతండ్రి మీద కాల్పులు జరిగిన దృశ్యం కళ్ళారా చూడగానే ఆ షాక్ వల్ల కోల్పోయిన ఆమె శక్తులు తిరిగి వచ్చివుంటాయి" అంటూ లోనికి నడిచాడు దుర్యోధన్.

పినతండ్రి శవంముందుకూర్చుని ఇంకా యేడుస్తోంది ప్రమోద. "ఈ లోకంలో నాకు మిగిలిన ఒక్కగా నొక్క బంధువుకూడా నన్ను ఏకాకిని చేసి వెళ్ళిపోయాడు. రెండేళ్ళక్రితం మా అమ్మా, నాన్నా కారులో మద్రాసు వెళుతుండగా, దారిమధ్య ఓ కారు మా వెనుకనుంచి స్పీడుగావచ్చి మా కారును క్రాస్ జేసింది.

దాని డ్రయివింగ్ సీట్లో కూర్చున్న వ్యక్తిని నేను స్పష్టంగా చూశాను. అతని చేతిలో పిస్తోలుంది. మా కారు క్రాస్ చేస్తూ అతను నాన్నమీదికి కాల్పులు జరిపాడు. గుళ్ళు గురితప్పి, విండ్ స్క్రీన్ కు తగిలాయి. ఆ ఖంగారులో నాన్న చేతిలోని స్టీరింగ్ కంట్రోల్ తప్పి రోడ్డుపక్క చెట్టుకు వేగంగా గుద్దుకుంది కారు.

ముందుసీట్లో కూర్చున్న అమ్మా, నాన్న ఇద్దరూ మరణించారు. బాక్ సీట్లో కూర్చున్న నేను ఆ దృశ్యంచూసి గావుకేక పెట్టాను. అంతే. మళ్లీ నా నోటిలోంచి మాట పెగల్లేదు. ఏ శబ్దమూ వినిపించలేదు. ఇన్నాళ్ళ తరవాత నా మాటా, వినికిడిశక్తీ యిలా తిరిగి వచ్చాయో ఆశ్చర్యంగా వుంది. ఆ దృశ్యం ఇప్పటికీ నా కళ్లల్లో తిరుగుతూనే వుంటుంది. ఆ హంతకుడి రూపాన్ని నేనెప్పటికీ మర్చిపోలేను...." అంది ప్రమోద వెక్కిళ్ల మధ్య.

సడన్ గా మెరుపు మెరిసింది దుర్యోధన్ బుర్రలో.

"ఆ వ్యక్తినిచూస్తే గుర్తుపట్టగలవా?" అడిగాడు.

"బహుశా, గుర్తుపట్టగలనేమో!"

"ఇలారా!" అంటూ ఆమెను వెంటబెట్టుకుని నడవా లోకెళ్ళాడు దుర్యోధన్.

కిందపడున్న జయదీప్ ను లేపి, కూర్చోబెట్టి, "చూడు, పరీక్షగా చూడు. ఆ వ్యక్తి యితనేనా?" అడిగాడు.

ప్రమోద అతన్ని కాసేపు పరీక్షగా చూసి, "యితనే! ఆ నీచుడు ఇతనే!!" అంది దాదాపు అరుస్తూ.

# 10

క్రయింబ్రాంచి హెడ్ క్వార్టర్స్ చేరగానే జయదీప్ ను ఓ కుర్చీలోకితోసి, "చెప్పు! చిత్రహింసలు పెట్టి నిజాలు

కక్కించకనుండే బుద్ధిగా నువ్వుచేసిన నిర్వాకాలన్నీ చెప్పు!" అన్నాడు ఇన్స్పెక్టర్ రాజాగడ్డి కటువుగా.

జయదీప్ తల కిందికి వాలిపోయింది. జీవంలేని స్వరంతో చెప్పసాగేడు. "రెండేళ్ళక్రితం కణ్ణదాసన్, దక్షిణామూర్తీ కుట్రపన్ని నాకు డబ్బిచ్చి ప్రమోద తండ్రిని హత్య జేయించారు. ఆ సంతా గుప్పిట్లోకిరాగానే దక్షిణామూర్తి, కణ్ణదాసన్ కు రెండులక్షలు చెల్లించాడు ప్రతిఫలంగా!

ఆ డబ్బూ, ఆ ఊళ్ళోవున్న ఆస్తిపాస్తులు అమ్మి కణ్ణదాసన్ మద్రాసువచ్చి వజ్రాల దుకాణం తెరిచాడు. నేను విలువయిన స్మగ్లింగ్ వస్తువులు దొంగిలించి అతని కమ్మేవాణ్ని. అతనా వస్తువులను హెచ్చులాభాలకు రహస్యంగా అమ్మేకునేవాడు. మద్రాసులో పేరుపొందిన మంజునాథ్ వజ్రాల దుకాణం కొల్లగొట్టమనీ, దాంతో మనం కుబేరులమవుతామని అతనే నాకు సలహాయిచ్చాడు.

పథకంవేసి, నేర్పుగా మంజునాథ్ షాపులో ఉద్యోగము సంపాదించి, అవకాశం కోసం యెదురుచూడసాగేను. అంతలో, మొన్న అనుకోకుండా దక్షిణామూర్తీ, ప్రమోద ఆ షాపుకి రావడం జరిగింది. కేబిన్ లో కూర్చున్న నేను వాళ్ళను చూడగానే ఉలిక్కిపడ్డాను.

మైక్ లోంచి వినబడ్డ వాళ్ళ మాటలనుబట్టి దక్షిణామూర్తి విలువయిన వజ్రాలగుడ్లు అమ్మడానికే అక్కడకి వచ్చాడని తెలిసింది. ఎలాగయినా వాటిని కాజెయ్యాలని నిశ్చయించుకొన్నాను. వెంటనే కేబిన్ లోంచి కణ్ణదాసన్ కు ఫోన్ జేసి, ఆ సంగతి చెప్పాను.

లాయర్ని పిలుచుకొస్తానని దక్షిణామూర్తి బయటకెళ్ళగానే, ఆ విషయంకూడా కణ్ణదాసన్ కు చెప్పాను. ఆ

తరవాత అతను తిరిగిరాలేదు. మంజునాథ్ సాయంత్రం వరకూ ఎదురుచూసి, తన భార్యనుపిల్చి, ప్రమోద నింటికి తీసికెళ్ళమని చెప్పాడు. తరవాత వాళ్ళను వెంబడించమని నన్ను పంపించాడు.

అప్పుడే నాకో ఐడియా తట్టింది. నా అనుచరుడిచేత అతని భార్యనూ, ప్రమోదనూ లాంగదీసుకొని, వాళ్ళ ప్రాణాలు బేరంపెట్టి, ఆ వజ్రాలగుడ్లు కాజేయాలనుకొన్నాను. అనుకున్న ప్రకారం నా సహచరుడు వాళ్ళ యింట్లో ప్రవేశించి ఆడవాళ్ళను లాంగదీసుకొన్నాడు. నేను బయట క్రోటన్ పొదలమధ్య నిల్చుని చూడసాగేను....

తరవాత మంజునాథ్ వచ్చాడు. కొంతసేపటికి లోపల పిస్తోలు పేలినశబ్దం వినిపించింది. అప్పుడే డిటెక్టివ్ దుర్యోధన్ వచ్చారక్కడకి. దాంతో, నా ప్లాన్ బెడిసికొట్టిందని గ్రహించి, నాకు నేనే తలమీద కొట్టుకొని, స్పృహ తప్పినట్లు కిందపడిపోయాను....

నా మిత్రుడు పట్టుబడిపోయాడు. వాడు నోరు విప్పడని నాకు బాగా తెలుసు.

ఆ తరవాత సంతోష్ వచ్చాడు. అతనంటే నాకు మొదటినుంచీ పరమద్వేషం! ఇంట్లోంచి అతను వెళ్ళిపోగానే, మీదగ్గర సెలవు తీసుకొని నేనూ అతని వెనక బయటకివచ్చి వెంబడించాను.

సంతోష్ తిన్నగా వడివేలూర్ చేరుకున్నాడు. అంతకుముందే అక్కడ దక్షిణామూర్తి నోకంట కనిపెట్టటానికి కణ్ణదాసన్ యిద్దరు రౌడీలను నియమించాడని అతనికి తెలీదు. సంతోష్ ఆ ఇంట్లో దేనికి ప్రవేశించాడో నాకు తెలీదు. అతను కణ్ణదాసన్ పెంపుడు కొడుకే అయినా,

తండ్రిచేసే అక్రమ వ్యవహారాలతో అతనికి సంబంధం లేదు.

ఆ ఇంట్లో విలువయిన ఆభరణాలు రహస్యంగా దాచబడి వున్నాయనీ, ఆ రహస్యప్రదేశం కనుగొని, వాటిని కాజేద్దామని నాకు బుద్ధిపుట్టింది.

చడీ చప్పుడూ కాకుండా ఆ ఇల్లు చేరుకొన్నాను. ఇంట్లో ప్రవేశించిన కొద్ది సేపటికే గూర్ఖా నన్ను చూశాడు. వాణ్ని ప్రాణాలతో వుంచకూడదని గుండెలో ఈటె దింపి చంపేశాను. ఆ హత్యానేరం సంతోష్‌మీద పడు తుందని ఊహించాను....

హాస్పిటల్లో మంజునాథ్ మిమ్మల్ని పాపుకెళ్ళి ఆ వజ్రాల గుడ్లను చూపిరమ్మని, సీక్రెట్ సేఫ్ నెంబర్లు రాసి యివ్వగానే, నాలో మరో ఆశాకిరణం మెరిసింది. మీరు నన్ను కణ్ణదాసన్ షాపుకెళ్ళి అతని గురించి వాకబుచెయ్యమని పంపారు. అటు వెళ్ళినట్టు వెళ్ళి, నా సహచరుణ్ని వెంటబెట్టుకొని మీ వెనకే మంజునాథ్ షాపుకెళ్ళాను.

కౌంటరులో కూర్చున్న శివానందానికి, నా మిత్రుణ్ని మీ అసిస్టెంటుగా పరిచయంచేసి, అతను మిమ్మల్ని కలుసుకోడానికి వచ్చినట్టు లోపలకిపంపి, శివానందంతో బాతాఖానీ కొడుతూ, కౌంటరులో ప్రవేశించి, వెనక నుంచి పిస్తోలు మడమతో అతని తల పగలగొట్టాను.

అంతలో——లోపల మీరు నా మిత్రుడితో కలయబడుతున్నట్టు శబ్దాలు వినిపించాయి. వాడు మీ ముందుచితయిపోయినట్టు పసిగట్టి వెంటనే ఆక్రమించి పారిపోయాను....

వడివేలూర్‌లోని దక్షిణామూర్తి ఇంట్లో గూర్ఖా హత్యచెయ్యబడ్డట్టు తెలియగానే కణ్ణదాసన్‌కు నామీద

అనుమానం వేసింది - ఆ స్వర్ణాభరణాలు నేనొక్కడినే కాజేయడానికి ప్రయత్నిస్తున్నానేమోనని.

నన్ను పిలిపించి నానా మాటలూ అన్నాడు. అటువంటి నేరవేషాలేస్తే నా రహస్యాలన్నీ బయట పెడతానని బెదిరించాడు. దాంతో, ఆ రాత్రికి రాత్రే వాడిపని ఆఖరు చెయ్యాలని నిశ్చయించుకొన్నాను.

రాత్రి ఒంటిగంట ప్రాంతంలో, వెంటిలేటర్ గుండా ఇంటిలో ప్రవేశించి, పడగ్గదిలో నిద్రిస్తున్న కణ్ణదాసన్ ని రెండుసార్లు షూట్ చేశాను. ఆ చప్పుళ్ళకు పక్కగదిలో పడుకున్న సంతోష్ పరిగెత్తుకొచ్చాడక్కడికి. నా చేతిలో వున్న పిస్తోలు అతనివైపు విసిరి, పరుగు లంకించాను....

అట్నించి తిన్నగా వడివేలూర్ వెళ్ళి, నా రహస్యాలు తెలిసిన దక్షిణామూర్తిని కూడా తుదముట్టించాలనుకున్నాను" జయదీప్ మాట పూర్తికాకముందే సార్జంట్ డేవిడ్ లోపలికివచ్చి, "సార్! మీకోసం ఎవరో వచ్చారు" అన్నాడు ఇన్ స్పెక్టర్ తో.

"ఎవరు? లోపలకి రమ్మను" అన్నాడు ఇన్ స్పెక్టర్.

లోపలికివచ్చిన వ్యక్తిని చూడగానే అందరూ నివ్వెరబోయారు. "సంతోష్! నువ్వా!!" అన్నాడు ఇన్ స్పెక్టర్ ఆశ్చర్యంగా.

సంతోష్ తలూపి, "ఔను ఇన్ స్పెక్టర్ గారూ! రాత్రి ఎవ్వడో ముసుగుమనిషి మా ఇంట్లో ప్రవేశించి, నా తండ్రిని చంపి, పిస్తోలు నామీదకి విసిరి పారిపోయాడు. నేనింకా ఆ షాక్ లోంచి తేరుకోకముందే నా తల్లి అక్కడికివచ్చి, పిస్తోలుతో వున్న నన్ను చూసి. హత్య నేనే చేశానని అపోహపడింది.

నా కేటూ పాలుపోక, అక్కణ్ణించి పారిపోయాను,

రాత్రంతా ఒకచోట నక్కుని ఆలోచించాను. అలా పారిపోవడంవల్ల నా మీద అనుమానం యింకా బలపడుతుందనీ, మిమ్మల్ని కలుసుకుని జరిగిందంతా చెప్పి నమ్మించాలనీ ఇలా వచ్చాను" అన్నాడు.

"అదిసరే, మొన్నరాత్రి దక్షిణామూర్తి యింట్లో దొంగచాటుగా దేనికి ప్రవేశించావ్?" అడిగేడు యిన్స్పెక్టర్.

"ఆయన ప్రమోదకు చెందవలసిన ఆస్తిపాస్తులూ, ఆభరణాలూ దుర్వినియోగం చేస్తున్నాడన్న అపోహలు వ్యాపించి వుండటంవల్ల ఆయనమీద నేరం నిరూపించే ఆధారాలూ, కాగితాలూ ఏవయినా దొరుకుతాయేమోనని వెళ్ళానక్కడికి. అంతకుమించి వేరే దురుద్దేశం ఏమీ లేదు నాలో!" అన్నాడు సంతోష్ నీరసంగా.

ప్రమోద కళ్ళు జాలిగా చూస్తున్నాయతని వైపు.

—:ఐపోయింది:—

సీరియల్

# అడుగు ముందుకు వేస్తే భస్మామ్



వసుంధర

## (ఏడవ భాగము)

లలిత బియ్యే ప్యాసయ్యేవరకూ పెళ్ళిచేసుకోకూడదని అనుకొంటోంది. పెళ్ళిగురించి రామానికి అంత తొందర లేదు.

ఒకరినొకరు చూసుకోకుండా రామం, లలిత ఒక్క-రోజుగూడా ఉండలేరు. ఏదో టయిములో ప్రతిరోజూ వాళ్ళు కలుసుకుంటూనే వుంటారు.

ఇప్పుడు తను ఉద్యోగస్తుడైనా ఇంకా చేరి కొన్నిమాసాల పాటు లలితను వివాహానికి వీలులేదని రామం భయపడుతున్నాడు. ఈ విషయాన్ని లలితతో చర్చించాలని రామం ఇంటి దగ్గిర్నుంచి బయల్దేరాడు.

ఘుందుగా రామం పుస్తకాల షాపుకు వెళ్ళాడు. సాధారణంగా ఏదయినా సమాచారముంటే లలిత తను మేనేజరుకు ఉత్తరం ఇస్తుంది. ఆ రోజు అటువంటిదేమీ జరగలేదని తెలిసేక రామం కాలేజీకి వెళ్ళాడు.

కాలేజీకి వెళ్ళి తన సందేశాన్నామె కందివ్వడం అతడి కలవాటు. అయితే ఈ రోజుకూ మిగతా రోజులకూ తేడావుంది. మిగతా రోజుల్లో అయితే సాయంత్రం సమయంలో ఎక్కడ కలుసుకోవలసివుందో చెప్పడం కోసం కాలేజీకి వెళ్ళాడు. ఈరోజు ఆమెను పిలిచి అప్పటి కప్పుడు మాట్లాడాలి.

లలిత ఆరోజు కాలేజీకి రాలేదని తెలిసి రామం కంగారు పడ్డాడు. సాధారణంగా లలిత కాలేజీ మానదు. అంటే ఆమె ఆరోగ్యం సరిగా వుండివుండదు. ఆరోగ్యంగావున్న లలిత కింతలో ఏమయింది?

రామం విషయం తెలుసుకోవడానికి లలిత యింటికి వెళ్ళాడు. అతను వెళ్ళినప్పుడు లలిత తల్లి ఇంట్లోవుంది. "ఇంట్లో ఎందుకుంటుంది నాయనా? అది కాలేజీకెళ్ళింది" అందావిడ.

రామం ఆశ్చర్యపడ్డాడు. లలిత కాలేజీకి వెళ్ళలేదు. కానీ కాలేజీకని చెప్పి ఇంట్లో బయల్దేరింది. అంటే ఆమె ఎక్కడికెళ్ళింది?

అయితే తను కాలేజీనుంచే ఇక్కడకు వస్తున్నానన్న విషయం రామం ఆవిడకు చెప్పలేదు. అక్కణ్నించి అతను మళ్ళీ కాలేజీకి వెళ్ళాడు. ఈ పర్యాయం అతను లలితకు ప్రాణస్నేహితురాలుగా భావించబడే సూర్యకుమారిని కలుసుకున్నాడు.

"లలిత కాలేజీకి వచ్చింది. కానీ క్లాసులు అటెండ్

గాలేదు. ఆమెకోసం ఎవరోవస్తే అతడితో కలిసి వెళ్ళింది"
అంది సూర్యకుమారి.

"ఎవరతను?" అన్నాడు రామం ఆత్రుతగా.

"చాలా విచిత్రమైన పేరు. శ్రీకృష్ణపరమాత్మ!"
అంది సూర్యకుమారి.

రామం ఉలిక్కిపడ్డాడు. ఈ పేరు ఈ రోజునే
తాతయ్యదగ్గర విన్నాడు. తాతయ్య చెప్పిందాన్నిబట్టి
అతనాటే ప్రమాదకరమయిన వ్యక్తికాడు. కానీ అతడికి
లలితతో ఏంపని?

శ్రీకృష్ణపరమాత్మ అన్న పేరుగల మనిషి వయసులో
వున్న అందమయిన లలితను తనతో తీసుకువెళ్ళడం రామా
నికి నచ్చలేదు. కానయితే అతను పిలవగానే లలిత అత
డితో ఎందుకు వెళ్ళిందీ అని ఆలోచిస్తున్నాడు. శ్రీకృష్ణ
పరమాత్మ లలితకు ముందే తెలుసా?

"ఎలా వుంటాడా శ్రీకృష్ణపరమాత్మ?" అన్నాడు
రామం.

"చాలా అందంగా వున్నాడు. సమ్మోహనంగా నవ్వు
తాడు. చామనచాయ రంగు. వయసు పాతిక్కీ నలభైకీ
మధ్యలో ఎక్కడయినా ఉండవచ్చు. లలితకు అతను
అంతకుముందు తెలియదట. అతను ఏదో చెప్పగా కంగారు
పడి వెంటనే బయల్దేరింది...." అంది సూర్యకుమారి.

రామం లలితకోసం ఎక్కడికి వెళ్ళాలో తెలియక
ఆఖరికి వెళ్ళి తన పుస్తకాల షాపులో కూర్చున్నాడు.
అక్కడ కొన్ని గంటలుగడిపి మళ్ళీ మరోసారి కాలేజీకి
వెళ్ళాడు. లలిత మళ్ళీ కాలేజీకి రాలేదని తెలిసింది.

రామం మళ్ళీ లలిత యింటికెళ్ళాడు.

"అదింటికి ఆలస్యంగా వస్తుందిట నాయనా? ఈ

వేళ ఏదో ప్రయివేట్ క్లాసులున్నాయట" అంది లలిత తల్లి.

"ఎవరు చెప్పారు మీకీ సంగతి?"

"అదే ఫోన్ చేసి చెప్పింది."

రామం అక్కణ్ణించి బయల్దేరాడు. లలితను కల్సుకో లేక పోయినందుకు నిరుత్సాహంగా వున్నప్పటికీ అప్పటికి చేయగలిగింది లేదు. అప్పుడే అతనికి తాతయ్య చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి. ఆయన చెప్పిన ప్రకారం ఈ రోజు మధ్యాహ్నం శ్రీకృష్ణపరమాత్మ తమ యింటికి వస్తాడు.

రామం తనను తనే నిందించుకున్నాడు. ఆ శ్రీకృష్ణ పరమాత్మ తన ఇంటికివచ్చి వెళ్ళిపోయాడో? ఇంకా ఉన్నాడో? ఒకవేళ లలిత ఆయనతో పాటు తన ఇంటికి వచ్చి వెళ్ళిందేమో—తనకోసం అక్కడే ఎదురు చూస్తోం దేమో!

రామం హడావుడిగా ఇంటికి బయల్దేరాడు. అతను ఇల్లు చేరేసరికి అయిదు దాటింది. తాతయ్య అతడికి గుమ్మంలోనే స్వాగతం పలికేడు. ఇంట్లో యింకెవ్వరూ లేరు.

"శ్రీకృష్ణపరమాత్మ వచ్చాడా?" అన్నాడు రామం.

"ఆఁ! రావటమూ, వెళ్ళిపోవడమూకూడా అయింది. సమయానికి నువ్వుకూడా ఉంటావేమోనని ఆశపడ్డాను. కానీ ఇంటికి రాలేదు" విసుగ్గా అన్నాడు రామేశం.

"ఎన్నింటికి వచ్చాడా పరమాత్మ?"

"మధ్యాహ్నం పన్నెండుగంటలకు. ఆయనా, గురు వులూ కలిసి బయటకు వెళ్ళారు. మన కార్యక్రమం తేలి పోయింది. నువ్వూ గురువులూ కలిసి ఈ రాత్రే గంగా

పురానికి ప్రయాణం కావాలి. ఇందులో జాప్యం జరగ డానికి వీలులేదు" అన్నాడు రామేశం.

"ఏమిటి అర్జంటు?"

"ఆ గురువులుకోసం పోలీసులు పెద్దయెత్తున వెదుకుతున్నారు. గంగాపురంలాంటి ప్రాంతంలో తప్ప గురువులుకు రక్షణలేదు. అందువల్ల వెంటనే ప్రయాణానికి ఏర్పాటు చేయాల్సివచ్చింది."

రామం నిట్టూర్చి కుర్చీలో కూలబడ్డాడు.

"నీకో పెద్ద రహస్యం చెప్పాలి. ఆ గురువులు, శ్రీ కృష్ణపరమాత్మ వచ్చేలోగా...." అన్నాడు రామేశం.

రామం కళ్ళు మెరిశాయి. "ఏమిటది?"

"నిన్ను నమ్మకం కోసం ఆ గురువులుకు తోడుగా పంపిస్తున్నాను. తప్పితే నువ్వు కడకంటా ప్రయాణం చేయకూడదు. ఏమాత్రం వీలున్నా మధ్యలో బయల్దేరి వచ్చేయాలి. ఎలాగో గురువులు కనుగప్పి, ఆతణ్ని ప్రయాణంలో ఇరికించి నువ్వు వెనక్కు వచ్చేయాలి" అన్నాడు రామేశం.

"తాతయ్యా—మానవతా వాదానికి టాకూర్ నిన్ను ఉదాహరణగా తీసుకున్నాడని నువ్వే చెప్పావు. ఇప్పుడీ స్వార్థం ఏమిటి?" అన్నాడు రామం.

"ఇది ఆత్మహత్యా సదృశమయిన కార్యం. నువ్వు దేశంకోరుకుంటున్న పౌరుడివి. విద్యావంతుడివి. సంస్కారవంతుడివి. నీవల్ల దేశానికి చాలా ప్రయోజనాలు చేకూరగలవు. గురువులు సంఘానికి పట్టిన చీడపురుగు. వాడేమై పోయినా ఫరవాలేదు. అందువల్ల ఎవ్వరికీ నష్టంవాటిల్లదు. వాడు విజయం సాధించాడా—దేశానికి పట్టినపీడ విరగడవుతుంది. ఈ ప్రయత్నంలో వాడి ప్రాణాలుపోయాయా

అప్పుడూ సమాజానికీ వాడిపీడ వదలిపోతుంది. రెండు విధాలా దేశానికి నష్టంలేదు. కాబట్టి వాడిపనికి పుర గొల్పుతున్నాను. నువ్వు వాడిలాంటి వాడివి కాకుండా కా-వీలున్నప్పుడల్లా నువ్వు గురువుల్ని తప్పించుకుని వచ్చేటందుకు ప్రయత్నించు" అన్నాడు రామేశం గంభీరంగా.

"నువ్వు చెప్పింది కొంతవరకూ నిజమే. అయితే ఈ పనివల్ల ఉపయోగంకూడా నాకు కనబడ్డంలేదు. ఆ అపూర్వనిధి ఇప్పుడున్నవారి ఆధీనంలో ఉంటేనేం, గురువులు చేతిలో ఉంటేనేం. ఏమైనా దేశానికి ఒక్కటే గదా?" అన్నాడు రాముం.

రామేశం స్వరం తగ్గించి "అదే నేనిప్పుడు నీకు చెప్పబోతున్న రహస్యం. నేను నీకు ఉదయం చెప్పిన కథంతా నిజంగాదు. చాలావరకూ నిజమే! కానీ నిధిగురించి నేను చెప్పినది తప్పు. ఈ వ్యవహారంలో ధనలాభంలేదు. మేం చూసిన ఆలయంలో వున్నది నిధికాదు" అని ఆగిపోయేడు.

రామం కుతూహలంగా "నిధి కాకపోతే.... ఏమిటి?" అన్నాడు.

"అది చెప్పకూడదు. చెప్పను" అన్నాడు రామేశం.

"నువ్వేదో దాస్తున్నావు తాతయ్యా!" అన్నాడు రాముం బాధగా.

"అవున్నా—దాస్తున్నాను. కానీ దాచక తప్పదు. నీవు మాత్రం మధ్యలోనే ఎలాగోలా తిరిగి రావాలి...." అన్నాడు రామేశం.

"అయితే ఉదయం ఆ కథ అలా ఎందుకు చెప్పావు?"

"గురువులు ఆ కథ వింటున్నాడని తెలుసునుగాబట్టి" అన్నాడు రామేశం.

రామం ఆశ్చర్యంతో నోరు తెరిచాడు.

"అవున్నా— నేను గురువుల్ని చూశాను కానీ చూసినట్లు తెలియనివ్వలేదు. అతడా సమయానికి మనింటికి వస్తాడని శ్రీకృష్ణపరమాత్మ నాకు ముందుగానే చెప్పాడు. అందుకే కావాలని ఎక్కువగా దగ్గి నీకు కథ చెప్పాను" అన్నాడు రామేశం.

"అయితే....గురువులు వినడంకోసం మాత్రం అబద్ధమెందుకు చెప్పావు?"

"గురువులులాంటి వాడ్ని మన పనికి పురికొల్పాలంటే ఇటువంటి ఆకర్షణ వుండాలి. నేను, టాకూర్ ఆటవికుల నుంచి బయటపడినప్పుడే అనుకున్నాం— మేము చూసిన ఆ అపూర్వాలయంలో ఒక అపూర్వనిధి ఉన్నట్టు కథ సృష్టించి సాహసికులను మా కార్యానికి ఉన్ముఖులుగా తయారు చేయాలని. ఆ పథకంవల్లనే శ్రీకృష్ణపరమాత్మ కూడా రంగంలోకి దిగాడు...."

"శ్రీకృష్ణపరమాత్మ కూడా అక్కడ నిధి వున్నదని నమ్ముతున్నాడా?"

"ఆహా" అని నవ్వాడు రామేశం "అందుకే ఆయన శ్రమపడి గురువులును జైల్లోంచి విడిపించాడు. ఆ నిధిని స్వంతం చేసుకోవాలన్న తీవ్రమైన కోరికలో వున్నాడు."

"మరి టాకూర్ ఏం చేస్తున్నాడు?"

"తెలియదు. కానీ శ్రీకృష్ణపరమాత్మను అతగాడే సంపాదించాడు."

"ఈ మోసాలన్నీ యెందుకు చేస్తున్నారు? ఇందులో మీకు కలిసివచ్చేదేముంది?" అన్నాడు రామం.

"ఏమీ లేదు. ఆ కిరాతకులమీద పగ తీర్చుకోడమే! అంతే" అన్నాడు రామేశం.

*　　*　　*

"గురువులూ-నిన్ను నేను ఆ రామేశం నుంచి తప్పించి ఇక్కడికెందుకు తీసుకొచ్చానో తెలుసా?" అన్నాడు శ్రీకృష్ణపరమాత్మ.

"తెలియదు" అన్నాడు గురువులు.

"ఎవ్వరికీ తెలియకూడని ఒక పెద్ద రహస్యం నీకు చెప్పాలి."

"ఏమిటది?"

శ్రీకృష్ణపరమాత్మ తమాషాగా నవ్వాడు "రామేశం మన మనిషి కాడు. మన పనిలో ముందడుగు వేసే ముందీ విషయం నువ్వు గుర్తుంచుకోవాలి."

గురువులు బాగా ఆశ్చర్యపడ్డాడు "ఉదయం నుంచీ నేననుకున్నదంతా తారుమారు చేసేమాటలు చెబుతున్నావు నువ్వు!"

"తలచుకుంటే ఈ సృష్టినే తారుమారు చేయగల వాణ్ని నేను. కానీ యిది మాత్రం నేను చేస్తున్న తారుమారు కాదు. అర్జంటుగా నీకు నిజం చెప్పాల్సివచ్చి చెబుతున్నాను."

"అయితే నేనేం చేయాలి?" అనడిగాడు గురువులు.

"రామేశం చాలా పెద్ద ఎత్తులో వున్నాడు. నువ్వూ, నేనూ ఆ నిధి రహస్యం తెలుసుకున్నాక మనిద్దర్నీ అంతం చేసి తానొక్కడూ దాన్ననుభవించాలని అనుకుంటున్నాడు. అందుకే తన మనుమడిని నీతోపాటు పంపిస్తున్నాడు. వాడో కులాసా పురుషుడు. ఎందుకూ పనికిరాని చచ్చు మనిషి. నీకు సాయంగా రాదగ్గ మనిషి కాడు.

రామేశానికి నీ మీద మంచి నమ్మకమేర్పడిందను కుంటాను. నీ శక్తి సామర్థ్యాలమీద ఆయనకు విశ్వాస మున్నట్లుంది. నిన్ను నువ్వే రక్షించుకుంటూ తన మనుమడిని కూడా రక్షించగలవని ఆయన అభిప్రాయపడుతున్నాడు. మీ ప్రయాణపు అనుపానులు. తెలుసుకోవడంకోసమే ఆయన తన మనువడిని నీతో పంపిస్తున్నాడు. వాడు నీతో రావడంవల్ల నీకు అనవసరపు శ్రమ తప్పితే ప్రయోజన ముండదు"

"అయితే నాకే తోడూ అక్కర్లేదని చెప్పేస్తాను" అన్నాడు గురువులు.

"అలా అంటే యెలా కుదురుతుంది? నువ్వొక్కడివే వెడతానంటే రామేశం వివరాలన్నీ సరిగ్గా చెప్పడు. మనుమడు కూడా వస్తాడంటేనే తూచా తప్పకుండా అన్నీ చెబుతాడు. నీ జాగ్రత్తకోసమే రామాన్ని నీతో పంపించాలి,"

"నీ మాటలు నా కర్థం కావడంలేదు. రామంవల్ల నాకేమీ ప్రయోజనం లేదంటావ్! మళ్ళీ అతనుంటేనే నాకు జాగ్రత్తంటావ్?" అన్నాడు గురువులు విసుగ్గా.

"అదే రాజకీయం. నాకైతే అంతా అరటిపండు వలచినట్లు అర్థమవుతూనే వుంది. కానీ నీ కోసం కాస్త వివరించక తప్పదు. జరిగిన కథ కాస్త విను" అన్నాడు శ్రీకృష్ణపరమాత్మ.

"ఈ అపూర్వ నిధి గురించి నేను టాకూర్ ద్వారా విన్నాను. తనకు తెలుగురాని కారణంగా ఎక్కువ వివరాలు సేకరించలేకపోయాననీ రామేశం వద్దకు వెడితే పూర్తి వివరాలు తెలుస్తాయనీ టాకూర్ నాకు చెప్పాడు. రామేశానికీ వివరాలన్నీ నాకు చెప్పడం యిష్టంలేదు.

ఆయనా, టాకూర్ కనిసి ఈ నిధని స్వాధీనం చేసుకుందా మనుకుంటున్నారు. కానీ నేను రంగంలోకి దిగడంవల్ల వాళ్ళకోరిక ఫలించలేదు.

నీ ప్రతాపం విని నువ్వొక్కడివే ఈ నిధని సాధించుకుని రాగల దిట్టవని నేను గ్రహించాను. అందుకే యీ రోజు వుదయం రామేశం ద్వారా నీకన్ని వివరాలూ అందజేశాను. అయితే యిది ప్రమాదంతో కూడుకున్న పని. మనిషికి ధైర్యసాహసాలుంటే చాలదు. తెలివి తేటలూ, తెగింపు సమపాళ్ళలో వుంటేనే కార్యం సానుకూలమవుతుంది. అందుకు అవసరమైనది సమాచారం.

కొంత ముఖ్య సమాచారాన్ని రామేశం దాచి పెడతాడేమోనని నాకు అనుమానం వుంది. అందుకని ఆయన మనుమణ్ని కూడా నీతో పంపాలని నిర్ణయించాను. రామేశం పని పచ్చివెలక్కాయ గొంతులో పడ్డట్టయింది. ఇప్పుడాయన చచ్చినట్లు తనకు తెలిసిన మొత్తం వివరాలు నీకు చెప్పవలసి వుంది. నీకొక్కపోయినా మనవాడికైనా ఆయన కొంత సమాచారం చెప్పకపోడు. అదే మీ ఇద్దరికీ శ్రీరామ రక్షగా వుంటుంది."

"నువ్వు చాలా తెలివైన వాడివి."

"తెలివితేటలొక్కటే దేనికైనా చాలవు కాబట్టే నేను నీలాంటివాడికోసం వెతుక్కోవలసి వచ్చింది" అన్నాడు శ్రీకృష్ణపరమాత్మ.

"నన్ను జైల్లోంచి తప్పించగల తెలివితేటలున్న నీకు ఈ కార్యాన్ని సాధించే తెలివితేటల్లేవంటే నమ్మలేను. ఇందులో యింకా ఏదో రహస్యముంది" అన్నాడు గురువులు.

"అందర్నీ జైల్లోంచి తప్పించడం నావల్ల కాదు.

నేను చేయగలిగింది చేశాను. ఆ పైన నీ తెలివితేటలు, సాహసం వుపయోగపడ్డాయి. అవి లేకపోతే నిన్ను జైల్లోంచి తప్పించడం నాకు సాధ్యమయేది కాదు."

గురువులు ముఖంలో రవంత గర్వం తొంగి చూసింది. "రామేశం మన మనిషి కాడంటావ్. అంతవరకూ బాగానే వుంది. మనం అంటే నువ్వు నేనేనా యింకెవరైనా వున్నారా?"

"మంచి ప్రశ్నే వేశావు. నేను మరొకళ్ళతో కలిసే రకం కాదు. ఈ పనిలో నీకు సగం వాటా వుండదు. కానీ నువ్వు వూహించలేనంత ధనాన్ని పోలీసుల బాధ లేకుండా అనుభవించే మార్గం చూపిస్తాను."

గురువులు ఆలోచనలో పడ్డాడు.

శ్రీకృష్ణపరమాత్మ, అతడివంక చూస్తూ "నేనెవరికీ అన్యాయం చేసేవాడిని కాదు. నిజం ముందుగానే చెప్పేస్తాను. నాకు కాస్త ముందుచూపు కూడా యెక్కువ. ఉదాహరణకు ఈ రోజు లలిత అనే అమ్మాయిని చిత్రంగా ఎంగేజ్ చేశాను. ఎందుకంటే ఆమె రామాన్ని కలుసుకోకూడదు. రాము ప్రయాణం విషయం ఆమెకు తెలియకూడదు. తెలిసిందంటే ఆమె రాముం వెంటబడుతుంది. ప్రేమ అలాంటిది. కానీ ఆ ప్రేమవల్ల ప్రయోజనముండదు. అనుకున్న పని రసాభాస అవడం తప్ప!" అన్నాడు.

"అయితే వాళ్ళిద్దరూ ఈ రోజు కలుసుకోలేదా?" అన్నాడు గురువులు.

"లేదు...."

"పాపం-ప్రేమికులు!" అన్నాడు గురువులు. అతడికి ఈశ్వరి గుర్తుకు వచ్చింది. ఇప్పుడామె యెక్కడుందో?

తను జైలునుంచి తప్పించుకుంటానని ముందుగా తెలుసుంటే యెంత బాగుండేది? ఏదో విధంగా ఈశ్వరిని కలుసుకోగలిగి వుండేవాడు.

"లలిత, రామాన్ని కలుసుకోవడం మరొకందుకూడా నాకు యిష్టంలేదు. ఒక ఆడపిల్ల ఒక అల్పాయిష్కుడి చుట్టూ ఆశలల్లుకోవడం నా కిష్టంలేదు" అన్నాడు శ్రీకృష్ణపరమాత్మ.

"నీకు జోస్యం కూడా తెలుసా? లేకపోతే రామం అల్పాయిష్కుడని యెందుకనుకుంటున్నావ్?" అన్నాడు గురువులు ఆశ్చర్యంగా.

"ఈ మాత్రం దానికి జోస్యం తెలియనక్కర్లేదు. అది మన పథకంలోని భాగం. అన్ని గండాలూ గడిచి నిధివరకూ చేరుకుంటే ఆ తర్వాత మీ యిద్దరిలో మిగిలేది గురువులొక్కడే?"

"అంటే?"

"రామం చచ్చిపోతాడు."

"ఎలా?"

"నువ్వే చంపేస్తావు? ఆ హత్య చాలా అవసరం మనకు."

గురువులు ఆశ్చర్యంగా శ్రీకృష్ణపరమాత్మ వంక చూశాడు.

* * *

రాత్రి పదిగంటల ప్రాంతంలో శ్రీకృష్ణపరమాత్మ వచ్చాడు గురువుల్ని వెంటబెట్టుకుని, వాళ్ళను చూస్తూనే రామేశం ఆహ్వానపూర్వకంగా లేచాడు.

"మీ రిప్పుడు జాగ్రత్తగా గురువులుకు అన్నీ చెప్పాలి. వీళ్ళ విజయం మీరు చెప్పిన వివరాలనుబట్టే వుంటుంది.

ఏదైనా ముఖ్యవిషయం చెప్పడం మరిచిపోయారంటే యిద్దరూ కూడా మనకు దక్కరు" అన్నాడు శ్రీకృష్ణ పరమాత్మ.

"గుర్తున్నంత వరకూ అన్నీ చెప్పనే చెప్పాను. గుర్తొచ్చినప్పుడల్లా నా మనవడికి చెబుతూ నేవున్నాను. ఇంక చెప్పాల్సిన విశేషాలు యెక్కువగా వున్నాయను కోను. అయినా మరొక్కసారి వీళ్ళకు ప్రయాణ వివరాలు చెప్పావంటే ఏమైనా సందేహాలుంటే తీర్చుకోవచ్చు" అన్నాడు రామేశం. మరొక్కసారి ఆయన వివరాలన్నీ ఓపిగ్గా మళ్ళీ గురువులుకూ, రామానికీ చెప్పాడు.

అన్నీ చెప్పడం అయ్యేక "ముఖ్యంగా మీరు గుర్తుంచుకో వలసిన విషయం-గంగాపుర గ్రామం సంగతి! మీరు ముందడుగు వేయాలంటే మీకు సాయపడగలవారు ఊరి పెద్దలు మాత్రమే!

అయితే ఓ పట్టాన వారు నిజం చెప్పరు. వారిచేత నిజం పలికించగలిగి వారిద్వారా ఆ ఆటవికుల ప్రాంతాన్ని చేరితే సగం సమస్య తీరినట్లే! అలా కాక దొంగదారిన వెళ్ళాలనుకుంటే మాత్రం మీ యిద్దరూ తిరిగిరావడం అసాధ్యం!

ఆ ఆటవికుల గూడేనికి గంగాపురం గ్రామపెద్దల చేత దారి చెప్పించగలిగారంటే అదే మీకు మొదటి అడుగు. అది యెలా సాధించాలో బాగా ఆలోచించుకోండి. గంగాపుర గ్రామానికి ఏదో మూతా అండదండలున్నాయని నాకు బాగా నమ్మకం. అందువల్ల వారిచేత మీకావల సిన సమాచారాన్ని చెప్పించడం అంత సులభమైనది కాదు" అన్నాడు రామేశం.

"ఎవరి అదృష్టమైనా మొదటి అడుగులోనే వుంటుంది.

నా అదృష్టం మీద నాకు నమ్మకముంది" అన్నాడు గురువులు.

"గురువులూ! నువ్వు శక్తిమంతుడివి. సాహసవంతుడివి. నా మనవడిని నీ చేతుల్లో పెడుతున్నాను. వాణ్ణి అన్ని వేళల్లోనూ కాపాడతానని మాటివ్వు" అన్నాడు రామేశం.

గురువులు తటపటాయించాడు. రామేశం కళ్ళలోని దైన్యం అతడిని కరిగించింది. నాకూ నా గురించి అలా తపించేవాళ్ళుంటే ఎంత బాగుండును? అనుకున్నాడతను. అప్రయత్నంగా ఈశ్వరి అతడి ఊహల్లోకి వచ్చింది.

రామం చిరాగ్గా తాతవంక చూసి "నేనేమైనా పసిబాలుడినా తాతయ్యా! వయసులో గురువులు కంటె ఎంతో చిన్న వుండను. మా ప్రయాణంలో యిద్దరమూ పరస్పరం రక్షించుకుంటాము" అన్నాడు.

"అలాకాదు. నేను గురువులు దగ్గర్నుంచి మాట తీసుకోవాలి" అన్నాడు రామేశం.

"మాటకేముంది గురువులూ-అలా తటపటాయించ కూడదు. వెంటనే యిచ్చేసెయ్" అన్నాడు శ్రీకృష్ణ పరమాత్మ.

వెంటనే గురువులు, రామేశం చేతిలో చేయివేసి "నా ప్రాణాలు పోయేదాకా మీ మనవడిని నేను కాపాడతాను" అని కృష్ణపరమాత్మ వైపు తిరిగి "యీ గురువులు మాట యిచ్చేడంటే దానికి తిరుగుండదు. నేను బ్రతికుండగా ఈ రామం వంటిమీద ఈగ కూడా వాలదు" అన్నాడు.

శ్రీకృష్ణపరమాత్మ నవ్వి "అంతా మన భ్రమ. ఈలోకంలో చేసేదెవ్వరు? చెప్పేదెవ్వరు? మాట ఇచ్చే

దెవ్వరు? తప్పెవ్వరు? అని ఆ భగవంతుడి యిష్టాను సారం అలా జరిగిపోతుంటాయి. నువ్వు లేనిపోని సెంటిమెంట్లు గురించి ఆలోచించకు. సమయానుకూలంగా ప్రవర్తించు. ఏమి చేయవలసివచ్చినా నీదేమీ లేదనుకునీ, నువ్వు నిమిత్తమాత్రుడవనీ గ్రహించి మసలుకో. నీకు విజయమవుతుంది" అన్నాడు.

రామేశం అనుమానంగా శ్రీకృష్ణపరమాత్మ వంక చూసి "భగవద్గీత ద్వాపరయుగం లోనిది. కలియుగంలో మనిషి చేసే పాపాలు మనిషివే! దేవుడివి కావు"— అన్నాడు.

శ్రీకృష్ణపరమాత్మ నవ్వి "భగవద్గీతకు కాలదోషం పట్టించకండి" అన్నాడు.

* * *

"కూర్చోండి" అన్నాడు గంగాపురం ప్రెసిడెంటు.

గురువులు, రామం ఇద్దరూ కుర్చీలో కూర్చున్నారు.

"ఇప్పుడు వివరంగా చెప్పండి మీరు వచ్చిన పనేమిటో?"

గురువులు గొంతు సవరించుకున్నాడు "మీ గ్రామానికి సమీపంలో ఒక ఆటవిక జాతి ఉంటోంది. వారి నివాస స్థానానికి వెళ్ళడానికి దారి చెప్పాలి."

ప్రెసిడెంటు ఆశ్చర్యంగా గురువులు వంక చూసి "నమీపారణ్యంలో ఒక ఆటవిక జాతి వుందని నాకూ తెలుసు. అక్కణ్ణించి ఆటవికులు వచ్చి వెడుతూంటారు. కానీ మా కెవ్వరికీ వారి నివాసస్థలం గురించి తెలియదు. తెలుసుకోవలసిన అవసరం కూడా మాకు లేదు" అన్నాడు.

"మీరిలాగే చెబుతారని ముందే విన్నాను" అన్నాడు గురువులు.

ప్రెసిడెంటు ఆశ్చర్యంగా "ఎవరు చెప్పారు?" అన్నాడు.

"మీ కీర్తి దిగంతాలకు వ్యాపించింది. అది విని మేమిక్కడకు వచ్చాం."

ప్రెసిడెంటు ముఖం మార్చుకుని "మీరు సూటిగా మాట్లాడడంలేదు. చెప్పదల్చుకున్నదేమిటో స్పష్టంగా చెప్పండి!" అన్నాడు.

"చాలా స్పష్టంగా చెప్పాను. ఆటవికుల నివాస స్థానానికి దారి చెప్పాలి" అన్నాడు గురువులు.

"తెలియదని నేనూ చెప్పాను...." అన్నాడు ప్రెసిడెంటు.

"సరే-పోనీ మీ యింట్లో ఆశ్రయమివ్వండి. నాలుగు రోజుల్లో ఆ దారి మేమే తెలుసుకుంటాం" అన్నాడు గురువులు.

"అతిథుల కెప్పుడూ మా యింట ఆహ్వానముంటుంది" అన్నాడు ప్రెసిడెంటు "మీకు భోజనం కూడా నేనే ఏర్పాటు చేయిస్తాను"

"ఆ శ్రమ మీకు అవసరంలేదు. మేము పరమ నిష్ఠా గరిష్ఠులం. ఒకరి యింట ఆతిథ్యం స్వీకరించడానికి ఇష్టపడం" అన్నాడు గురువులు.

ప్రెసిడెంటు వారికో గదిని చూపించాడు. రాముం, గురువులు ఆ గదిలో ప్రవేశించారు. గదిలో రెండుమడత మంచాలున్నాయి—అంతే!

గురువులు గదిని శ్రద్ధగా పరిశీలించాడు. ప్రెసిడెంటు వెళ్ళిపోయాక అతను ఆ గది తలుపులు వేసి రాముం దగ్గరకు వచ్చి—"మనం జాగ్రత్తగా వుండాలి!" అన్నాడు.

"అవును—" అన్నాడు రామం. ప్రెసిడెంటు, గురువులు మాట్లాడుకుంటూంటే రామం ప్రెసిడెంటును జాగ్రత్తగా గమనించాడు. ఆయన కళ్ళలోని క్రూరత్వం ఆపదను సూచించింది.

రామానికి తాతయ్య చెప్పిన మాటలు గుర్తున్నాయి. ప్రమాదంతో కూడిన కార్యమిది. తను ఎలాగో అలా గురువుల్నించి తప్పించుకొని త్వరగా వచ్చేయాలి. ఆ విషయమై ఆలోచిస్తున్నాడతను.

"మనమిద్దరం ఒకరి పథకాలు ఒకరితో చర్చించ కూడదు. నీ పద్ధతిలో నువ్వూ నా పద్ధతిలో నేనూ ఎత్తులు వేసుకుంటూ పోవాలి. గుర్తుంచుకో! నువ్వు అబద్ధాలు చెప్పి వూరి పెద్దల్ని తప్పుదారి పట్టించు. వాళ్ళ చేత నిజం చెప్పించేపని నేను చూసుకుంటాను...." అన్నాడు గురువులు.

రామానికి యిదొక అద్భుతమైన అవకాశమనిపించింది. ఊరి పెద్దల్ని మంచిచేసుకుని తాను బయటపడవచ్చు. గురువులు కేవిధమైన అనుమానమూ రాదు.

గంగాపురం చేరుకోవడం అంత సుకరం కాదు. అక్కడికి బస్సులులేవు. అయిదు కిలోమీటర్ల దూరంలోవున్న మరో గ్రామంవరకూ బస్సులు వస్తాయి. అక్కడ్నించి నడకదారిన గంగాపురం చేరుకోవాలి.

ఉదయం ఏడున్నరనుంచి నడక మొదలుపెడితే పది గంటల సమయానికి గంగాపురం చేరుకున్నారు. ఉదయపు ఎండ వారి శక్తిని చాలావరకూ లాగేసింది. ఊర్లోని చిన్నయ్య హోటల్లో ఫలహారాలు సేవించి మజ్జిగ త్రాగి ప్రెసిడెంటు ఇల్లు చేరారిద్దరూ. ప్రస్తుతం వారిద్దరికీ చాలా

అలసటగావుంది. ఇద్దరూ సాయంత్రం వరకూ నిద్ర పోయారు.

సాయంత్రం నాలుగు గంటలకు ముందు గురువులుకే మెలకువ వచ్చింది. అతను రామాన్నికూడా లేపాడు. ఇద్దరూలేచి తమ బ్యాగులోంచి బ్రెడ్ తీసుకుని తిన్నారు. తర్వాత గురువులు తలుపు తీశాడు.

ప్రెసిడెంట్ ఇంట్లోనే వున్నాడు. గురువులు మాటల కాయన కష్టపెట్టుకున్నట్లు లేదు. ఆప్యాయంగానే యిద్దరినీ పలకరించాడు.

"నాకు తెలియకడుగుతాను. ఆ ఆటవికులతో మీకేమిటి పని?" అన్నాడు ప్రెసిడెంట్ గురువుల్ని గుచ్చి గుచ్చి చూస్తూ.

"ఒక అపూర్వనిధికి వాళ్ళు దారి చూపించగలరు. ఈ విషయం మీకు తెలుసునో, తెలియదో—" అన్నాడు గురువులు.

"అపూర్వనిధి అంటే?" అన్నాడు ప్రెసిడెంట్ ఆశ్చర్యంగా.

"అంటే—ఆ నిధి ఒకమనిషి అనుకోండి. ఈ ఊరులోని అందరూ ఆ నిధిలోని బంగారం తీసుకుని కోటీశ్వరులై పోయారనుకోండి. అప్పుడా మనిషి అనుకొన్న నిధిలో గోరంత బంగారం తరుగుతుందన్నమాట!" గురువులు అన్నాడు.

ప్రెసిడెంట్ పెదవి విరిచి, "అబ్బే—ఆ ఆటవికులకలాంటి నిధులుగురించి తెలిసి వుంటాయని నేననుకోను. ఎవరో మీకు తప్పుసమాచారం అందించారు" అన్నాడు.

"మీరెప్పుడయినా నిధిగురించి ఆటవికులను ప్రశ్నించారా?"

"లేదు. కానీ వాళ్ళగురించి బాగా తెలిసినవాణ్ని-" అన్నాడు ప్రెసిడెంట్.

"అందుకే అడుగుతున్నాను. వాళ్ళగూ దేనికి మీరూ మాతోపాటు రాకూడదూ—ఆ నిధిగురించి వాళ్ళచేత చెప్పించడమేగాక మీకూ అందులో కొంత వాటా ఇస్తాను" అన్నాడు గురువులు.

"ఏదో ఆ పరమాత్ముడిచ్చింది చాలు నాకు, ఇంకేమీ ఆశ లేదు...."

గురువులు నవ్వి—"మీ తృప్తి చూస్తుంటే తరగని నిధి మీకే ఉన్నట్లు అనిపిస్తోంది" అన్నాడు. ప్రెసిడెంట్ ఉలిక్కిపడగా గురువులింకా ఇలా అన్నాడు— "నేను నిధిగురించి చెప్పినప్పుడు మీరేమాత్రమూ కుతూహల పడలేదు. అంటే దాన్నిగురించి మీకు యిప్పటికే చాలా విశేషాలు తెలిసి వుండాలి!"

ప్రెసిడెంటు ఇబ్బందిగా నవ్వి—"అవును, నిజమే! ఆ అపూర్వ నిధిగురించి నేనూ విన్నాను. ఇప్పటికి చాలా మంది వచ్చి నన్నడిగారా నిధిగురించి. ఈ విషయంలో మీరు కొత్తగాదు" అన్నాడు.

"చాలామంది అంటే—నిధిగురించి కనుక్కోడానికీ గ్రామానికి తరచుగా బయటి జనంవస్తుంటారా?" అన్నాడు గురువులు ప్రెసిడెంట్ కళ్ళలోకి గుచ్చిగుచ్చి చూస్తూ.

ప్రెసిడెంట్ గతుక్కుమని—"ప్రత్యేకంగా అందుకని ఎవ్వరూ రారు. సాధారణంగా అడవి ప్రాంతాలవుండే పల్లెటూళ్ళలో చాలా మూఢనమ్మకాలు ముడిపడివుంటాయి. అలాంటిదే ఇదీను. ఎవరింటికయినా బంధువులొచ్చినా ఎవరయినా కొత్తవారీ వూరు వచ్చినా ఏదో నిధివుందను కుంటూంటారు. ఆ నిధిగురించి నన్నే అడుగుతుంటారు.

ఇక్కడే ఏంటిలెండి-ఎక్కడయినా ఉంటుంటాయిలాంటి పుకార్లు. ఆ మధ్య ప్రభుత్వం ఏదో రాజుగారి కోటలో నిధివుందని తవ్వకాలు తవ్వించింది. సుభాష్ చంద్రబోస్ బ్రతికున్నాడని ఇప్పటికీ ఎన్నో పుకార్లు చెప్పుకుంటూం టారు. అలాంటిదే ఇదికూడా" అన్నాడు.

ప్రెసిడెంట్ చాలా తెలివైనవాడని రామం, గురువులు ఇద్దరూ గ్రహించారు.

"మీ మాటలు బాగానే వున్నాయి. కానీ నిధిగురించి చాలామంది మీ దగ్గరకే వస్తూంటారని అంటున్నారు. కారణమేమిటో?" అన్నాడు గురువులు.

"ఊరి ప్రెసిడెంటును. కలిగినవాణ్ని. నలుగుర్నాదరించగల దన్నుగలవాణ్ని. ఈ ఊర్లోని పెద్దమనుషులందర్లోకీ పెద్దమనిషిని" అన్నాడు ప్రెసిడెంట్.

"వీటన్నింటికి కారణం మీకా నిధిగురించి తెలియడం వల్ల కాదుగదా!"

గురువులు మాటలకు చురుక్కుమని చూశాడు ప్రెసిడెంటు. అతను చాలా తెలివైనవాడని ఆయన పసిగట్టేడు. ఆయన బుర్రలో రకరకాల ఊహలు గిరగిరా తిరుగుతున్నాయి.

"మీరలాగనుకుంటే మాత్రం నాకొచ్చిన యిబ్బంది ఏముంది?" అన్నాడాయన.

గురువులు నవ్వి "ఇబ్బందంటే ఇబ్బందేమరి. మీకు నిధిగురించి తెలుసుననుకుంటే మిమ్మల్నో పట్టాన వదలను గదా!" అన్నాడు.

"మనుషుల్ని వదిలించుకోడం నాకు బాగా తెలుసు" అన్నాడు ప్రెసిడెంట్.'

గురువులు నవ్వాడు. ఆ నవ్వులో హేళనవుంది.

ప్రెసిడెంటుకూడా ఎక్కువగా మాట్లాడలేదు. తరువాత గురువులు, రామం కాసేపు ఊర్లో తిరిగి వచ్చారు.

గంగాపురం పెద్ద గ్రామంకాదు. జనాభా రెండు వేలకు మించదు. సాధారణంగా అలాంటి గ్రామంలో సరయిన సదుపాయాలుండవు. గంగాపురంలో ఇద్దరు మంచి డాక్టర్లున్నారు. ఓ మెడికల్ షాపు వుంది. అందులో దొరకని మందులు లేవు. రెండుమూడు మంచి దుకాణాలున్నాయి. వాటిలో పట్నంలో దొరికే ప్రతి ఫ్యాన్సీ ఐటమూ దొరుకుతుంది.

ఊరికి పెద్దమనుషులుగా పరిగణించబడే పదిమందినీ, మధ్యతరగతి వాళ్ళనో పాతికమందినీ తప్పిస్తే మిగతా వాళ్ళందరూ కష్టజీవులు. వారి పరిస్థితికూడా దయనీయంగా వుంది. పెద్దమనుషులకు సేవ చేయడం కోసమే బ్రతుకుతున్నట్లున్నారు వాళ్ళు.

గురువులు, రామంతో "రేపోరోజు ఈ పేదవాళ్ళందర్నీ పలకరించి వస్తాను. పెద్దమనుషులంటే వాళ్ళకు గౌరవభావమున్నట్లు లేదు" అన్నాడు.

"ఎవరెవరు ఏం చేయదల్చుకున్నదీ ఒకరితో ఒకరు ముందుగా చెప్పుకోకూడదని నువ్వే అన్నావు" అన్నాడు రామం.

గురువులు చిత్రంగా రామంవంక చూసి "గుడ్, ఒప్పందాన్ని స్ట్రిక్టుగా పాటించే వాళ్ళంటే నాకూ ఇష్టమే!" అన్నాడు.

ఊళ్లో పళ్ళు కొనుక్కుని తిన్నారు. చిన్నయ్య హోటల్లో మజ్జిగ తాగారు. రాత్రి యెనిమిదిగాకుండా ప్రెసిడెంట్ ఇల్లు చేరారు.

"ఎలావుంది మా వూరు?" అన్నాడు ప్రెసిడెంటు.

"ఇండియాలాగే వుంది" అన్నాడు గురువులు.

"మీరు చాలా చమత్కారంగా మాట్లాడతారు. కానీ ఒక చిన్న మనవి. రాత్రి పడుకోబోయేముందు ఆటవికుల గురించి ఆలోచించకండి. ఒక దేవతవుందా ఆటవికులకు. నాగరికులు తమ గూడెంలో అడుగుపెట్టడం ఆ దేవతకిష్టముండదంటారు. అటువంటి కోరిక యెవరయినా నాగరికులకు కలిగితే ఆ దేవత తన అపూర్వ శక్తులతో శిక్షిస్తుందట" అన్నాడు ప్రెసిడెంటు.

"మీ ఇంట్లో వుండగానా?" అన్నాడు గురువులు.

"అపూర్వ శక్తులుగల దేవతకు ఈ ఇల్లూ, ఆ యిల్లూ అని ఏమిటి?" అన్నాడు ప్రెసిడెంటు.

"పోనీ మీ ఊళ్లో వున్నప్పుడా?"

"ఆ దేవత శక్తులకు గ్రామాలవధులు సృష్టించలేవని అంటారు...."

"అయితే ఆ దేవతగురించి భయపడక్కర్లేదు. నిధి గురించి ఏవో పుకార్లున్నాయన్నారు చూడండి. అలాంటివే అయుంటాయివీనూ! ఎందుకంటే ఈ ఆటవికులను చూడాలని చాలాకాలంగా అనుకుంటున్నాను నేను. కానీ ఇంతవరకూ ఏ ప్రమాదాలూ జరుగలేదు నాకు. ఈ ఊరు రావడానిక్కూడా అడ్డంకులు ఎదురుకాలేదు...." అన్నాడు గురువులు.

ప్రెసిడెంటు మళ్ళీ గురువులువంక చురుక్కుమని చూశాడు. నువ్వు అతి తెలివిగా మాట్లాడుతున్నావన్న భావం అందులో వుంది. అలా మాట్లాడే మనిషి అంత వరకూ ఆయనకు తటస్థపడ్డట్లు లేదు.

"మీ ఇష్టం. నాకు తెలిసింది నేను చెప్పాను...." అన్నాడు ప్రెసిడెంటు.

తర్వాత ముగ్గురూ విడిపోయారు. గురువులు, రామం తమకని నిర్దేశించబడిన గదిలోకి వెళ్ళారు.

గదిలోకి వెళ్ళాక రామం, గురువులు ఏమీ మాట్లాడుకోలేదు. గురువులు తలుపులు వేశాడు. తర్వాత గదిని బాగా పరిశీలించి చూశాడు. మూల మూలలా పరిశోధించాడు. కిటికీ తలుపులు తీస్తే గదిలోకి చల్లటిగాలివస్తోంది. ఇద్దరూ చెరో మంచంమీదా పడుకున్నారు.

గురువులు మడత మంచంమీద వెల్లకిలా పడుకుని ఆలోచిస్తున్నాడు. అతడికి నిద్ర రావడంలేదు. రామేశం చెప్పిన వివరాలు గుర్తు చేసుకుంటున్నాడు.

"రామం——"

"ఊఁ."

"నీకు దయ్యాలంటే నమ్మకముందా?"

"లేదు. కానీ భయం——"

"నాకు నమ్మకంలేదు" అన్నాడు గురువులు.

"నాకు నిద్రవస్తోంది" అన్నాడు రామం.

గురువులు, రామాన్ని పలకరించలేదు. ఆలోచిస్తున్నాడు. ఈ రాత్రి ఏమైనా జరుగుతుందా? గదిలోకి ఎవరయినా వస్తారా? వస్తే ఎలా వస్తారు?

గురువులు కళ్ళు బాగా చీకటికి అలవాటుపడ్డాయి. గదంతా చీకటిగా వున్నప్పటికీ అన్నీ స్పష్టంగా కనిపిస్తున్నాయి. అతను రామం పక్కవైపు చూస్తున్నాడు. రామంలో కదలిక లేదు.

గురువులు మనసు ప్రమాదాన్ని శంకిస్తోంది. ఆ రాత్రికి నిద్రపోకూడదనే అతననుకున్నాడు. 'తన ముందు కార్య

క్రమం గురించి వివిధ రకాలుగా ఆలోచిస్తూన్న అతనికి హఠాత్తుగా గది పై భాగమున చలనం కనబడింది. అక్కణ్ణించి తలుపులా తెరచుకుంటోంది.

గురువులు చూస్తూండగా పై భాగంనుంచి తలుపు పూర్తిగా తెరుచుకొంది. పైనుంక మూడు ఆకారాలు క్రిందకు దుమికాయి. అంత ఎత్తునుంచి దుమికినా గదిలో రవంత శబ్దంకూడా రాకపోవడం గురువులకు ఆశ్చర్యంగా వుంది.

ఆ ఆకారాలకు నిండా నల్లటి ముసుగువుంది. అతను చూస్తూండగా ఒక ఆకారం గది గుమ్మంవద్దకు వెళ్ళింది. రెండో ఆకారం రామాన్ని, మూడో ఆకారం అలిన్ని సమీపిస్తున్నాయి.

గురువులు మూసీమూయనట్లుగా కళ్ళుమూసి ఆ ఆకారాన్ని గమనిస్తున్నాడు. ఆకారం చేతులు గురువులుముఖం మీదకు వస్తున్నాయి.

అతడు క్షణంకూడా వృధా చేయలేదు. ఛటుక్కున చేయిజాపి ఆ ఆకారాన్ని పట్టుకుని తనమీదకు బలంగా లాక్కుని మెడమీద బలంగా ఒక దెబ్బ వేశాడు. కిక్కురు మనకుండా ఆ ఆకారం మంచంమీద పడిపోయింది.

గురువులు పక్కమీంచి ఛటుక్కున లేచాడు. ఈలోగా మిగతా రెండు ఆకారాలూ అతన్ని సమీపించాయి. ఒకే పర్యాయం గాలిలోకి లంఘించి ఇద్దరి భుజాలమీదా దెబ్బ కొట్టేడు గురువులు.

వాళ్ళా దెబ్బకు కిక్కురుమనలేదు. చలికిల బడ్డారు. గురువులు వేగంగా కదలివెళ్ళి స్విచ్ వేశాడు. గదిలో దీపం వెలిగింది.

"ఇంక మీ ముసుగులు తీయండి" అన్నాడు గురువులు

వాళ్ళను ఆజ్ఞాపిస్తున్నట్లుగా. అప్పుడు ముసుగులలోంచి మనుషులు బయటకు వచ్చారు. అప్పుడే మెలకువ వచ్చి ఆ దృశ్యంచూసిన రామం ఆశ్చర్యపడి "ఏం జరిగింది?" అన్నాడు.

"నువ్వు నిద్రలో వున్నావు. నేను మెలకువగా వున్నాను. వీళ్ళు గది పైభాగంనుంచి క్రిందకు దిగారు. కావడానికి ముగ్గురు. చూడ్డానికి పిసుగుల్లా వున్నారు. నా దెబ్బకు తట్టుకోలేక లొంగిపోయారు. అసలు ఎందుకొచ్చారో ఇప్పుడు చెబుతారు" అన్నాడు గురువులు.

వాళ్ళవద్ద ఒక మత్తుపదార్థం వుంది. అది వాసన చూసినవాడికి సగం మెలకువ వుంటుంది. అవయవాలు స్వాధీనంలో వుండవు. మనిషి ఆ పరిస్థితులలో వున్నపుడు వీళ్ళు దెయ్యాల్లా నటించి భయపెడతారట. ఇది ప్రెసిడెంటు చేసిన ఏర్పాటు.

"ఈ ఏర్పాటువల్ల ప్రయోజనం?" అన్నాడు గురువులు.

"మాకు తెలియదు" అన్నారు ముగ్గురూ.

గురువులు, రామం కలిసి వాళ్ళని తాళ్ళతో కట్టేశారు. తర్వాత ఇద్దరూ నిద్రకు పడ్డారు. "ఈ పర్యాయం నువ్వు నిద్రపో. నేను మెలకువగా ఉంటాను—" అన్నాడు రామం.

"దెయ్యాల రహస్యం తెలిసిపోయిందిగా. ఇంకేమీ ప్రమాదంలేదు. హాయిగా పడుకోవచ్చు—" అన్నాడు గురువులు.

ఉదయం వాళ్ళకు మెలకువ వచ్చేసరికి కాస్త ఆలస్యమయింది. ప్రెసిడెంటు తలుపులు బాదుతున్నాడు. గురువులు తనేవెళ్ళి స్వయంగా తలుపు తీశాడు.

"నిద్రబాగా పట్టిందా?" అన్నాడు ప్రెసిడెంటు గురువులువంక చూస్తూ. ఆయన గదిలోకి చూడలేదు. గురువులు గదిలోంచి బయటకు వెళ్ళాడు.

"పట్టింది కానీ ఒక రాత్రివేళ దెయ్యాలు బాధ పెట్టాయి. చాలా భయంవేసింది. ఈ రాత్రి తెల్లవారుతుందా అనుకొన్నాను" అన్నాడు గురువులు.

ప్రెసిడెంట్ గర్వంగా నవ్వి, "నేను చెప్పాగా—" అన్నాడు.

"ప్రెసిడెంటుగారూ, మీకు దెయ్యాలమీద నమ్మకముందా?"

"ప్రత్యక్షానుభవం జరిగాక నమ్మక తప్పదుగదా— ఇప్పుడు మీక్కూడా నమ్మకం కలిగే వుంటుంది—" అన్నాడు ప్రెసిడెంటు.

"నాకు దెయ్యాలమీద నమ్మకంలేదు. నా అభిప్రాయంలో అవి మనిషి కల్పించుకొన్న భ్రమ" అన్నాడు గురువులు.

"నిన్నరాత్రి అనుభవంకూడా అంతే నంటావా?"

"అవును— అది మీరు కల్పించిన భ్రమ" అన్నాడు గురువులు.

"అంటే మీ అభిప్రాయం...."

"ఏమీలేదు. మీ రెప్పుడూ దయ్యాల్ని చూసి వుండకపోతే అవెలాగుంటాయో చూపిస్తాను - వస్తారా?" అన్నాడు గురువులు.

ప్రెసిడెంట్ తడబడ్డాడు. తర్వాత ఆయన గదిలోని ముగ్గురు మనుష్యుల్ని చూసి మరింత కంగారుపడ్డాడు.

"ఇప్పుడేమంటారు?" అన్నాడు గురువులు.

(సశేషం)

# "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/-లు నగదు బహుమతి పంపుతాము.

# "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 7/-లకే మా ఏజెంట్ ద్వారాగాని, వి. పి. ద్వారాగాని మీ ఇంటిదగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీల కోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరుగనవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు, ఏడాది పైకము రు. 80/-లు ముందుగా పంపితే వారికి కాపీలు 'రికార్డెడ్ డెలివరీ'లో పంపగలము.



# క్రైమ్‌లో తమాషాలు

[ఈ శీర్షికలో ప్రచురించబడే ప్రతి రచనకు రు. 5 లు పారితోషికం ఇవ్వబడును—ఎడిటర్]

## "మిగిలిన చోటు"

ఉస్మానియా హాస్పటల్ ఎంక్వయిరీ ఆఫీసుకు ఒకతను హడావుడిగా పరుగెత్తుక వచ్చాడు.

"సార్! వృదయం మా బంధువొకాయన కడుపులో నొప్పని ఇక్కడకు వచ్చాడు. కాని యింతవరకు యింటికి తిరిగి రాలేదు."

"ఎడ్మిట్ చేసుకున్నారో ఏమో—వార్డులలో చూసి, దర్యాప్తుచేయండి."

"అన్ని వార్డులలో వెతికాను సార్! ఎక్కడా లేదు."

"అయితే, మార్చురీ రూంలో వున్నాడేమో చూసి రండి!!"

—చావా విమలారామం, హైదరాబాదు.

## ఇద్దరూ ఇద్దరే

ప్రముఖ పారిశ్రామికవేత్త పరాంకుశంగారి కుమారుడు ఆనంద్ రిసీవర్ ఎత్తి ఎవరికో డైల్ చేశాడు. అట్నుంచి రెస్పాన్స్ రాగానే "హలో ఎవర్రా అ మాట్లాడుతుంది?" కోపంగా గర్జించాడు.

"స్టుపిడ్! యెవరితో మాట్లాడుతున్నావో తెల్సా. నేను సూపరెండెంటుగా రబ్బాయిని" అట్నుంచి విన్పించింది.

"ఏడిశావ్? నువ్వూ నీ మొహమూను పిగ్ పెలో."

"యూ మంకీ బ్రూట్! నీకంత పొగర్రా. చూడ్రా నిన్నేం చేస్తానో."

"ఆ ఘోరించావ్‌గాని, నిన్న చెప్పిన పనేం చేశావు?"

"ఓ అదా! ఆ ఇద్దర్నీ గుట్టుచప్పుడు కాకుండా చంపి పారేశాను. ఇక మూడోవాడే మిగిలాడు."

"వాడెవడు?"

"ఇంకెదు. నువ్వే!"

"హహ్హహ్హా! నన్ను చంపుతావా, నన్ను చంపడం నీ తరంకాదు."

"హహ్హహ్హా! ఎందుక్కాదో చూస్తాను. ఇవాళరాత్రి పన్నెండుగంటల, పదినిమిషాల ఎనిమిది సెకండ్లకు నీ చావుకి ముహూర్తం పెట్టాను. దమ్ములుంటే కాచుకో!"

"అలాగా! కానీ అదే సమయానికి మూడు నిముషాల ముందు బండికే నీకు, యమలోకానికి టికెట్ రిజర్వేషన్ చేసానని తెల్సుకోలేకపోతున్నావురా ఫూల్! హహ్హహ్హహ."

నవ్వు పూర్తికాక ముందే, ఆనంద్ చేతిలోని రిసీవరు, ఆదరా బాదరా అప్పుడే వచ్చిన పరాంకుశం అందుకొని, ఆనంద్‌కేసి కోపంగా చూశాడు. కుక్కిన పేనులా ఆనంద్ దూరంగా తప్పుకున్నాడు.

"హల్లో! హలో! ఎవరండీ అవతల మాట్లాడుతుంది. నేను పారిశ్రామికవేత్త పరాంకుశం మాట్లాడుతున్నాను."

"క్షమించండిసార్! నేనుసూపరెండెంటు సూర్యనాధ్‌ను మాట్లాడుతున్నాను."

"మీరే క్షమించాలి సార్! ఇంతవరకూ మీతో మాట్లాడింది మా అబ్బాయ్. వాడు పిచ్చివాడు. అందుకని...."

"అలాగా! అయితే మీ వాడు మాట్లాడింది నాతో కాదులే మా వాడితో! వీడు కూడా అదే రేంకు."

"ఆ(!"

—ఎల్. సత్యం, కొత్తూరు.

## దూడ ఖరీదు?

రామేశం కారును స్పీడుగా నడుపుతున్నాడు. హఠాత్తుగా ఓ కోడెదూడ కారుకు అడ్డం వచ్చేసింది.

రామేశం సడన్‌బ్రేక్ వేశాడు. అయినా ప్రయోజనం లేకపోయింది. కారు టైరు దూడ మెడమీద నుంచి పోవటంవల్ల దూడ అక్కడికక్కడే మరణించింది.

రామేశం కారుదిగి చచ్చిన దూడను చూసి, "అయ్యో పాపం దూడ చచ్చిపోయింది. బాధ పడకండి. దీని వెల యెంతో చెప్పండి యిస్తాను" అన్నాడు కోటు పై జేబు లోంచి పర్సుతీస్తూ.

రామేశం చేతిలోని పర్సులోంచి బయటికి తొంగి చూస్తున్న పచ్చకాగితాలను చూడగానే ఆ దూడ యజమాని కళ్ళు జిగేల్‌మన్నాయి.

"ఈ దూడఖరీదు యిప్పుడు వందరూపాయలు. నాలుగు సంవత్సరాలు బాగా మేపితే దీని ధర అయిదొందలకు తక్కువ పలకదు" అన్నాడు దూడ యజమాని.

"సరే. తీసుకోండి" అని, రామేశం నాలుగు సంవత్స రాల తరువాత తారీఖు వేసిన అయిదొందల రూపాయల చెక్‌ను అందించి వెళ్ళిపోయాడు.

—ఎన్. విజేంద్రనాథ్ ప్రసాద్, ఆదోని.

